# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఆకాశ పుత్రులు

రచన: రాజా

## తోడు దొంగలు?

రచన: ఏ. వీ. మోహన్రావ్

## హత్యకు ఆహ్వానం

రచన: అజీజ్

## 90 నిమిషాలలో విమాన ప్రమాదం!

రచన: డా. పెందుర్తి మాస్టర్జీ

"ఖైదీ" సీరియల్ - 21 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—26

ఫిబ్రవరి, 1976

వెల : 3_00 రూపాయలు

ఏడాది చందా 30 రూపాయలు

ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :

శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :

టెంపోరావ్

శ్యాంబాబు

రమణశ్రీ

ఏ. వీ. మోహన్రావ్

సుజనశ్రీ

వసుంధర

కంచర్ల రమణ

కార్యాలయం :

అపరాధ పరిశోధన కార్యాలయం

నారాయణగూడ, హైదరాబాదు_29

ఫోన్_36959

ముద్రణ :

క్రాంతి ప్రెస్,

12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గెడా రంగారావు

# ఆకాశ పుత్రులు

**రాజా**

రాత్రి పదిగంటలు.

సైంటిస్ట్ పృధ్వీరాజ్ లాబరేటరీ ముందాగిన ఫియట్ కారులోంచి హుందాగా క్రిందకి దిగాడు మేజర్ సురేష్ గోయల్.

డోర్ లాక్ చేసి 'కీ' జేబులో వేసుకొని లైట్లకాంతిలో వెలుగుతోన్న లాబ్ బిల్డింగ్ లోకి నడిచాడు.

సింహద్వారానికి ఒక ప్రక్కగా కాలింగ్ బజర్ స్విచ్ బిగించబడి ఉంది. నొక్కాడు దానిని. లోపలెక్కడో బజర్ మ్రోగిన శబ్దం విన్పించింది. తలుపువైపు చూస్తూ నిలబడ్డాడు.

అరనిముషం తర్వాత తలుపులు తెరుచుకొన్నాయి.

బైటకొచ్చిన వ్యక్తిని పరీక్షగా చూసాడు సురేష్. సన్నగా పొట్టిగా ఉన్నాడతను. తెలివంతా కళ్ళలో ద్యోతక మౌతోంది.

"సైంటిస్టు పృథ్వీరాజ్ గారున్నారా అబ్బాయ్?" అడిగాడు తెల్లగా మెరుస్తోన్న మీసాల్ని ఎడమచేతితో నిమురుకొంటూ.

"ఉన్నారండీ!" చెప్పాడతను అణుకువగా.

జేబులోంచి విజిటింగ్ కార్డుతీసి అతని కిచ్చాడు.

"ఢిల్లీ నుంచి మేజర్ సురేష్ గోయల్ వచ్చారని చెప్పబ్బాయ్!" అన్నాడు హుందాగా.

"లోనికొచ్చి కూర్చోండి!" హుషారుగా లోనికి పరిగెత్తాడు అతను.

వెళ్ళి డబుల్ షీట్ సోఫాలో కూర్చొన్నాడు మేజర్ సురేష్. గదంతా చాలా అధునాతనంగా ఉంది.

ఊరికి చివరలో కట్టుకొన్న లాబరేటరీలోకూడా ఇంత అందమైన విశ్రాంతిగది కట్టుకొన్నందుకు మనసులోనే పృథ్వీరాజ్ ను అభినందించాడు సురేష్. గది గోడలకు అలంకరించబడిన అర్ధనగ్నపు సుందరీమణుల చిత్రాలు సైంటిస్టు రసికతను తెల్పుతున్నాయి.

పదినిముషాల తర్వాత ఆదరాబాదరా గదిలోకి పరిగెత్తుకొచ్చాడు పృథ్వీరాజ్. అతనివైపు చూసాడు సురేష్. సుమారు ముప్పై...ముప్పైఅయిదు మధ్య నుంటుంది వయస్సు. ఎరుపురంగులో ఎత్తుగా బలంగా ఉండిఅందంగా ఉన్నాడు.

"క్షమించాలి మిస్టర్ సురేష్...కొంచెం లేటయింది' ఎదురుగా మరో సోఫాలో కూలబడుతూ అన్నాడు పృథ్వీరాజ్.

"ఫరవాలేదులే అబ్బాయ్! నాకేం ఇబ్బంది కల్గలేదు" సిగార్ వెల్గించుకొంటూ అన్నాడు మేజర్ సురేష్.

సురేష్‌ను పరిశీలనగా చూసాడు పృథ్వీరాజ్.

సుమారు అరవైఏళ్ళుంటాయ్ సురేష్‌కి. ఈ మధ్యనే ఆర్మీలోంచి రిటైరయ్యాడు. ఆరడుగుల మూడంగుళాల ఎత్తు, గోధుమరంగు శరీరం, ఒళ్ళంతా కండలు, విశాలమైన ముఖం ప్రాచీనకాలం నాటి రోమన్‌లా ఉంటాడు.

మిలటరీ మనిషని తెల్పుతూ గుబురుగా పెరిగిన తెల్లటి మీసాలు హుందాని కలిగిస్తోన్నాయి అతనికి. అరవై ఏళ్ళొచ్చినా చెక్కు చెదరని ఉక్కులాంటి వ్యక్తి సురేష్.

"నన్ను శ్రీహరికోట రాకెట్ సెంటర్ చీఫ్ విక్రాంత్ సిన్హా పంపాడు, నీతో శుక్రగ్రహ యాత్ర సాగించటానికి."

పృథ్వీరాజ్ కళ్ళు విచిత్రంగా మెరిసాయ్.

"గ్లాడ్ టు మీట్ యూ..." అన్నాడు సురేష్ చెయ్యి నొక్కుతూ.

"నేనూ విక్రాంత్ చిన్నతనంనుంచీ ఫ్రెండ్స్! నేను మిలటరీ దారి ఎన్నుకొంటే, వాడు స్పేస్‌రూట్ పట్టాడు. నీ కోరిక ప్రకారం యాత్ర సాగించటానికి అనువైన మనిషి కోసం చూస్తే నేను గుర్తొచ్చి నాకు కబురు పంపాడు. పనీ పాటా లేక విసుగెత్తిపోతోన్న నాకు ఈ మాట వినగానే చెవుల్లో అమృతం పోసినట్లయి వెంటనే పరిగెత్తుకొచ్చాను."

చిరునవ్వు నవ్వాడు పృథ్వీరాజ్.

"చాలా థాంక్స్ మిస్టర్ సురేష్. కాని శుక్రగ్రహం వెళ్ళటం అంటే మాటలుకాదు. నేను వేసిన అంచనాలో

ఏ చిన్న తేడా వచ్చినా అంతరిక్షంలో మసయిపోతాం. ఒకవేళ క్షేమంగా శుక్రగ్రహానికి చేరుకొన్నా తిరిగి వస్తామనే నమ్మకం లేదు. అందుకే నాతో రావటానికి నా అసిస్టెంట్స్ తిరస్కరించారు.

పోతే నేనా, బ్రహ్మచారిని! నా గురించి పట్టించుకొనే వాళ్ళు గాని, విచారించేవాళ్ళుగాని ఎవరూలేరు.

ఇక మీ సంగతి! మీ పై ఆశలు పెట్టుకొని ఎదురు చూసేవారు ఎందరో ఉండొచ్చు. తిరిగి క్షేమంగా వస్తామనే నమ్మకంతోగాని ఈ యాత్ర సాగించటానికి ఒప్పుకొంటే వెంటనే కాన్సిల్ చేసుకోమని నా ఎడ్వైజ్."

"నా విషయంలో చాలాపొరపాటు పడ్డావబ్బాయ్!" కళ్ళు మూసుకొని తృప్తిగా సిగార్ గుండెల్లోకంటా పీలుస్తూ అన్నాడు సురేష్. "నా భార్య గతించి పదేళ్ళయింది. నాకున్న వక్కగానొక్క కొడుకూ న్యూయార్క్‌లో ఇండియన్ ఎంబసీ ముఖ్యోద్యోగిగా పని చేస్తున్నాడు. అతని అనుమతిమీదే నేనీ యాత్రకు ఒప్పుకొన్నాను. ఈ విషయంలో నా కేలాంటి సందేహం లేదు."

"థాంక్యూ వెరీమచ్ సురేష్‌జీ! మీ మాటలు నాలో ఉత్సాహాన్ని ఇనుమడింప చేస్తున్నాయి. కమాన్ మన అంతరిక్ష నౌకను మీకు ఇంట్రడ్యూస్ చేస్తాను" హుషారుగా లేచాడు పృధ్వీరాజ్.

"ఆ విషయం తర్వాత చూడొచ్చబ్బాయ్! ముందీ సంగతి చెప్పు. ఇండియన్ స్పేస్ సెంటర్స్‌లో ఎంతో మంది సైంటిస్టు లుండగా, నీకు సహాయంగా రావటానికి వాళ్ళని కోరక ధైర్యవంతుడు, ఎలాంటి ప్రమాదాలనైనా

ఎదుర్కొనే సాహసవంతుడిని సైన్సు పరిజ్ఞానం లేక పోయినా ఫర్వాలేదని ఎందుకు కోరింవ్?'' అడిగాడు సురేష్ సోఫాలోంచి లేస్తూ.

నవ్వాడు సైంటిస్ట్. "చూడండి సురేష్‌జీ! నా ఉద్దేశ్యంలో శుక్రగ్రహంలో జీవులున్నాయనేది నిజం. మనం అక్కడకు వెళ్ళింతర్వాత వాళ్ళనుంచి మనకు ప్రమాదం కలగవచ్చు. సైంటిస్టుగా నేను నా బాధ్యతలు నేరవేర్చ గలను. పోతే నాకూ అక్కడ ప్రమాదాలనుంచి రక్షణ కావాలి. నాతో కలిసి మరో సైంటిస్ట్‌ను తీసుకెళితే ఫలితం ఏముంది. అందుకే అలాంటి లక్షణాలు కలిగిన వ్యక్తిని అడిగాను సహాయానికి. నా అదృష్టంకొద్దీ ఒక యుద్ధవీరుడు దొరికాడు'' అన్నాడు తృప్తిగా. తర్వాత సురేష్‌ని తీసుకెళ్ళి అంతరిక్షనౌకను పూర్తిగా త్రిప్పి చూపించాడు.

అరగంటసేపు అంతా తిరిగిన తర్వాత_

"రేపు సాయంత్రానికల్లా ఇక్కడుంటూ నబ్బాయ్! రాత్రి తొమ్మిదిన్నరక్కడా బైలుదేరేది!'' అన్నాడు మేజర్ సురేష్.

"రాత్రికిక్కడే ఉండిపోకూడదూ?''

"సారీ నాకొక్కద్దిగా పనులున్నాయి. తొందరగానే వచ్చేస్తాను. గుడ్ నైట్!'' బైటకు కదిలాడు. మరి కాస్సేపట్లో కారు స్టార్టయిన శబ్దం విన్పించింది.

పృథ్వీరాజ్ తలలో శుక్రగ్రహం మెదులుతోంది. నాలుగురోజుల్లో దాని సంగతికూడా తేలిపోతుందనుకొంటూ, అంతరిక్షనౌక దగ్గరకు తిరిగి నడిచాడు.

# 2

రాత్రి తొమ్మిది గంటలకు సైంటిస్ట్ పృధ్వీరాజ్ లాబ్ అంతా కోలాహలంగా ఉంది.

శాస్త్రజ్ఞులు, ప్రభుత్వోద్యోగులు అటూ ఇటూ తిరుగుతున్నారు. మేజర్ సురేష్, రాకెట్ సెంటర్ చీఫ్ విక్రాంత్ లోనికొచ్చారు. పృధ్వీరాజ్ తో కలిసి ఏదో కలిసి మాట్లాడుకొంటూ అంతరిక్షనౌక దగ్గరకు వెళ్ళారు. స్పేస్ షిప్‌ను అన్నివిధాలా చెక్ చేసిన సైంటిస్ట్స్ తమ రిపోర్ట్‌ను విక్రాంత్ కందించారు.

పరిశీలించి తృప్తిగా తలూపాడు విక్రాంత్. వాచీ చూసుకొన్నాడు పృధ్వీరాజ్. తొమ్మిదీ ఇరవై అయి దయింది.

"ఇక మేం బయలుదేరుతాం మిస్టర్ విక్రాంత్" అన్నాడు పృధ్వీరాజ్.

"ఓ. కె. మీరు విజయం సాధించి తిరిగి క్షేమంగా వస్తారని ఆశిస్తాను. కాని ఒకటిమాత్రం మర్చిపోవద్దు. శుక్రగ్రహంలో మొదటగా అడుగుపెడుతున్నది మనం. కాబట్టి ఈ విషయంలో వచ్చే కీర్తి మనకే దక్కుతుంది.

మీ ఊహప్రకారం అక్కడ నిజంగా జీవులుంటే వీలైతే మన ప్రభుత్వాన్ని వారు గుర్తించినట్లుగా ఒక పత్రాన్ని వారినించి తీసుకోండి. లేదా ఎలాగూ మన విజయాన్ని చాటుతూ మన జాతీయ పతాకాన్ని అక్కడుంచుతారుగా" నవ్వుతూ పల్కాడు విక్రాంత్ సిన్హా.

"ఇట్స్ ఆల్ రైట్...కమాన్ మిస్టర్ సురేష్!" స్పేస్ షిప్ లోనికి నడిచాడు సైంటిస్ట్. అతన్ని అనుసరించాడు మేజర్ సురేష్. నౌక తలుపులు మూసుకుపోయాయి.

అందరూ ఖార్ఖానాలోంచి బిల్డింగ్‌లోకి వెళ్ళిపోయారు. టెలివిజన్ ముందు కూర్చొని ఆన్ చేశాడు విక్రాంత్. బోర్లించిన తొట్టిలా స్పేస్ షిప్ కనిపిస్తోంది. స్క్రీన్‌మీద. వాచీ చూసుకొన్నాడు. కౌంటింగ్ బిగిన్ కావటానికి ఇంకో నిముషం సమయముంది.

కాబిన్‌లోకి చేరుకొని తమ సీట్లలో కూర్చొన్నారిద్దరూ. టెలివిజన్ స్క్రీన్‌పై ముందు గీతలు కన్పించి పావునిముషం తర్వాత ప్రెసిడెంట్ ఆఫ్ ఇండియా ముఖం గంభీరంగా కన్పించింది.

"హల్లో సర్!" అన్నాడు పృధ్వీరాజ్. మేజర్ సురేష్ సిగార్‌ను కంగారుగా నోట్లోంచి బైటకు తీసాడు.

"మై డియర్ ఫ్రండ్స్! మీ ఈ పరిశోధన విజయవంతమై ఈ అంతరిక్ష యుగానికే మార్గదర్శక మాటమే కాక మన దేశానికి ఎంతో పేరు ప్రఖ్యాతులు ఆర్జిస్తుందని ఆశిస్తాను. విష్ యు బెస్ట్ ఆఫ్ లక్" చిరునవ్వుతో అన్నారాయన.

"థాంక్యూ సర్!" అన్నారిద్దరూ.

ప్రెసిడెంట్ ముఖం స్క్రీన్‌పై మాయమయింది. ఆ స్థానే విక్రాంత్ కన్పించసాగాడు.

కౌంటింగ్ ప్రారంభమయింది.

పృధ్వీ చకచకా మీటలు నొక్కాడు. స్పేస్ షిప్ అన్నివైపులా మూసుకుపోయింది. దాని చుట్టూ బిగించబడి వున్న క్రేన్స్ విడిపోయాయి.

"త్రీ...టూ...వన్...జీరో..." విక్రాంత్ అర్చాడు మైక్‌లో.

రియోస్టాట్ మీట పట్టుకొని బలంగాలాగాడు పృధ్వీ. భయంకరంగా ప్రేలింది నౌక అడుగుభాగం. క్రింద నించి

ఇంధనం అంటుకొని వేగంగా నేలపైకి దూసుకెళ్ళసాగాయి జ్వాలలు. ఖార్ఖానా అంతా దద్దరిల్లిపోతోంది.

విపరీతమయిన శబ్దంతో "జూమ్" అంటూ రోదసీ నౌక పైకి లేవటం ప్రారంభించింది. ప్రేలుళ్ళు తగ్గాయి.

పృథ్వీరాజ్ చకచకా స్విచ్‌లన్నీ వేసాడు.

అంతరిక్ష నౌక వేగాన్ని పుంజుకొంది. స్పీడా మీటర్‌లో ముల్లు సెకనుకు అయిదువందల కిలోమీటర్లు చూపుతోంది. భూభ్రమణానికి ఎదురుదిశగా స్పర్శ రేఖలో ప్రయాణిస్తోంది నౌక. కేంద్ర ప్రసారిత శక్తి నౌకను తూర్పుగా లాగుతోంది.

సురేష్ సిగార్ తీసి వెలిగించుకొంటూ అద్దాలలోంచి బైటకు చూసాడు. ఎటు చూసినా శూన్యం...అంతు లేని శూన్యం...ఆ శూన్యంలో ఎన్నో గ్రహాలు కన్పిస్తూ ఉక్కిరి బిక్కిరి కల్గిస్తున్నాయి.

అతని దృష్టి క్రిందకి మరలింది. నీలి కాంతితో నారింజ రంగు వెదజల్లుతూ భూమి సాక్షాత్కరించింది. ఖండాలు సముద్రాలు కలిసిపోయి ఒకేలా కన్పిస్తున్నాయ్.

గంటలు గడుస్తున్నాయ్. వేగంగా ప్రయాణం చేస్తోంది నౌక.

రానురాను భూమి చిన్నదయిపోతోంది. దగ్గరలో ఏదో గ్రహం కన్పిస్తూ అంతరిక్ష నౌక దానివైపు ప్రయాణిస్తోంది.

"మూన్!" అరిచాడు సైంటిస్ట్ నౌక కక్ష్యను మారుస్తూ. చంద్రుని ఆకర్షణ శక్తి నౌకను స్వల్పంగా లాగుతోంది.

పావుగంట తర్వాత చంద్రకక్ష్యలో నాలుగు ప్రదక్షి

ణాలు పూర్తి చేసి నౌక శుక్ర గ్రహం వైపు ఉరికింది. సురేష్ వైపు చూసాడు పృధ్వీరాజ్. సిగార్ పీలుస్తూ అంతరిక్షంలోకిచూస్తున్నాడు తన్మయత్వంగా.

"అబ్బాయ్!" పిల్చాడు సురేష్.

"ఏమిటి?"

"అదేకదూ శుక్రగ్రహం?" దూరంగా అస్పష్టంగా కన్పిస్తోన్న ఒక గ్రహం వైపు వేలుచూపిస్తూ అడిగాడు.

"అవును!"

"ఎంత దూరం ఉంటుందిక్కడికి?"

లెక్కలు కట్టాడు పృధ్వీరాజ్.

"సుమారు రెండున్నర కోట్ల మైళ్ళు!"

"ఎన్నాళ్ళు పడుతుందంటావ్ చేరుకోటానికి?"

"ఈ వేగంతో వెళ్తే నలభై గంటలు చాలు!"

ఆశ్చర్యంగా చూశాడు సురేష్.

పృధ్వీరాజ్ అంతా ఒకసారి చెక్ చేసి తృప్తిగా నిట్టూరుస్తూ ఫుడ్ టాబ్స్ నోట్లోకి వేసుకొని చైర్ లో వెనక్కి వాలి కళ్ళు మూసుకొన్నాడు. బాగా అలసి పోయిన అతని శరీరం నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోయింది.

# 3

సురేష్ గట్టిగా కుదుపుతోంటే తృళ్ళిపడి లేచాడు. "ప్రమాదం ముంచుకొస్తోం దబ్బాయ్..." అర్చాడు సురేష్. పృధ్వీ టేబిల్ పైకివాలి టెలిస్కోప్ ముందుకు నెట్టాడు ముఖాన్ని.

"మైగాడ్...ఉల్కాపాతం..." ఇంజన్ బోర్డు పైకి విజృంభించి చకచకా స్విచ్ లు కదుపుతూ నౌక కక్షలను మారుస్తున్నాడు.

శుక్రుడి వైపు దూసుకుపోతున్న అంతరిక్ష నౌక ప్రక్కకు తిరిగింది. భయంకరమైన ఉల్కాపాతం శూన్యంలోకి ప్రయాణిస్తూ నౌకవైపు దూసుకొస్తోంది. అందులోని అతిస్వల్పమైన ఉల్కచాలు నౌకను భస్మీపటలం చేయటానికి.

మహోజ్వల వేగంతో ప్రయాణిస్తూ అంతరిక్షంలో నెబ్యులాగా మండిపోతోంది. అక్షికటకానికి కన్ను అప్పగించి నౌకను నడుపుతున్నాడు పృథ్వీ.

కాలం గడుస్తోంది. నౌకకు అతిసమీపంలోకి చేరుకొంటోంది ఉల్కాపాతం. సైంటిస్ట్ వేళ్ళు స్విచ్‌లపై కదులుతున్నాయి మెరుపులా.

పెద్ద కుదుపులతో దేన్నో గుద్దుకొన్నట్లు ఆగిపోయింది, అంతరిక్ష నౌక శూన్యంలో. విసురుగా వెళ్ళి ఇంజన్ బోర్డును గుద్దుకొంది సురేష్ తల. నోట్లో చుట్ట క్రిందకి రాలిపోయింది.

అరసెకను కాలంలో ఉల్కాపాతం ప్రక్కనుంచి దూసుకుపోయింది మరో దిశగా. స్పేస్ షిప్ ఆ వేగానికి దడదడ లాడిపోయింది. ఆ రాపిడికి నౌక బయటి భాగం విపరీతంగా వేడెక్కిపోయింది.

చూస్తుండగానే ఉల్కాపాతం కనుమరుగయి పోయింది. పృథ్వీ వ్రేళ్ళు రిమోస్టాట్‌లను నొక్కగానే తిరిగి ముందుకు కదిలింది నౌక.

"థాంక్ ... గాడ్!" గట్టిగా నిట్టూర్చి సైంటిస్టువైపు మెచ్చుకోలుగా చూసాడు.

"అవును ఇలాంటి ప్రమాదాలు ముందుముందు ఇంకా ఎదురవ్వవచ్చు."

దగ్గరలో శుక్రగ్రహం మనోహరంగా కన్పిస్తోంది.

"మరో పది గంటల్లో చేరుకోవచ్చు!" చెప్పాడు పృథ్వీ వాచీచూసుకొంటూ.

శుక్రగ్రహం చుట్టూ అలుముకొన్న దట్టమైన మేఘాలలోంచి సూర్యకాంతి పరావర్తనం చెంది కాంతివంతంగా కన్పిస్తోంది. ఆ మేఘాలు భూమండలంపై నీటిఆవిరి చిన్న స్ఫటికాలు ధూళితో నిండిన మేఘాల వంటివికావు. ఖగోళ శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం శుక్ర మేఘాల్లో ధూళి, మంచు స్ఫటికాలు, కార్బనం, ఫార్మాల్డిహైడ్ అనే విషపదార్థం ఉంటాయి.

అటువంటి మేఘాలు శుక్రుని కప్పి ఉంచటం వలన శుక్రతలాన్ని ఖచ్చితంగా పరీక్షించటానికి శాస్త్రజ్ఞులకు సాధ్యపడలేదు.

శుక్రగ్రహం గురించి తనకు తెలిసిన విషయాలను మననం చేసుకొంటున్నాడు మేజర్ సురేష్.

సమయం గడుస్తోంది. రానురాను శుక్రుడు మరింత స్పష్టంగా కన్పిస్తూ పెద్దదౌతున్నాడు.

ఆరుగంటల తర్వాత శుక్రుడి సమీపానికి చేరగానే ట్రెజక్టరీ సవరణ చేసి కక్ష్యలో ప్రవేశపెట్టాడు నౌకను. ఇరవై నిముషాలనంతరం ఆరు ప్రదక్షిణలు పూర్తి చేసి శుక్రోపరితలం వైపుగా మేఘాలలోనికి ఉరికింది.

మెషిన్స్ పని చేయటం ఆగి ఇంధనం అంటుకొంది. ఎదురు రాకెట్స్ సహాయంతో వేగాన్ని క్రమంగా తగ్గించాడు పృథ్వీరాజు.

దట్టమయిన మేఘాలలోంచి ప్రయాణం చేస్తుండటం వలన ముందేమీ కన్పించటంలేదు. ఎదురుగా ఉన్న

స్క్రీన్స్‌పై కదులుతోన్న రేఖలు బట్టి లెక్కలు వేస్తున్నాడు సైంటిస్ట్.

టెలిస్కోప్ లోంచి శుక్రోపరితలం మసగ్గా కన్పిస్తోంది సురేష్‌కు. గైరోస్కోప్‌ల సహాయంతో అంతరిక్ష నౌకను చుట్టూ త్రిప్పి వెనుక భాగం మొదట దిగేటట్లు చేసాడు.

అతి నెమ్మదిగా ప్రయాణిస్తూ శుక్రతలంపై దిగటానికి సన్నద్ధమౌతోంది నౌక.

పృధ్వీరాజ్ స్విచ్ నొక్కగానే రోదసీ నౌక అడుగు భాగం నుంచి మూడుగొట్టాలు బయటకు చొచ్చుకు వచ్చి స్టాండులా తయారయింది.

సురేష్‌కి సైగ జేస్తూ చైర్ హాండిల్ చుట్టూ వ్రేళ్ళు బిగించాడు.

అరనిముషం తర్వాత ప్రచండమయిన శబ్దంతో శుక్రోపరితలాన్ని తాకింది రోదసీ నౌక.

# 4

కిటికీ అద్దాలలోంచి చుట్టూ వకసారి పరిశీలనగా చూశాడు సురేష్.

ఎటు చూసినా ఇసుక పొరలతో ఎడారిలా కన్పిస్తోందా ప్రాంతమంతా. ఎక్కడ బడితే అక్కడ బ్రహ్మజెముడు మొక్కల్లాంటి పొదలుదట్టంగా కన్పిస్తున్నాయి.

ఐదు నిముషాలు ఆలోచిస్తూ ఉండిపోయాడు పృధ్వీరాజ్. క్రమంగా అతని నుదిటిపై బడిన ముడులన్నీ విడిపోయాయి.

వాచీ చూసుకొన్నాడు. గంట పదయింది.

శుక్రగ్రహంపై సూర్యోదయం అయింది కాబోలు పరిసరాలలో వెలుతురు పరుచుకొంటోంది.

"కమాన్ మిస్టర్ సురేష్!" కుర్చీలోంచి లేస్తూ అన్నాడు. కనుబొమ్మలు పైకెత్తి పృధ్వీరాజ్ వైపు చూసాడు సురేష్.

"క్రిందకి దిగుదామా అబ్బాయ్?" అడిగాడు.

"అవును!"

"మరి ఆక్సిజన్?" సిలిండర్ అందుకొంటూ అడిగాడు. నవ్వాడు పృధ్వీరాజ్.

"కిటికీలోంచి పొదలు కన్పిస్తున్నాయా?"

"అవును! కన్పిస్తున్నాయి."

"మరయితే ఆక్సిజన్ సిలిండర్సెందుకు?"

అర్థమయింది సురేష్‌కి. జేబులోని రివాల్వర్‌ను ఒకసారి తడుముకొని కుర్చీలోంచి లేస్తూ అన్నాడు_

"నీది చాలా బ్రిలియంట్ బ్రెయిన్ అబ్బాయ్! ఆ ఆలోచనే నాకు రాలేదసలు!"

సమాధానం చెప్పకుండా కాబిన్‌లోంచి నడిచాడు సైంటిస్ట్. ఆగి సిగార్ వెలిగించుకొని అతన్ని అనుసరించాడు సురేష్.

మెషిన్‌రూంలోంచి డోర్ దగ్గరకు చేరుకొని స్విచ్ నొక్కాడు పృధ్వీరాజ్. నెమ్మదిగా తెరుచుకొంది డోర్. ఒక్కసారిగా నులివెచ్చని గాలి ఇద్దరి శరీరాన్ని తాకింది.

పృధ్వీ ముఖం వికసించింది. డోర్ ప్రక్కన బిగించబడిన త్రాళ్ళనిచ్చనను బైటకు జారవిడిచి నెమ్మదిగా దిగసాగాడు సురేష్. అతని చేతిలోని రివాల్వర్ ట్రిగ్గర్ నొక్కితే బులెట్‌ను విడవటానికి సిద్ధంగా ఉంది. అతని వెనుకనే దిగుతున్న పృధ్వీరాజ్ నలుప్రక్కలా జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు.

నిచ్చెనను వదిలి నెమ్మదిగా కుడిపాదాన్ని శుక్రోపరితలంపై ఆన్చాడు సురేష్. ఇసుకపై తేలికగా ఆనిందతని పాదం. రెండవకాలును కూడా ఆన్చి నిచ్చెనను వదిలి నాలుగైదు అడుగులు వేసాడు. అతని ముఖంలో ఆశ్చర్యం కదులాడింది.

సాధారణంగా ఇసుకలో అంతదూరం నడిస్తే ఖచ్చితంగా కాళ్ళు కూరుకుపోతాయి. కాని ఇక్కడ ఎంత బరువుగా అడుగులు వేస్తున్నా ఇసుకపై తేలికగా పడుతున్నాయ్.

కొద్దిగా ఇసుక తీసుకొని అరచేతిలో వేసుకొని పరీక్షగా చూసాడు పృధ్వీరాజ్. తళతళా మెరుస్తూ జర జర లాడుతోంది ఇసుక. జేబులోంచి చిన్న ఖాళీ సీసా తీసుకొని ఆ ఇసుకను దానిలో వేసి మూతి బిగించి డోర్ గుండా లోనికి విసిరాడు.

పృధ్వీరాజ్ వైపు చూసాడు సురేష్.

ఆ ప్రక్కనే ఉన్న ఒక పొదవైపు నడిచాడు పృధ్వీ. నాలుగైదు అడుగుల ఎత్తుండి గుబురుగా ఉన్నాయి పొదలు. చేయి చాచి గరుగ్గా ఉన్న ఒక ఆకును తెంచబోయాడు.

మరుక్షణం బుస్‌మంటూ శబ్దం అయింది. చూస్తుండగానే పొద కుచించుకుపోయి బూడిదయిపోయింది విచిత్రంగా.

ఆశ్చర్యంతో తల విదిలించాడు సురేష్. పృధ్వీరాజ్ నొసలు ఆలోచనలతో ముడివడ్డాయి.

ఏదో అనబోతుండగా ఇద్దరిపై నుంచీ నీడ దూసుకెళ్ళింది.

చటుక్కున పైకి చూసాడు సురేష్. అతని చెయ్యి జేబులో దూరి రివాల్వర్ లాగింది. గోళంలాంటి ఆకారం మరోసారి ఇద్దరిపైనుంచీ గిరికీ కొట్టింది. ట్రిగ్గర్ నొక్కబోయాడు సురేష్.

చెయ్యి అడ్డుపెట్టి వారించాడు పృథ్వీరాజ్. అతని తీక్షణమయిన దృష్టి ఆ గోళంమీదే ఉంది.

ఆకాశంలో గిరికీలు కొడుతున్న గోళం నెమ్మదిగా క్రిందికి దిగసాగింది. ఊపిరి బిగబట్టి చూస్తున్నారిద్దరూ.

అకస్మాత్తుగా సురేష్ చెవులు ఏదో శబ్దాన్ని పసిగట్టాయి. ఆ గోళం దిగేకొద్దీ శబ్దం మరింత ఎక్కువై పూర్తిగా దిగేసరికి స్పష్టంగా విన్పించసాగింది.

"వాటె వండర్ ? ఏదో ఇంజన్ శబ్దంలా ఉంది కదూ?" అర్చాడు సురేష్.

పృథ్వీరాజ్ ఏదో ఆలోచిస్తుండగా గోళం తలుపు తెరుచుకొని బైట కొచ్చిందో ఆకారం. దానివైపు చూడగానే ఉలికిపడ్డారిద్దరూ.

ఏడడుగుల ఎత్తుందా శుక్రగ్రహజీవి. కాళ్ళు, చేతులు, తలా...ముమ్మూర్తులా మానవుడిని పోలి ఉంది.

పోతే ఒకటే తేడా. తలమాత్రం ముక్కోణాకారంలో ఉంది. చిన్న ముక్కు, ఆకు పచ్చరంగులో మెరుస్తోన్న కళ్ళు. చెవులు కన్పించటంలేదు. బూడిదరంగు శరీరం.

చేతులు పైకెత్తి, అటూ ఇటూ ఊపుతూ ఏదో అరిచాడు కఠోరంగా.

ఆశ్చర్యంగా చూస్తున్న ఇద్దరూ తేరుకొన్నారు.
"ఏమిటా అరుపు?" కోపంగా చూశాడు సురేష్.

జేబులోంచి కర్చీఫ్ తీసి స్నేహపూర్వకంగా గాలిలో ఊపాడు పృధ్వీరాజ్.

కీచుమంటూ రెండడుగులు వెనక్కి వేసాడు శుక్ర గ్రహజీవి. సురేష్ అయోమయంగా చూస్తుండగా చటుక్కున గోళంలో దూరి తలుపువేసుకొన్నాడు. మరుక్షణంలో ఆకాశంలోకి లేచి కనుమరుగయి పోయింది గోళం.

"పిచ్చివెధవ...ఎందుకలా పారిపోయాడు?" పృధ్వీరాజ్ వైపు చూస్తూ అడిగాడు సురేష్.

పృధ్వీ జవాబియ్యలేదు. ఏదో ఆలోచిస్తున్నాడు. చీకట్లు ముసురుకొన్నాయ్ క్రమంగా.

చూస్తుండగానే ఆకాశంలో ఏదో గ్రహం మసగ్గా ప్రత్యక్షమయింది. ముదురు నారింజరంగులో మసకగా కన్పిస్తోన్న ఆ గ్రహంవైపు కుతూహలంగా చూస్తున్న సురేష్ ఎగిరి గంతేసాడు.

"వాట్ హేపెండ్?"

"భూమి..." అర్చాడు సురేష్.

"వాట్?"

"అవును...ఎర్రే, అదుగో చూడు" ఆకాశంలోకి చూపించాడు. తలెత్తి చూసి తలూపాడు పృధ్వీరాజ్.

మరో పదినిముషాల తర్వాత ఇద్దరూ చెరో రెండు ఫుడ్ టాబ్స్ మ్రింగారు. చుట్టూ ఒకసారి చూసి క్రిందకి వ్రేలాడుతున్న నిచ్చెనవైపుకు కదిలాడు పృధ్వీరాజ్. అనుసరించాడు సురేష్.

# 5

ఉలిక్కిపడి కళ్ళు తెర్చారిద్దరూ ఒకేసారి.

బయటంతా వెలుగ్గా ఉంది. చెవులు చిల్లులు పడేంత ధ్వనులు విన్పిస్తున్నాయి. ఫ్రంట్ విండోస్ దగ్గరకు ఒక

గంతు వేసి బయటకు చూసాడు సురేష్.

అతని ముఖం ఆశ్చర్యంతో విప్పారింది. ఆకాశంలో కనుచూపు మేరంతా ఎగురుతూ కన్పిస్తున్నాయి గాలి పడవలు. చూస్తుండగానే నెమ్మదిగా క్రిందకి దిగసాగాయి. నాకచుట్టూ ఎడారంతా గాలి పడవలతో నిండిపోయింది.

"రా! అబ్బాయ్!" జేబులోని రివాల్వర్ అందుకొని డోర్ వైపు నడిచాడు సురేష్. ఇద్దరూ డోర్ తెర్చుకొని బయటకు వచ్చేసరికల్లా ఆ ప్రదేశమంతా గాలి పడవల లోంచి పైకి చూస్తున్న శుక్రగ్రహవాసుల హర్ష ధ్వానాలతో దద్దరిల్లిపోయింది.

అన్నింటికంటె కొంచెం పెద్దదిగా అందంగా ఉన్న వాయు నాకలోంచి వారి నాయకుడు కొంచెం ముందుకు వచ్చి చేతులు రెండూ పైకెత్తి తలకొంచెం క్రిందకి వంచి అభివాదం చేసాడు.

చూస్తున్న పృధ్వీ సురేష్‌కి సైగజేస్తూ తనూ అదే విధంగా అభివాదం చేసాడు. నాయకుడి ముఖంలో ఆనందం కదులాడింది. శుక్రగ్రహవాసులు మరోసారి హర్ష ధ్వానాలు చేసారు.

నాయకుడు నెమ్మదిగా వాయు నాకలోంచి క్రిందకి దిగి స్పేస్‌షిప్ దగ్గరకు నడిచాడు.

ఆకాశంవైపు ఓసారి తనవాళ్ళ వైపు ఒకసారి చూసి స్పేస్‌షిప్ వైపు తిరిగి ప్రతిజ్ఞ చేస్తున్నట్లు అరనిముషం పాటు ఏదో మాట్లాడాడు. తర్వాత శిరస్సు వంచి వినయంగా నిలబడ్డాడు. మిగిలిన అందరూ అలాగే తలలు వంచారు.

పృధ్వీరాజ్ వైపు చూసాడు సురేష్ ఆసక్తిగా. చిన్నగా నవ్వాడు పృధ్వీరాజ్.

"బహుశా ఆతనితో కలిసి వాళ్ళ నగరానికి రమ్మని కాబోలు అతని ఉద్దేశ్యం!" సాలోచనగా అన్నాడు.

"అయితే ఇంకా ఆలస్యం ఎందుకు?" ఉత్సాహంగా అన్నాడు సురేష్. "వెంటనే వెళ్ళి నాలుగురోజులు సరదాగా గడిపేసి వాళ్ళ రాజుచేత మన ప్రభుత్వాన్ని గుర్తించినట్లు ఒప్పించి హాయిగా వెనక్కి వెళ్ళిపోదాం."

మరోసారి నవ్వాడు పృథ్వీరాజ్.

"బహుశా మీరనుకొంటున్నంత తేలికగా ఈ పని జరగదనుకొంటున్నాను. అయినా వెళ్ళటం ఎలాగూ తప్పదుగదా. కమాన్." నెమ్మదిగా క్రిందకి దిగి వాయు నౌకలో ప్రవేశించాడు.

సురేష్ కూడా ఎక్కగానే ఉత్సాహంగా గాల్లోకి లేచి తూర్పుగా సాగిపోయాయి పడవలు. చుట్టూ ఉన్న రేలింగ్ కు ఆనుకొని శుక్రతలంపై కన్పిస్తున్న ప్రకృతి దృశ్యాలు పరికించటంలో మునిగిపోయాడు పృథ్వీరాజ్.

ప్రక్కనే నిలబడ్డ నాయకుడు, పృథ్వీవైపు చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు.

వాయు నౌక లోపల మెషిన్లు చేస్తున్న ధ్వని చెవులను గళ్ళిక్కిస్తూ వికారాన్ని కలిగిస్తోంది. నాయకుడి వాగుడు భరించలేక లోనికి వెళ్ళాడు సురేష్. గంటన్నరలో ఎడారిని దాటిపోయాయి వాయు నౌకలు.

ఎటు చూసినా ఎత్తైన పర్వతాలు, లోతైన లోయలు కన్పిస్తూ పరవశత్వాన్ని కలిగిస్తోన్నాయ్. నేలమీద విస్తృతంగా పెరిగిన రకరకాల చెట్లు గాలికి తలలూపుతూ అందంగా కన్పిస్తున్నాయి. అకస్మాత్తుగా నౌకలు పయనిస్తోన్న దారిలో ఎత్తైన పర్వతం ఎదురైంది.

నౌకలు వేగంగా ఆకాశంలోకి ఇంకా ఎత్తుకి లేచాయి. పర్వతాన్ని దాటుతుండగా సూర్యకాంతిలో ధగధగా బంగారంలా మెరుస్తున్న శిఖరాన్ని పరవశంగా చూశాడు.

పృథ్వీరాజ్ ముఖంలోకి చూస్తున్న శుక్రగ్రహవాసుల నాయకుడు 'కునారా' అన్నాడు నవ్వుతూ.

'సోనా' అన్నట్లు విన్పించింది.

"సోనా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"కునారా... కునారా." వేలుపెట్టి దూరమౌతున్న పర్వతాన్ని చూపించాడు నాయకుడు.

అంతలో విసురుగా లోనుంచి దూసుకొచ్చాడు సురేష్, ప్రశ్నార్థకంగా చూశాడు పృథ్వీరాజ్.

"ఈ శుక్రగ్రహ వాసులంతా వాగుడు కాయల్లాగుంది, వీడి వాగుడు భరించలేక లోనికి వెళ్తే వీడి లాతోకడు తగిలాడు" విసుగ్గా అన్నాడు.

నాయకుడికి సురేష్ కోపం దేనికో అర్థంకాలేదు. తెల్లబోయి చూస్తున్న అతన్ని చూడగానే సురేష్‌కి నవ్వొచ్చింది.

సురేష్ తిరిగి నవ్వగానే నాయకుడి ముఖం వికసించింది. దగ్గరలోనే నగర పరిసరాలు ప్రారంభమయ్యాయి రానురానూ స్పష్టంగా కన్పిస్తోంది నగరం.

"సో అత్సేర" అన్నాడు నాయకుడు.

"సో అత్సేరా? అదేమిటబ్బాయ్?"

"బహుశా ఈ నగరం పేరేమో!"

నగరంలోనికి ప్రవేశించాయి వాయునౌకలు.

వింత వింత ఆకారాలలో ఉన్న ఎత్తైన భవంతులు కన్పిస్తున్నాయ్ ఎటు చూసినా. లక్షలాది శుక్రగ్రహ ప్రజలు తలలు పైకెత్తి ఆనందంగా అరుస్తున్నారు, మరి

కొన్ని వాయునౌకలలో శుక్రగ్రహ సైనికులు ఎదురొచ్చి వారిపై రకరకాల పువ్వులు జల్లుతున్నారు.

కొద్ది నిముషాలలో వాయునౌక నగరమధ్యలో ఉన్న ఎత్తైన రాజప్రసాదం ముందాగింది. మిగిలినవి మాత్రం ఆకాశంలోనే తిరుగాడసాగాయి.

భవనంపై నుంచి భేరీలు వెలువడ్డాయి. రాజప్రసాదం తలుపులు తెర్చుకొన్నాయ్. లోనుంచి శుక్రగ్రహ రాజు గంభీరంగా నడుచుకొంటూ వాయునౌక వద్దకు చేరుకొన్నాడు. అతన్ని చూడగానే రాజభవనం ముందు గుమిగూడిన వేలకొలదీ శుక్రగ్రహవాసులు వినయంగా తలలు వంచి మోకాళ్ళపై కూలబడ్డారు.

అతనివైపు పరిశీలనగా చూశాడు సురేష్. ఏడడుగుల ఎత్తున్న భారీ విగ్రహం. గుండెలవరకూ పెరిగిన తెల్లటి గడ్డంతో మీసాలుకూడా కలిసిపోయి పురాతన చైనా చక్రవర్తిలా ఉన్నాడు.

ముఖాన వృద్ధాప్య ఛాయలున్నా క్రూరత్వం స్పష్టంగా తెలుస్తోంది. పెద్ద గౌను పట్టావంటి అంగీ ఒళ్ళంతా కప్పుతోంది.

తనవైపు చూస్తున్న ఇద్దరివైపూ ఓసారి తేరిపార చూసి తలవంచాడు వినయంగా. అతని కంఠం ఆ పరిసరాలలో ప్రతిధ్వనించింది.

రెండునిముషాలు ఏకధాటిగా మాట్లాడిన అతని మాటల్లో 'సో అత్సేర, ఆకాశపుత్రా, అయిలీత' అన్న మాటలు తప్ప మిగిలినదేమీ అర్థంకాలేదు సురేష్‌కి.

భవనంపై మళ్ళీ భేరీలు మ్రోగాయ్. శుక్రగ్రహరాజు వెనక్కి తిరిగాడు. వాయునౌక తిరిగి గాలిలోకి లేచి దక్షిణంవైపుగా పరిగెత్తింది.

మౌనంగా పరిసరాలను చూస్తూ నిల్చున్నారిద్దరూ. ఆకాశంలోంచి చూస్తూంటే సో అత్సేర నగరం అద్భుతంగా కన్పిస్తోంది.

ఎత్తైన భవనాలమధ్య రహదారులు విశాలంగా ఉండి ఏవో వాహనాలు ప్రయాణిస్తోన్నాయ్. వాయునౌక నగరాన్ని వదిలి అరణ్యాలపై నుంచి ఎగురుతోంది. చూస్తోండగానే అవీ కనుమరుగయ్యాయి.

అరగంట తర్వాత అత్యంత సుందరమైన ఉద్యానవనంలో ఆగింది వాయునౌక. ఇద్దరూ దిగి దగ్గరలో కన్పిస్తున్న భవనంవైపు నాయకుడి వెంట నడిచారు.

"అయిలీత...అయిలీత..." అంటున్నాడు నాయకుడు. "నీ తలకాయ!" తిట్టుకొన్నాడు సురేష్ వాడేమంటున్నాడో అర్థంకాక.

భవనం దగ్గరకు చేరుకొన్నారు. భవనం ప్రక్కనే మరో రెండు వాయునౌకలు నిల్చి ఉన్నాయి. భవనంలోంచి ఓ అందమైన అమ్మాయి పరిగెత్తుకొంటూ నాయకుడి దగ్గరకు వచ్చింది.

"కోనా!" అన్నాడు నాయకుడు. ఇద్దరూ ఏదో మాట్లాడుకొన్నారు అరనిముషంపాటు. తరవాత నాయకుడు వెనక్కి తిరిగి ఇద్దరికీ వినయంగా తలవంచి సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

"ఆకాశపుత్రా!" పల్కింది కోనా.

నాయకుడివైపు చూస్తున్న ఇద్దరూ కోనావైపు తిరిగారు. వాళ్ళిద్దరూ తనవైపు తిరగగానే భవనంలోకి నడిచింది కోనా, ఆమె ననుసరించి వెళ్ళి విశాలమైన గదిలోకి చేరుకొన్నారు.

కోనా తిరిగి వెళ్ళిపోయింది. గది నలువైపులా కలియ చూశాడు సురేష్.

ఒకవైపు మంచాలు, దాని ప్రక్కనే పెద్ద టేబిల్ పై పళ్ళాల నిండుగా ఏవో పదార్థాలూ కన్పిస్తున్నాయ్. టేబిల్ కిరువైపులా కుర్చీల్లాంటి ఆసనాలున్నాయ్.

"పదా బ్బాయ్! మంచి ఆకలిగా ఉంది" అంటూ టేబిల్ వైపు దూకాడు సురేష్. ప్లేట్లలో ఉన్న పదార్థాలు తినేసి గ్లాస్‌లో ఉన్న ద్రవం త్రాగగానే శుభ్రంగా కడుపునిండి నట్లన్పించింది ఇద్దరికీ.

ఒళ్ళంతా చాలా అలసటగా ఉండటంవలన మంచా లపై చేరగానే కళ్ళు మూతలుపడ్డాయి.

# 6

మేజర్ సురేష్‌కి మెలకువ వచ్చేసరికి బయటంతా చీక టిగా ఉంది. గదిగోడలనుంచి సన్నటి వెలుతురు ప్రస రిస్తోంది.

"గుడ్ మార్నింగ్!" అన్నాడు పృథ్వీ నవ్వుతూ.

మార్నింగ్ అంటూ లేచి నిలబడి అతను చూపించిన బాత్ రూంలోకి నడిచాడు. పావుగంటలో కాలకృత్యాలు తీర్చుకొని బైట కొచ్చేసరికల్లా 'కోనా' తెచ్చిన బ్రేక్ ఫాస్ట్ టేబిల్ పై రెడీగా ఉంది.

ఇద్దరూ చేరొక కుర్చీలో కూర్చొని బ్రేక్ ఫాస్ట్ పూర్తి చేసి, కాఫీలాంటి ద్రవం త్రాగారు. సురేష్ గట్టిగా త్రేన్చి కర్చీఫ్‌తో మూతి తుడుచుకొంటుండగా కోనా గుమ్మంలో ప్రత్యక్షమైంది.

"ఆకాశపుత్రా" పిల్చింది. ఇద్దరూ తలలు త్రిప్పి చూశారు. తనవెంట రమ్మని సైగ జేసి బయటకు కదిలింది. నెమ్మదిగా అనుసరించారు ఇద్దరూ.

రెండునిముషాలలో భవనం పైకి చేరుకొని ఒక గది లోకి దారితీసింది కోనా. ఆమె ననుసరిస్తున్న ఇద్దరూ నెమ్మదిగా గదిలోకి కదిలారు.

గది నలువైపులా చూసిన సురేష్‌కి ఆశ్చర్యంతో కళ్లు తిరిగాయి. చాలా విశాలంగా అద్భుతంగా ఉండి వర్ణించ శక్యం కానంత అందంగా ఉందా గది.

గదిమధ్య సోఫాలో విశ్రాంతిగా కూర్చొని ఆలోచిస్తున్న 'అయిలీత' వాళ్ళని చూడగానే లేచి నిల్చొని వినయంగా ఆహ్వానించింది.

ఆమెవైపు చూసిన సైంటిస్ట్ పృధ్వీరాజ్ కి అడుగు ముందుకు పడలేదు. కళ్ళప్పగించి ఆమెవైపే చూస్తూండి పోయాడు.

కోనా, వాయునౌకల నాయకుడు మాటలబట్టి ఈ భవంతికి యజమానురాలు అయిలీత అని ఊహించాడు కాని, ఆ అయిలీత ఒక అప్సరస అని ఊహించుకోలేక పోయాడు.

ఈ శుక్రగ్రహవాసుల లోకంలో ఏవో కొద్ది పోలికలు తప్ప మనుష్యులలా భూలోకవాసిని పోలియున్న అయిలీతను చూస్తుంటే మతిపోతోంది అతనికి.

ఐదున్నర అడుగుల ఎత్తుండి సన్నగా తీగలా ఉంది అయిలీత. పసుపుపచ్చ వర్ణానికి ఆకుపచ్చ వర్ణానికి మధ్య మిళితమైన వర్ణంలో తళతళా మెరుస్తోందామె దేహం.

పొడుగైన చేతులు, ఎత్తైన రొమ్ములు సన్నటి నడుం, విశాలమయిన భుజాలు, ఆమెకో ప్రత్యేకతను వింత ఆకర్షణను కలిగిస్తోన్నాయ్. చిరుముక్కు, విశాలమయిన కళ్ళు, విల్లులా వంపుతిరిగిన పెదవులు, అయిలీతను అద్భుతమయిన అందగత్తెగా తీర్చి దిద్దాయి.

సురేష్ చెయ్యి భుజంపై పడగానే ముందుకి కదిలాడు. అయిలీత ప్రక్కగదిలోకి కదిలింది. ఆమె ననుసరిస్తూ మరో గదిలోకి వెళ్ళగానే మరోసారి ఆశ్చర్యపోయాడు, ఆ గదిలోని సైన్సు పరికరాలను చూసి.

కుర్చీల్లో కూర్చున్నారు ముగ్గురూ. కుర్చీకి అటూ ఇటూ ఉన్న రిసీవర్స్ వంటివి చెవులకు తగిలించుకోమని సైగ చేసింది అయిలీత, తనూ కూడా రిసీవర్స్ చెవులకు బిగిస్తూ.

ఆమెవైపే చూస్తూ ఇద్దరూ రిసీవర్స్ తగిలించు కొన్నారు.

సురేష్ సిగార్ తేసి వెల్గించుకొని గట్టిగా పొగ పీలుస్తూ కళ్ళు మూసుకొన్నాడు తన్మయత్వంగా.

పృథ్వీరాజ్ వైపే చూస్తున్న అయిలీత సన్నగా చిరునవ్వు నవ్వింది. మరోసారి మైమర్చిపోయాడు పృథ్వీ.

అయిలీత పెదవులు కదిలాయ్.

"మా ఆతిథ్యంలో ఏవైనా లోపాలుంటే క్షమించండి" రిసీవర్స్‌లోంచి స్పష్టంగా విన్పించాయా మాటలు చక్కటి ఇంగ్లీషులో.

తన్మయత్వంగా కళ్ళు మూసుకొని ఉన్న సురేష్ చటుక్కున కళ్ళు తెరిచాడు. అతని నోట్లోంచి చుట్ట జారి తొడపై బడింది. కంగారుగా అందుకొని తిరిగి నోట్లో పెట్టుకొన్నాడు.

పృథ్వీరాజ్ నొసలు ముడిచి అయిలీత వైపు ఆశ్చర్యంగా చూశాడు.

"వాట్! మీకు ఇంగ్లీష్ వచ్చా?" అర్చాడు సురేష్. చిరునవ్వు నవ్వింది అయిలీత.

"రాదు!"

"మరయితే ఎలా మాట్లాడగల్గుతున్నారు?"

"నేను మీ భాషలో మాట్లాడటం లేదు మిస్టర్ సురేష్. మీ చెవులకున్న రిసీవర్స్ నా మాటలను ట్రాన్స్లేట్ చేసి మీ కందిస్తున్నాయ్."

మళ్ళీ నోరు తెర్చాడు సురేష్. అయితే ఈసారి సిగార్ చేతిలో ఉండటంవలన మళ్ళీ డామేజ్ జరగలేదు.

"మిస్. మా గురించి మీకేం తెలుసో చెప్తారా?" ఈసారి అడిగింది పృధ్వీరాజ్.

"ష్యూర్!" అంది అయిలీత. "అసలు మీ అంతరిక్షనౌక మా శుక్రగ్రహానికి బైలుదేరినప్పుడే మీ విషయం మా గ్రహంలో అందరకూ తెలిసిపోయింది. ఎలాగంటే మీ నౌక భూకక్ష్యను దాటగానే రేడియో అండ్ టెలివిజన్ ప్రసారాలకోసం అంతరిక్షంలో పరిభ్రమిస్తున్న అమెరికన్ ఉపగ్రహం ఒకటి ప్రపంచమంతా మీవార్త ప్రసారం చేసింది. ఆ సందర్భంలో అంతరిక్షంలో పరిభ్రమిస్తున్న ధ్వని తరంగాలను ఆకర్షించిన అత్యంత శక్తివంతమయిన మా రేడియో అండ్ టెలివిజన్ రిసీవర్ స్టేషన్లు మీ లోకవాసులతో బాటు ఆ వార్తను అందుకొని ట్రాన్స్లేట్ చేసి అసలు విషయాలను తెలుసుకొన్నాయి. ఆ సందర్భంలోనే టెలివిజన్స్ద్వారా మీ ఫొటోలు తీయబడ్డాయి."

"వండర్! సైన్సులో మాకంటే ఎంతో ప్రగతిని సాధించారన్నమాట!" అన్నాడు పృధ్వీరాజ్.

"లేదు మిస్టర్ రాజ్! సైన్సులో మేం క్రొత్తపుంతలు తొక్కినా కేవలం ఈ ట్రాన్స్లేషన్ మిషన్స్, పవర్ ఫుల్ రేడియో స్టేషన్స్, ఎలక్ట్రానిక్ కార్స్, డామ్స్

లాంటి చిన్న చిన్న విషయాలలోనే పురోగమించాము. కాని మీ అంత అభివృద్ధిని సాధించలేకపోయాం.

మీరు ఎన్నో ఏళ్ళ క్రితం కనుగొన్న విమానాలను మేము, ఈనాడు వాయునౌకల రూపంలో తయారుచేసుకోగలిగాము. మీరు ఈనాడు విస్తృతంగా తయారుచేస్తున్న రాకెట్స్‌ను ఉపగ్రహాలను మేము నిర్మించుకోటానికి కొన్నివందల ఏళ్ళు పట్టొచ్చు.

అంతెందుకు యుద్ధాలొస్తే మా గ్రహవాసులకున్న ఆయుధాలు కేవలం నిప్పు బాణాలనుంచి మిషన్‌గన్నుల దాకా, తోపులనుంచి గ్రినేడ్స్ దాకా మాత్రమే. మీరు యుద్ధాలలో ఉపయోగించే మిసైల్స్, యాంటీ ఎయిర్‌క్రాఫ్ట్ గన్స్ ఎప్పటికి తయారుచేసుకోగలమో ఊహాతీతం.

అఖరికి సాగర గర్భంలో ప్రయాణించటానికి కూడా సబ్ మెరైన్స్, బాతిస్కేప్‌లు లేవు మాకు'' అయిలీత కంఠంలో విచారం సుళ్ళు తిరిగింది.

''ఐయాం వెరీ సారీ మిస్ అయిలీతా. అనవసరంగా మిమ్మల్ని బాధపెట్టాను.'' నొచ్చుకొన్నాడు పృధ్వీరాజ్.

చిన్నగా నవ్వింది అయిలీత. ''ఇందులో అనవసరమనే ప్రసక్తే లేదు. అంతా అవసరమే!''

''దట్సాల్ రైట్! మాకీ ఆతిధ్యం ఇంకా ఎన్నాళ్ళుంటుందో చెప్పగలరా?''

సురేష్ సిగార్ పీలుస్తూ సంభాషణ వింటోన్నాడు.

''మా నాన్నగారినుంచి ఏ విషయం తెలిసేదాకా మీకీ ఆతిధ్యం తప్పదు! అయినా ఏం? అప్పుడే మా లోకం విసుగు కలిగిస్తోందా?'' నవ్వింది అయిలీత సన్నగా.

"మీ నాన్నగారినుంచి వార్తా?" కొంచెం అనుమానంగా చూసాడు.

"అన్నట్లు మా నాన్నగారెవ్వరో మీకు చెప్పలేదు కదూ! సో అత్సేర నగరంలో మీరు కలుసుకొన్న చక్రవర్తే మా నాన్నగారు. ఇది వారి విశ్రాంతి భవనం. అప్పుడప్పుడొచ్చి ఓ నాలుగు రోజులుండి తిరిగి వెళ్తుంటారు. ప్రశాంతంగా ఉండి నా పరిశోధనల కనువుగా ఉంటోందని నే నిక్కడే ఉండిపోయాను" చెప్పింది.

"వాట్...మీరు యువరాణా? అయితే చూడమ్మాయ్...మీ నాన్నగారితో చెప్పి మా దేశాన్ని గుర్తించినట్లు కాస్త వప్పించి పెట్టమ్మా. హాయిగా ఇంటికెళ్ళిపోతాం..." ఠక్కున అన్నాడు సురేష్.

నవ్వింది అయిలీత.

"తప్పకుండా అలాగే చేద్దాం సురేష్‌జీ!" అంది. కోనా నెమ్మదిగా గదిలోకి వచ్చింది.

లేచి నిలబడింది అయిలీత.

"మిగిలిన విషయాలు తర్వాత మాట్లాడుకోవచ్చుగాని ముందు సప్పర్ కానిద్దాం" అంటూ రిసీవర్స్ తీసి కుర్చీపై పడేసింది.

ఇద్దరూ కుర్చీల్లోంచి లేచి నిల్చున్నారు. కోనా వెనుకనే ముగ్గురూ బైటకు కదిలారు. గది దాటుతోంటే తిరిగి మూగవాళ్ళమై పోయినట్లనిపించి నవ్వొచ్చింది సురేష్‌కి.

పృథ్వీరాజ్ ముఖంలో ఏదో తెలియని ఘర్షణ కన్పిస్తోంది సుస్పష్టంగా.

## 7

వారం రోజులు గడిచాయ్. తిని కూర్చోవటం విసుగ్గా ఉన్నా అయిలీత పరిచయం పృథ్వీరాజ్‌లో క్రొత్త

ఉత్సాహాన్ని ఉత్తేజాన్ని కలిగిస్తోంది. ఈ వారంరోజుల్లో ఇద్దరికి శుక్రగ్రహవాసుల భాష చాలావరకు వచ్చేసింది.

సూర్యోదయంతోనే లేవటం, కోనా తీసుకొచ్చిన బ్రేక్ ఫాస్ట్ పూర్తి చేయటం, తర్వాత సప్పర్ టైందాకా అయిలీతతో వైజ్ఞానిక చర్చ, సప్పర్ తర్వాత కొద్దిసేపు నిద్ర, సాయంత్రం అయిలీతతో షికారు—ఇదీ పృధ్వీ రాజ్ దినచర్య.

సురేష్ దినచర్యకూడా ఇదే గాని సాయంత్రం షికారు టైంలో బైటకు రాకుండా ఇంట్లోనే ఉండిపోతాడు కోనాతో.

ఆరోజు మధ్యాహ్నం నిద్రపోయిన పృధ్వీరాజ్ కి తిరిగి మెలకువ వచ్చేసరికి గంట మూడయింది. కిటికీలోంచి నీరెండ లోనికి వస్తూ సాయంత్రం అయిపోతోందని హెచ్చరిస్తోంది. వేగంగా వెళ్ళి బాత్రూంలో దూరాడు.

సురేష్ అప్పటికే బయట కెళ్ళిపోయాడని ఖాళీగా ఉన్న ప్రక్క మంచం తెల్పుతోంది.

షేవింగ్ పూర్తి చేసి ట్రిమ్‌గా బైటకొచ్చేసరికి కోనా టేబిల్ పై ఏవో పదార్థాలు సర్దుతోంది. నిముషాలలో ప్లేట్లన్నీ ఖాళీ చేసేశాడు. కోనా నవ్వుతూ బైటకు నడిచింది.

"హలో డార్లింగ్!" అన్నాడు గుమ్మంలో ఎదురైన కోనాని పలకరిస్తూ గదిలో కొస్తోన్న సురేష్.

కళ్ళు చికిలించి పెదాలు ముడుస్తూ వెక్కిరించింది కోనా. "సిల్లీ గర్ల్" ముక్కు పట్టుకొని ఊపాడు.

సీమ్మిరపకాయలా ఉండే కోనాముక్కుని చూస్తోంటే సురేష్‌కి ఎక్కడలేని సరదా పుట్టుకొస్తుంటుంది. ఆ సర

దాలోనే ధ్వజస్తంభం లాంటి తన ముక్కును వేళ్ళతో నిమురుకోవటంకూడా అలవాటయిపోయిం దతనికి.

కోనా వెళ్ళిపోయింది. లోనికి నడిచి పృధ్వీరాజ్ ప్రక్కన కూలబడి టేబిల్ పై నున్న గ్లాస్ అందుకొని కాఫీలాంటి ద్రవం తాగాడు.

పృధ్వీ గ్లాస్ టేబిల్ పై పెట్టి లేవబోయాడు. సురేష్ ఠక్కున అతని చెయ్యి పట్టుకొన్నాడు.

"కూర్చో...నీతో కొంచెం మాట్లాడాలి," అన్నాడు గ్లాస్ ఖాళీచేస్తూ.

"రాత్రికి మాట్లాడుకోవచ్చు...అర్జంటా?"

"ఓ అయిదు నిముషాలలో లేటేమీ అయిపోదు కూర్చో" చెయ్యి బలంగా లాగాడు.

సురేష్ వైపు విచిత్రంగా చూస్తూ కూర్చొన్నాడు పృధ్వీరాజ్. ఖాళీ గ్లాస్ టేబిల్ పై పడేసి సిగార్ వెలిగించాడు సురేష్.

"రాజ్! నువ్వు అయిలీతను ప్రేమిస్తున్నావ్ కదూ?" సూటిగా ముఖంలోకి చూస్తూ అడిగాడు.

ఓ క్షణం కలవర పడ్డాడు పృధ్వీరాజ్.

"అవును!" అన్నాడు చివరికి.

"మరి అయిలీత కూడా నిన్నే ప్రేమిస్తోందా?"

"తెలియదు!"

"అయితే ముందా విషయం తెల్సుకో!"

విస్మయంగా చూశాడు సురేష్ వైపు పృధ్వీరాజ్.

"కంగారుపడక!" నవ్వాడు సురేష్."అయిలీత కూడా నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తోంది."

"మీ కెలా తెలుసు?" ఆశ్చర్యంగా చూశాడు.

"నల భైవీళ్ళ అనుభవం చెప్తోంది." మళ్ళీ నవ్వాడు సురేష్.

"మరో విషయం 'సో అత్సేర' నగరంలో వాతావరణం అంత బాగుండలేదని నా అనుమానం, ఏ క్షణాన్నైనా విప్లవం లేచి అంతర్యుద్ధం ప్రారంభమయ్యే సూచనలు కన్పిస్తున్నాయ్" గంభీరంగా అన్నాడు సురేష్.

తెల్లబోయాడు పృథ్వీరాజ్.

"ఏమిటి మీ రనేది... ఈ అనుమానం మీ కెలా వచ్చింది?" అయోమయంగా అడిగాడు.

కొంచెం తీక్షణంగా చూశాడు సురేష్.

"అబ్బాయ్! మరీ అయిలీత ప్రేమలో పడి మనస్సుతో పాటు బుర్రకూడా ఇచ్చేసి వెర్రివాడిలా తయారవ్వకు. కొంచెం బుద్ధి ఉపయోగిస్తే నీకే తెలుస్తుంది," లేచి బైట కెళ్ళిపోయాడు.

ఐదునిముషాలవరకూ సురేష్ మాటలనే మననం చేసుకొంటూ కూర్చొండిపోయిన పృథ్వీరాజ్, నెమ్మదిగా లేచి బైటకు నడిచాడు.

భవనం మెట్లపై నిలబడి ఆకాశంలోకి చూస్తున్న అయిలీతను చూడగానే అతని ఆలోచనలన్నీ పటాపంచలై పోయాయ్.

ఉత్సాహంగా అడుగులు వేస్తూ అయిలీతను చేరుకొన్నాడు. పృథ్వీరాజ్‌ను చూడగానే చిరునవ్వునవ్వింది అయిలీత. ఇద్దరూ కొంచెం దూరంలో ఉన్న నదీపాయల వైపు వెళ్లారు.

నది ఒడ్డున కూర్చొని నీళ్ళలో ప్రతిఫలించి మనోహరమయిన రంగులు వెదజల్లుతోన్న సూర్యకిరణాలను పరవశంగా చూడసాగాడు పృథ్వీరాజ్.

"అయిలీతా?" పిల్చాడు పృధ్వీరాజ్.

"ఊ..."

"నేనో మాట అడగనా?" అడిగాడు.

"అడగండి!"

"అయిలీత...నన్ను పెళ్ళిచేసుకొంటావా?"

తక్కున తలెత్తి చూసింది అయిలీత అతనివైపు. ఆకాశంలోకి చూస్తోన్న పృధ్వీరాజ్ తక్కువ కాంతిలో మనోహరంగా కన్పించాడామెకు.

మాట్లాడక పోవటంతో ఆమెవైపుకు తిరిగి మళ్ళీ అడిగాడు పృధ్వీరాజ్.

"వీలుపడదేమో...మరో గ్రహవాసిని వివాహమాడటానికి మా వాళ్ళొప్పుకోరు" తల ప్రక్కకు త్రిప్పుకొని ఒణుకుతున్న కంఠంతో అంది.

"ఆ విషయం నేను చూసుకొంటాను. నీ కిష్టమే కదా?" అడిగాడు.

సిగ్గుతో తలూపిందామె.

పృధ్వీరాజ్ లో ఆనందం ఉరకలేసింది.

అయిలీతను హృదయానికి హత్తుకొని ఉద్రేకంతో ఒళ్ళంతా ముద్దులు కురిపించాడు.

# 8

నిద్రపట్టక మంచంమ్మీద ప్రక్కకి పొర్లాడు సురేష్. పరిస్థితులను ఆలోచించే కొద్దీ విసుగుపుడుతోందతనికి. అయిలీత ఆలస్యానికి కారణం అర్థంకావటంలేదు. అప్పుడే శుక్రగ్రహం చేరి నెల దాటుతోంది. తిని కూర్చోవటం తప్ప చేసే పని ఒక్కటీ కన్పించటంలేదు.

వాచీ చూసుకొన్నాడు సురేష్.

గంట రెండయింది. మంచం దిగాడు. ప్రక్క బెడ్ పై పృథ్వీరాజ్ పడుకొని నిద్రపోతున్నాడు.

బాత్ రూం కెళ్ళి ముఖం కడుక్కొని ఫ్లాస్క్ లోని ద్రవం తీసుకొని త్రాగాడు.

బడలికం తగ్గింది. గోడపైనున్న బటన్ నొక్కాడు. గోడలలోంచి వెలువడుతున్న కాంతి ఎక్కువై గదంతా వెలుతురుతో నిండిపోయింది.

ఏం చెయ్యాలో తోచలేదు సురేష్ కి. గదిలో ఒక మూల రాక్ నిండుగా సైన్స్ బుక్స్ కన్పించాయ్. సైన్స్ అంటే సురేష్ కి చిరాకు.

నెమ్మదిగా టెలివిజన్ దగ్గరకు నడిచాడు. అంతరాత్రి వేళ ప్రోగ్రాములేమీ రావని తెలిసికూడా ఆన్ చేశాడు. గుమ్మంలో అలికిడైంది.

తల త్రిప్పి చూశాడు. కోనా గదిలో కొచ్చింది.

"హాయ్ డార్లింగ్ నిద్ర పట్టలేదా?" అడిగాడు సురేష్.

"లేదు! మీ గదిలో శబ్దం అవుతోంటే మెలకువ వచ్చింది" అంది సురేష్ కూర్చొన్న కుర్చీ కోడుపై కూర్చొంటూ. చెయ్యిపట్టుకొని విసురుగా లాగాడు మేజర్ ఎగిరి ఒళ్ళో పడింది.

"బ్రతికించావ్! నిద్రపట్టక ఒక్కణ్ణే చస్తున్నాను" కోనా ముక్కు గిల్లుతూ అన్నాడు.

టెలివిజన్ చిన్నగా శబ్దం చేస్తోంది. స్క్రీన్ పై గీతలు కదులుతున్నాయ్.

"కోనా! ఏ స్టేషనైనా వస్తోందేమో చూసి, ఏమీ రాకపోతే కట్టేయ్!" కుర్చీలో వాలుతూ అన్నాడు. కోనా ఒడిలోంచి క్రిందకి దూకింది.

సురేష్ పరిశీలనగా చూస్తున్నాడు టెలివిజన్ వైపు. శోనా వ్రేళ్ళు బటన్స్‌పై కదులుతున్నయ్. వేగంగా కదులుతోన్న ఆమె వేలు జర్రున జారి ఒకమూలగా ఉన్న చిన్న బటన్‌ను ప్రెస్ చేసింది.

ఉలిక్కిపడుతూ మరో బటన్‌ను నొక్కబోయింది కంగారుగా.

సురేష్ ముఖంలో రంగులు మారాయ్. మెరుపులా కుర్చీలోంచి లేచి శోనా భుజం పట్టుకొని వెనక్కి లాగాడు.

శోనా ముఖం వాలిపోయింది.

సురేష్ నొసలు ముడివడ్డాయ్. కుర్చీ టెలివిజన్‌కు మరింత దగ్గరగా లాక్కొని ఆసక్తిగా చూడసాగాడు.

భయంతో చిన్నగా ఒణుకుతూ ప్రక్కనే నిలబడింది శోనా.

విశాలమయిన గదిలో ఎత్తైన సింహాసనంపై కూర్చున్నాడు శుక్రగ్రహ చక్రవర్తి. ఆయనకు రెండువైపులా ఉన్న వరుస ఆసనాలలో కూర్చొని ఉండి కన్పిస్తున్నారు శుక్రగ్రహవాసులు చాలామంది.

అంతకు చాలా ముందునుంచీ ఏదో తీవ్రమయిన వాదన జరుగుతున్నట్లు అందరి ముఖాలూ చాలా సీరియస్‌గా ఉన్నాయ్. మహారాజ్ పిడికిళ్లు కోపంతో బిగించి ఏ క్షణాన్నైనా లేడిపై ఉరకబోయే చిరుతపులిలా చూస్తున్నాడు.

ఏదో సీక్రెట్ కాన్ఫరెన్స్ జరుగుతున్నట్లు అర్థమైంది సురేష్‌కి. మరో అనుమానంకూడా వచ్చిందతనికి. కావాలనే శోనా మధ్యలో కల్పించుకొని ఈ కాన్ఫరెన్స్ తనకు తెలిసేటట్లు చేసిందా?

కోనా ముఖంలోకి చూశాడు సూటిగా.

తలొంచుకొంది, ముఖం టెలివిజన్ వైపు త్రిప్పాడు. శుక్రగ్రహ చక్రవర్తికి ఎడమచేతివైపు వరుసలో కూర్చొన్న ఒక పొడుగైన శుక్రగ్రహ వాసి లేచి నిల్చున్నాడు:

"గూసెవ్! నేను చెప్పేది నెమ్మదిగా విను. అనవసరంగా పట్టుదలకు పోయి ఆకాశపుత్రులకు ఆపద తలపెట్టకు. నీ కూతురు వాలకం చూస్తుంటే వాళ్ళకు ఆపద తలపెట్టడం ఇష్టం లేనట్లు ప్రవర్తిస్తోంది.

నీ దురుద్దేశం ఆకాశ పుత్రులకు తెలియదు కాబట్టి మంచిగా, మర్యాదగా ఆకాశపుత్రుల నిద్దరినీ నగరానికి పిలిపించి, జరిగిన ఆలస్యానికి క్షమార్పణ చెప్పుకొని స్నేహం చేసుకో. వాళ్ళిద్దర్నీ చంపేస్తే నీ కొరిగే లాభం ఏమిటో నా కర్థం కావటంలేదు" నచ్చచెపుతున్నట్లు పలికాడు మృదువుగా.

బుసకొట్టాడు చక్రవర్తి గూసెవ్!

"కోనిగీ! స్నేహం పేరుతో ఈ ఆకాశ పుత్రులను వదిలేస్తే ఏం జరుగుతుందో తెల్సా?

"వాళ్ళు తిరిగి క్షేమంగా తమ లోకం చేరుకొన్న మరుక్షణం మహాదుర్మార్గులైన ఈ భూగ్రహవాసులు లక్షల సంఖ్యలో మనపైకి విరుచుకుపడతారు!" కోపంగా అరిచాడు గూసెవ్.

పొట్టిగా ఉన్న మరో శుక్రగ్రహవాసి విసురుగా లేచి నిలబడ్డాడు.

"కోనిగీ! ఈ ముసలినక్క గాడి మాటలు నమ్మకు. ఆకాశపుత్రులతో స్నేహం చేస్తే వాళ్ళ సహాయంతో

వాడికి ఎదురు తిరుగుతా మేమోననే భయంతో నాటక మాడుతున్నాడు. వాడి రాజరికం నిలుపుకోటానికి ఆ ఆకాశపుత్రులని చంపేద్దామని చూస్తున్నాడు’’ ఆవేశంతో ఊగిపోతూ అన్నాడు.

‘‘నోర్మూయ్యరా పుండాకోర్! అధికంగా వాగా వంటే కాల్చేస్తాను’’ అరుస్తూ లేచాడు సింహాసనంలోంచి చక్రవర్తి గూసెవ్.

‘‘ఎవడ్ని బెదిరిస్తావురా గూసెవ్? నేనేం నీ మోచేతి నీళ్ళు తాగే సైనికుడిని కాను. ఈ ఇంజనీర్ లోస్ శుక్ర గ్రహవాసుల ప్రియనాయకుడు అన్న విషయం మర్చిపోకు.

‘‘ఒరేయ్ ముసలిగాడిదా! ఇన్నాళ్ళూ బుద్ధిలేక నీ రాజరికానికి కట్టుబడ్డాంరా! నీ పరిపాలనలో ఈ శుక్రగ్రహ వాసుల జీవితాలు ఎంత అధ్వాన్నంగా తయారయ్యాయో తెల్సా? మంచిగా ఇప్పుడయినా నువ్వు సింహాసనాన్ని విడిచిపెట్టరా. ప్రజల జీవితాలు బాగుపడతాయ్!’’ కోపంగా గర్జించాడు ఇంజనీర్ లోశ్.

‘‘ఏమిటిరా కూస్తున్నావ్... వెధవా? నిన్ను... నిన్ను...! రేయ్! ఎవర్రా అక్కడ?’’ అరుస్తున్నాడు చక్రవర్తి గూసెవ్.

గట్టిగా నవ్వాడు లోశ్.

‘‘ఈ గూసెవ్ గాడికి వయసు మీరిపోయి మతి మరుపు ఎక్కువైపోయింది. సీక్రెట్ కాన్ఫరెన్స్ అన్న విషయం మర్చిపోయి, దర్బారులో కూర్చొన్నట్లు ఫీలయి పోతున్నాడు, వెర్రిపీనుగ’’ పరిహాసంగా అన్నాడు.

లోశ్ అభినయానికి ఫక్కుమన్నారందరూ. గూసేవ్ ఒరలోంచి పొడుగైన కత్తి సర్రునలాగి లోశ్ మీదకు ఎగిరి దూకాడు.

ఈ హఠాత్పరిణామానికి అందరూ నివ్వెరపోయారు. అందరి ముఖాల్లో చక్రవర్తిపట్ల అసహ్యం స్పష్టంగా కనిపిస్తోంది.

ప్రక్కకి దూకాడు లోకేశ్. గూసెవ్ చేతిలోని ఖడ్గం లోకేశ్ భుజాన్ని రాచుకొంటూ దూసుకెళ్ళింది. చిక్కని రక్తం బయటకు ఉరికింది. లోకేశ్ కళ్ళు నిప్పుకణాలైనాయ్.

గూసెవ్ ఖడ్గాన్ని మరోసారి విసరబోతుండగా కోనిగీ వెనక నుంచి వాటేసుకొని ఖడ్గం లాగేసుకొన్నాడు.

"ఒరేయ్ గూసెవ్! నీ రాక్షసత్వానికి నిరంకుశ పరిపాలనకు ఈనాటితో రోజులు తీరిపోయాయిరా. రేపు తెల్లవారే సరికల్లా మర్యాదగా రాజరికాన్ని రద్దుచేసుకొని ప్రభుత్వాన్ని మా కప్పగించు. లేదా ప్రజావిప్లవంతప్పదు. జాగ్రత్త!" గర్జిస్తూ బైటకెళ్ళి పోయాడు లోకేశ్. మిగిలిన వాళ్ళంతా అతనిని అనుసరించారు.

బోనులో పడ్డ పులిలా అటూ ఇటూ తిరుగుతూ లోకేశ్‌ను బండబూతులు తిడుతున్నాడు గూసెవ్. కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయ్. ఆగ్రహంతో ఊగిపోతున్నాడు.

అటూ ఇటూ పచార్లు చేస్తున్న చక్రవర్తి వకమూలగా ఉన్న మెషిన్ దగ్గరకు నడిచాడు.

స్విచ్ నొక్కి 'అయిలీతా' అని గట్టిగా అర్చాడు. రెండు మూడు సార్లు పిలిచాక అవతలినుంచి అయిలీత సమాధానం విన్పించింది.

"అయిలీతా ఆకాశపుత్రులేం జేస్తున్నారు?"

"నిద్రపోతున్నారు!"

"సరే! నేను చెప్పిన పనేం జేస్తావ్?"

మాట్లాడలేదు అయిలీత.

"అయిలీతా! ఇన్నాళ్ళూ నీవు వాళ్ళద్వారా సైన్సు నేర్చుకుంటానంటే, వాయిదాలు వేస్తూంటే సహించాను. కాని ఇంక నాకు ఓపిక లేదు. రేపు తెల్లారేసరికల్లా ఆకాశ పుత్రుల శవాలు వాయునౌకలో నా దగ్గరకు చేరాలి. ఈ వెర్రిపీనుగ లోశ్ గాడు విప్లవం లేవదీస్తాడంట. నా సైన్యం అంతా ఆయుధాలతో పైన విరుచుకుపడితే ఎలా లేవ దీస్తాడో చూస్తాను" గర్జించాడు గూసెవ్.

"ఏం అయిలీతా మాట్లాడవేం?"

"క్షమించండి నాన్నా! నేను ఆకాశపుత్రులను చంప లేను!" వణుకుతున్న కంఠంతో అంది అయిలీత.

"అయిలీతా?" అర్చాడు చక్రవర్తి.

"అవును నాన్నా! సైంటిస్ట్ పృథ్వీరాజ్, నేనూ ప్రేమించుకొన్నాం. మీ అనుమతి అయితే ఆయనతో కలిసి భూగ్రహానికి వెళ్ళిపోతాను."

"అసంభవం! బుద్ధిరిగే మాట్లాడుతున్నావా?" అరి చాడు.

"కాదు! సంభవమే!" ధృఢంగా అంది అయిలీత.

"ఎలా అవుతుందో నేనూ చూస్తాను. నీ కళ్ళముందే ఆ ఆకాశపుత్రు లిద్దర్నీ చిత్రవధ చేసి చంపుతాను," మెషిన్ ముందు నుంచి లేచి లోనికి మాయమయ్యాడు గూసెవ్.

టెలివిజన్ స్విచ్ ఆఫ్ చేశాడు సురేష్.

కోనా ముఖంలోకి చూస్తూ, "వెంటనే వెళ్ళి అయి లీతను పిల్చుకురా!" అన్నాడు గంభీరంగా.

కోనా బైటకు పరిగెత్తింది.

వాచీ చూసుకొన్నాడు. అయిదయింది. 'మరో గంటలో గూసెవ్ సైనికులు ఈ భవనం చుట్టూ క్రమ్ముకోవచ్చు' అనుకొంటూ చకచకా వెళ్ళి పృథ్వీరాజ్‌ను లేపసాగాడు.

# 9

సురేష్ సిగార్ తీసి వెలిగించాడు. అయిలీత, కోనా అతని ముఖంలోకి ఆత్రంగా చూస్తున్నారు. పృథ్వీరాజ్ కళ్ళు మూసుకొని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

"సురేష్‌జీ!" పిలిచింది అయిలీత.

"ఏమిటమ్మాయ్!" అడిగాడు.

"సైనికులు ఇక్కడికి చేరుకోటానికి ఎలాగూ అరగంట పైనే పడుతుంది. ఈలోగా మనమే ఇక్కడినుంచి వాయునౌకలో వెళ్ళిపోయి మీ అంతరిక్ష నౌక చేరుకొంటే?..."

"పారిపోదామంటావా అమ్మాయ్?" నవ్వాడు సురేష్.

"చూడమ్మాయ్ మీ నాన్నగారి సైనికులు ఇక్కడికి వచ్చేసరికి మనం లేకపోతే ఏమౌతుందో తెల్సా? వాళ్ళను మానం నేరుగా మా అంతరిక్ష నౌక మీదకు పోతుంది. సో అత్సేర నగరం అడ్డవటంవలన మనం చుట్టూ తిరిగి ఆలస్యంగా అక్కడికి చేరేలోగా, ఇక్కడికి వచ్చిన సైనికులు తిరిగి స్పేస్ రాకెట్ దగ్గరకు మనకంటే ముందే చేరుకొని మనకోసం ఎదురుచూస్తుంటారు."

"మరయితే ఏం చెయ్యటం? వెంటనే ఇక్కడినుంచి వెళ్ళిపోవటం అనేది తప్పనిసరిగా జరగవలసిన పని" అన్నది అయిలీత.

"చూడమ్మాయ్ అయిలీతా! అసలు మేం మీ గ్రహంకి బయలుదేరినప్పుడు, ఈ గ్రహంలో జీవరాశి ఉంటే వారి

చేత మా దేశాన్ని గుర్తించినట్లు ఒప్పించి, తిరిగి వెళ్ళాలనుకొన్నాం.

కాని, పరిస్థితి ఇలా తిరగబడటంతో మనం గూసెవ్ కు భయపడి పారిపోతే ఇక్కడ మా కోసం విప్లవానికి కూడా సిద్ధపడ్డ లోక్ కు మీ శుక్రగ్రహ ప్రజలకూ అన్యాయం చేసినట్లవుతుంది. పారిపోయినందుకు మా దేశానిక్కూడా అవమానం కలిగినట్లవుతుంది. అందుకే మమ్మల్ని నమ్మి ఎదురుతిరిగిన ఇంజనీర్ లోక్ కు సహాయంగా నేను వెళ్తారు. మీరు అంతరిక్ష నౌక దగ్గరకు వెళ్ళిపోండి. అదృష్టం బాగుండి మనమే నెగ్గితే పారిపోవటమన్న ప్రసక్తే ఉండదు. ఒకవేళ యుద్ధంలో ఓటమి కలిగి నాకేమయినా జరిగితే పృథ్వీరాజ్ తో నీవు అంతరిక్ష నౌకలో మా దేశం వెళ్ళిపో. ఇక్కడికి సైనికులు రాకుండా నేను చూసుకుంటాను'' అన్నాడు సురేష్ గంభీరంగా.

''సురేష్ జీ!'' ఆశ్చర్యంగా చూశాడు పృథ్వీరాజ్.

''అవునబ్బాయ్! పరిస్థితులుగాని ఎదురు తిరిగితే నా కోసం యుద్ధరంగంలో ప్రవేశించక'' అంటూ వాచీ చూసుకొని లేచి నిలబడి వేగంగా బైటకు కదిలాడు.

నివ్వెరపోయి చూస్తూండి పోయారు ముగ్గురూ. చకచకా ఆవరణలో ఉన్న వాయునౌకల దగ్గరకు నడిచి వాటి ప్రక్కనే నిద్రపోతున్న నౌక కుర్రవాణ్ణి లేపి, నౌకలు సిద్ధం చేయమన్నాడు.

ఐదు నిముషాల్లో రెండు నౌకలూ ఆకాశంలోకి లేచాయ్.

అంతరిక్ష నౌక వైపు దూసుకుపోతున్న నౌకలోని వాళ్ళకు చివరిసారిగా వీడ్కోలిచ్చి 'సో అత్సేగ' నగరం వైపు మళ్ళించాడు సురేష్ తన వాయునౌకను.

అతని జేబులో రివాల్వర్ బరువుగా ఉంది. వాయు నాకలో అక్కడక్కడ ఆయుధాలు చెదురుమదురుగా పడి ఉన్నాయ్.

# 10

గంట అయినున్న రాత్రోంది.

మేజర్ సురేష్ వాయునాక 'స్తో అత్స్వేర' నగరంవైపు పరుగులు తీస్తుండగా అకస్మాత్తుగా ఓ అరడజను వాయు నాకలు ఎదురయ్యాయి. సురేష్ రివాల్వర్ బయటకు లాగాడు. దానిలోని ఆరుగుళ్ళతో అన్ని నాకలను నాశనం చేయటం సాధ్యం కాదని అతనికి తెలుసు.

ఎదురుగా వస్తోన్న వాయునాకల్లోంచి శుక్రగ్రహ భటులు చేతులెత్తి ఉత్సాహంగా అరుస్తున్నారు.బహుశా ఎదురువస్తున్నది తమ వాళ్ళకు చెందిన నాకే అనుకొం టున్నారు కాబోలనుకొన్నాడు సురేష్.

వేగాన్ని పెంచాడు. వాయునాక ఎదురుగా వస్తోన్న నాకలను రాసుకొంటూ ప్రక్కనుంచి దూసుకుపోయింది. నాకల్లోని సైనికులు ఆశ్చర్యపోయారు. సాధారణంగా తమ గ్రహంలో ఏ రెండు వాయునాకలు ఎదురైనా ఆగి పలకరించుకోవాలి. కాని ఇదేమిటి?

ఏదో అనుమానం పొడచూపింది వారిలో. మరు క్షణంలో వాయునాకలన్నీ వెనుతిరిగి సురేష్ నాక వెంట బడ్డాయ్. సైనికులకి అనుమానం వచ్చిందని అర్థమైందత నికి. అరక్షణంపాటు ఏమి చెయ్యాలో తోచలేదు. కనీసం మరొకడైనా ఉంటే వాడికి డ్రైవింగ్ అప్పగించి తాను యుద్ధం చేసేవాడు.

అకస్మాత్తుగా అతని దృష్టి ఇంజన్ బోర్డుకి అటూ ఇటూ గొట్టాలలాగ బిగించబడివున్న మెషిన్‌గన్స్ లాంటి

ఆయుధాలపై పడింది. తొందరవలనా, చీకటి వలనా వాటిని అంతవరకూ చూడలేదతను.

డ్రైవింగ్ సీట్లో కూర్చొని డ్రైవ్ చేస్తూ ఎదురు వచ్చిన శత్రువులను ఎటాక్ చేయటానికి ఎంతగానో ఉప యోగపడే విధానం అది.

వాటిని చూస్తూంటే సెకండ్ వరల్డ్ వార్ టైమ్‌లో జర్మన్స్ ఉపయోగించిన వార్ ప్లేన్స్ గుర్తొచ్చాయతనికి. అప్పటికింకా యాంటీ-ఎయిర్‌క్రాఫ్ట్ గన్స్ ఇంప్రూవ్ మెంటు కాకపోవటంవలన ఒక ప్లేన్‌ను స్మాష్ చెయ్యా లంటే మరో ప్లేన్ ద్వారానే సాధ్యమయ్యేది. అందుకే ప్లేన్ వార్స్‌లో పైలెట్‌కు అటూ ఇటూ బిగించబడిన మెషిన్‌గన్స్ ద్వారా ఫైరింగ్ జరిగేది.

సురేష్ మనసు ఆనందంతో గంతులేసింది. రివాల్వర్‌ను జేబులోకి తోసి ముందుకు వెళ్తున్న వాయునౌకను వెనక్కి త్రిప్పి వాయునౌక ముందున్న ఫ్లడ్‌లైట్స్ ఆర్పేసి ఆకా శంలో ఇంకా ఎత్తుకు పోనిచ్చాడు.

చిన్నగా శబ్దం చేస్తూ నెమ్మదిగా ముందుకు సాగు తోంది వాయునౌక. అరనిముషం తర్వాత వెంటాడుతూ వస్తోన్న వాయునౌకలు క్రిందుగా కన్పించాయి,యాంగిల్ మార్చి నిలువుగా ఉన్న గన్స్ వాలుగా అమర్చాడు.

చిక్కని చీకటిలో వాయునౌకల ఫ్లడ్‌లైట్స్ దేదీప్య మానంగా వెలుగుతూ కదులుతున్నాయ్. వ్యూలోకి వచ్చే దాకా ఆగి ఫైర్ చేశాడు. నిప్పురవ్వలు దూసుకెళ్ళి రెండు వాయునౌకలను తాకాయి. గట్టిగా శబ్దంచేస్తూ వాయు నౌకలు అంటుకోగానే ఆ పరిసరాలంతా జాజ్వల మానంగా వెలుగుతున్న మంటలతో పట్టపగలుగా మారింది.

మిగిలిన నాలుగు నౌకలలోంచి ఫైరింగ్ మొదలైంది. తన వాహనాన్ని వేగం పెంచి చీకటిలోకి దూకించాడు సురేష్. ఆ గన్ బులెట్స్ ఎంత శక్తివంతమైనవో తెలియటం వలన జాగ్రత్తగా నడపసాగాడు.

చీకట్లో కలిసిపోయిన సురేష్ వాహనాన్ని వెదుకుతూ పరుగులు తీస్తున్నాయి వాయునౌకలు. కదులుతున్న ఫ్లడ్ లైట్లను చూస్తూ జాగ్రత్తగా నడుపుతున్నాడు నౌకను. రివాల్వర్‌ను తీసుకొని ట్రిగ్గర్ పై వేళ్ళు బిగించాడు. దగ్గరలో కనిపిస్తున్న వాయునౌక వైపు త్రిప్పాడు రివాల్వర్ బారల్. ఈ వాయునౌకలవి రైట్ వీల్ డ్రైవింగ్ అవటం వలన వాయునౌక రెండు ఫ్లడ్ లైట్ల మధ్యాకొంచెం ఎడం వైపు చీకట్లో గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కాడు.

అద్దాన్ని ఛేదించుకొని బులెట్ దూసుకెళ్ళింది.

అరసెకను తర్వాత అద్దాలు బ్రద్దలైన శబ్దం, వెనువెంటనే శుక్రగ్రహవాసి వేసిన చావుకేక అస్పష్టంగా వినిపించాయి. ఒక్క క్షణం ఊగిసలాడిన ఆ వాయునౌక చిన్న పల్టీ కొట్టి అడ్డదిడ్డంగా ఎగిరివెళ్ళి ప్రక్కనే కదులుతున్న మరో వాయునౌకను ఢీకొంది. పెద్ద మెరుపు మెరిసింది. కళ్ళు చిట్లించాడు సురేష్. చెవులు గళ్ళక్కే శబ్దంతో పేలాయి రెండు వాయునౌకలూ.

అకస్మాత్తుగా దూరంలో కదులుతున్న రెండు నౌకల ఫ్లడ్ లైట్లూ ఆరిపోయాయి.

సురేష్ గుండె జల్లుమంది.

జాగ్రత్తగా పోనిస్తున్నాడు నౌకను మధ్య మధ్య గన్స్ కాలుస్తూ. సమాధానంగా రెండునౌకలలోంచి కూడా నిప్పు రవ్వలు చీకట్లో పరుగు తీస్తున్నాయి.

పావుగంట సేపు జరిగింది చీకటియుద్ధం. ఏం చెయ్యాలో తోచట్లేదు. పోనీ కాలుద్దామా అంటే చీకట్లో ఎవరెక్కడున్నారో అర్థంకావటం లేదు.

ఆలోచిస్తున్నాడు సురేష్.

చిన్న ఐడియా తట్టింది.

చేతిలోని రివాల్వర్ వైపోసారి అప్యాయంగా చూసుకొని గన్స్ బటన్స్ నొక్కాడు.

మెరిగింది గన్. నిప్పురవ్వలు చీకట్లో ప్రయాణించాయ్. మరుక్షణం కుడివైపు నుంచి ఫైరింగ్ ప్రారంభమైంది. ఆ క్షణంలోనే ట్రిగ్గర్ నొక్కాడు రివాల్వర్‌ను ఆ వైపు త్రిప్పి.

శుక్రగ్రహవాసుల ఫైరింగ్ నుంచి సురేష్ తప్పించుకొన్నాడు గాని అతని రివాల్వర్ బులెట్ బారినుంచి సైనికుల వాయునౌకలు తప్పించుకోలేకపోయినవి.

# 11

'స్రో అత్సేర' నగరంలో పెద్దపెద్ద ప్రేలుళ్ళు విన్పిస్తున్నాయ్. ఇంజనీర్ లోశ్ ఉత్సాహంగా గన్ ప్రేలుస్తున్నాడు.

ఆకాశం అంతా వాయునౌకలు నిండిపోయాయి. విచ్చలవిడిగా పరుగులు తీస్తూ క్రింద కన్పించిన ప్రతీ శుక్రగ్రహ వాసినీ కాల్చేస్తున్నాయ్. వేలకొలదీ శుక్రగ్రహవాసుల శవాలు రోడ్లపై దొర్లుతోంటే క్రిందనుంచి లోశ్ అనుచరుల కాల్పులకు అప్పుడప్పుడూ వాయునౌకలు నేలకూలుతున్నాయ్.

గన్ నిండుగా అమ్యూనిషన్ నింపి తిరిగి కాల్పులు ప్రారంభించాడు ఇంజనీర్ లోశ్. ఉల్కల్లా మరో రెండు

నౌకలు రాలిపడ్డాయి. వాటితో మొత్తం తను కూల్చిన వాయునౌకల సంఖ్య ఎనిమిది.

అతనున్న వైపుకు ఆకాశంలోంచి గుండ్లవర్షం ప్రారంభ మైంది. ఎదురుగా ఉన్న బిల్డింగ్ లోకి పరుగుతీశాడు.

రోడ్లపై గుట్టలుగా పడివున్న శవాలను చూస్తుంటే అతని కళ్ళలో నీళ్లు తిరుగుతున్నాయి. నిస్సహాయులైన శుక్రగ్రహవాసుల విప్లవాన్ని సాయుధబలంతో అణి చెయ్యటానికి పూనుకొన్న 'గూసెవ్'ను తల్చుకుంటుంటే అతనిలో ఆవేశం పరవళ్ళు త్రొక్కుతోంది.

ఒకప్రక్క ఆలోచించకుండా విప్లవం లేవదీసి ఇంత మంది చావుకి గురయ్యానా అనే బాధ సల్పుతోంది.

చేతిలో ఆయుధం లేకుండా ఉన్న పాతికమంది అను చరులతో వేలకొలదీ సైనికులను ఎలా నాశనం చెయ్యాలో అరంకావటంలేదు. మొత్తం ఇప్పటివరకూ తామందరూ కూల్చేసిన వాయునౌకలు మహా ఉంటే వంద ఉంటాయి.

పోతే శత్రువులు కాల్చిన కాల్పులకు తన అనుచరు లలో ఎంతమంది గురయ్యారో తెలియదు.

అటువంటి వాతావరణంలో కూడా లోశ్ ఉత్సా హంగా శత్రువులను ఎదుర్కొంటున్నాడు. అంతకు కొంచెం క్రితమే ఆకాశపుత్రులు ఒక అరడజను శత్రు నౌకలను కూల్చేసి తమకు సహాయంచేయటానికి సోఅత్సేర నగరంవైపు వస్తున్నట్లు ఓ నౌకలోంచి ప్రసార మాతోం డగా విన్నాడు తను. ఆ సందర్భంలోనే ఆకాశపుత్రులను ఎదుర్కోడానికి వెళ్తోన్న వాయునౌకలలో రెండింటిని కూల్చేశాడు కూడా.

గట్టిగా శబ్దం విన్పించి ఆలోచనలనుంచి తేరుకొంటూ తలెత్తి చూశాడు. శత్రునౌక ఒకటి తనున్న భవనంపై నుంచి దూసుకెళ్తోంది. అప్రయత్నంగా గన్ కాల్చాడు. బులెట్ వెళ్ళి రేలింగ్‌కు ఆనుకొని నిలబడ్డ ఒక సైనికుడి గుండెల్లో దూరింది. చావుకేక పెట్టి క్రిందకు కూలి పోయాడు వాడు. లోశ్ ఉన్నవైపు రెండుసార్లు కాల్పులు సాగించి దూరంగా ఎగిరిపోయింది నౌక.

లోశ్ ఒక్కంగలో బయటికి ఉరికి సైనికుడు పడి ఉన్న చోటుకి పరిగెత్తాడు. వాడి చేతిలోని మెషిన్ గన్‌ను లాక్కోగానే వెయ్యేనుగుల బలం వచ్చినట్లు ఫీలింగ్ కలిగింది.

అంతలో అటువైపు దూసుకొచ్చిన మరో వాయునౌక ఫ్లడ్‌లైట్ల కాంతి అతనిపై పడింది.

మరుక్షణం మెషిన్‌గన్ కాల్పులు.

లోశ్ జర్రున ప్రక్కకి జారాడు.

కొంచెం దూరంలో ఉన్న లోశ్ అనుచరుడు వెంటనే నౌకవైపు కాల్పులు సాగించాడు.

రెండు నిప్పు గోళాలు లోశ్ ఎడమభుజంలో దిగాయి. కళ్ళు బైర్లు క్రమ్మాయ్ లోశ్‌కు.

తూలుతూ లేచి బిల్డింగ్‌లోకి పరుగుతీశాడు. లోశ్ అనుచరుడు కాల్చిన బులెట్ తగిలి వాయునౌక అడుగు నుంచి చిన్నగా పొగవస్తూ కన్పించింది. లోశ్ పెదవులపై చిరునవ్వు కదులాడి మాయమయ్యేలోగానే పెట్రోల్ టాంక్ ప్రేలింది.

ఎడమచెయ్యి విపరీతంగా సల్పుతోన్నా లెక్కచెయ్యకుండా మెషిన్‌గన్‌తో ఫైరింగ్ మొదలెట్టాడు లోశ్. అయిదు నిముషాల్లో ఇరవైపైగా వాయువిమానాలను కూల్చేశాడు.

ఒకేసారి అన్ని నాశనమయ్యేసరికి వాయునౌకలలో సంచలనం ఏర్పడింది. పిచ్చెక్కినట్లు కాల్పులు మొదలయ్యాయి.

అనుమానం కలిగిన చోటల్లా బాంబులు వేసి నాశనం చెయ్యటం మొదలెట్టారు సైనికులు.

రెండునిముషాలు గడిచాయి. కళ్ళు మూసుకొని భారంగా ఊపిరిపీలుస్తున్నాడు లోశ్. అతని అనురులందరూ అమ్యూనిషన్ అయిపోవటంతో ఏం చెయ్యాలో దిక్కుతోచక ఆకాశంలోకి చూస్తున్నారు.

వాయునౌకల విజృంభణ క్షణక్షణానికీ ఎక్కువౌతోంది. ఎక్కడ బడితే అక్కడ బాంబులవర్షం కురుస్తోంది. భవనాలు కూలిపోతున్నాయ్. శుక్రగ్రహవాసులు భయంతో వణికిపోతున్నారు.

# 12

ప్రళయంలా దద్దరిల్లుతోన్న సౌఅత్సేర నగరంవైపు పరిశీలనగా చూశాడు సురేష్. కాబిన్‌లో చెల్లాచెదురుగా పడి ఉన్న మెషిన్‌గన్‌లు ఓ అరడజను భుజానికి తగిలించుకొన్నాడు. పెట్టెనిండుగా ఉన్న అమ్యూనిషన్ కొన్ని బాంబులను వేసి జేబులు నింపుకొన్నాడు. ఏ క్షణానైనా దూకియ్యటానికి వీలుగా సాధ్యమైనంత వరకూ ఎత్తును తగ్గించి వాయునౌకను వేగంగా పోనిచ్చాడు.

కొంచెందూరం పోయేసరికి ఎదురుగా షార్క్‌చేపల మందలా దూసుకొని వస్తోన్న శత్రునౌకలు కన్పించాయ్. ఫ్లడ్‌లైట్స్ ఆఫ్‌చేసి మాగ్జిమమ్ స్పీడుకు ఫిట్ చేసి వేళ్ళతో గన్స్‌బటన్స్ నొక్కి ఉంచాడు.

ఫైరింగ్ మొదలైంది. అవతలివాళ్ళు సర్దుకొనేలోగా నాలుగు వాయునౌకలు కూలిపోయాయి, వాటిప్రక్క

మంచి దూసుకుపోతున్న సమయంలో రెండుబాంబుల క్లిప్స్ ఊడబీకి విండోలోంచి బైటకు విసిరాడు.

పెద్ద విస్ఫోటం జరిగింది, తల త్రిప్పి చూశాడు. బాంబుల ధాటికి ప్రేలిన నౌకల్లోంచి ఫైర్ బాల్స్ ప్రక్కనే కదులుతోన్న వాటిపై పడటంతో చాలావరకూ వాయు నౌకలు నాశనమయ్యాయి. మిగిలిన నౌకలు వెంటబడటం గమనించాడు సురేష్.

వాయునౌక అతివేగంగా 'సోఅత్సేర' నగరంలో ప్రవేశించింది. మరికొన్ని శత్రునౌకలు ఎదురువస్తుండటం చూడగానే వేగం తగ్గించి బాగా క్రిందకి పోనిచ్చాడు. నేలకి తక్కువ ఎత్తులోకి రాగానే యాక్సిలేటర్ పూర్తిగా వేసి బయటకు దూకేశాడు.

రివ్వున పైకి లేచిన వాయునౌక ఎదురుగా వస్తోన్న శుక్రగ్రహ నౌకలవైపు దూసుకెళ్ళింది. మీదకు వస్తోన్న వాయునౌకను చూసి తమ వాటిని ప్రక్కకి తప్పించ బోయారు సైనికులు.

అంతలోనే సురేష్ ప్రయాణం చేసిన నౌక ఫెడీ... ఫెడీ మంటూ గుద్దేస్తూ వాయునౌకల గుంపులోకి దూరి పోయి ప్రేలిపోయింది. ఏం జరిగిందో తెలుసుకొనేలోపలే మిగిలిన నౌకలుకూడా దానిని అనుసరించాయి.

క్రిందకి దూకిన సురేష్ ముందుకి పరుగుతీసి కొంచెం దూరంలో ఉన్న భవనంలోకి ఎగిరిదూకాడు. ప్రాణ భయంలో ఒణికిపోతోన్న శుక్రగ్రహ ప్రజలు పిడుగులా దూసుకొచ్చిన సురేష్ వైపు క్షణకాలం తెల్లబోయిచూసి, మరుక్షణం ఆనందంతో 'ఆకాశపుత్రా' అంటూ గంతు లెయ్యడం మొదలెట్టారు.

"ఇంజనీర్ లోశ్ ఎక్కడ?" విసుగ్గా అరిచాడు శుక్రగ్రహ భాషలో. బయట నిలబడివున్న కొద్ది అమ్యూనిషన్‌తో కాల్పులు జరుపుతున్న లోశ్ అనుచరుడొకడు లోనికి పరిగెత్తుకొచ్చాడు.

"ఎవరు నువ్వు? లోశ్ అనుచరుడవా?" అడిగాడు సురేష్. "అవును ఆకాశపుత్రా!" చేతులు కట్టుకొని సంతోషంగా సమాధానం ఇచ్చాడు వాడు.

మెషిన్‌గన్ తీసి వాడివైపు విసిరి లోశ్ ఎక్కడని అడిగాడు సురేష్.

మెషిన్‌గన్ అందుకొని బైటకు పరిగెత్తాడు అతను. సురేష్ అనుసరించాడు. దూరంగా ఒక భవనంలోంచి మెషిన్‌గన్ ప్రేలుడు విన్పించింది. చెయ్యెత్తి అటు చూపించాడు అతను.

"సరే! నువ్వు నా వెంట రా!" అంటూ ఆ భవనం లోంచి ఒకడిని పిలిచి తన దగ్గరున్న గన్స్ వాడికిచ్చి ఆ చుట్టుప్రక్కలున్న లోశ్ అనుచరులకు అందించమని బైటకు పరిగెత్తాడు. లోశ్ అనుచరుడు అతని వెనుకే మెషిన్‌గన్ ప్రేలుస్తూ అనుసరించాడు.

సురేష్ ఇంజనీర్ లోశ్ దగ్గరకు చేరేసరికల్లా అతనిచ్చిన గన్స్ అన్నీ లోశ్ అనుచరులకు అందాయని తెలుపుతూ నాలుగైదు చోట్లనుంచి ఫైరింగ్ మొదలైంది.

తనదగ్గరకు పరిగెత్తుకొచ్చిన సురేష్‌ని చూడగానే లోశ్ కళ్ళలో కృతజ్ఞతతో కూడిన మెరుపు కదిలింది. "ఆకాశపుత్రా!" అన్నాడు గాద్గదికంగా.

సురేష్ స్సానుభూతిగా అతని భుజం తట్టాడు. చెట్ల

మీద పిట్టల్లా రాలిపడుతున్నాయి వాయునౌకలు. వాచీ చూసుకొన్నాడు సురేష్.

గంట ఎనిమిది అయింది. మరో రెండు గంటల్లో తెల్లారుతుంది. ఈలోగా ప్రభుత్వాన్ని వశపరచుకోలేక పోతే ఇక తమ తరం కాదు. వెలుగురేఖలు శుక్రతలంపై పడిన మరుక్షణం నిముషాల్లో విప్లవకారుల్ని పట్టుకొని చంపేస్తారు సైనికులు.

నిర్విరామంగా కాలుస్తున్నారు లోశ్ అనుచరులు. ఎన్ని వాయునౌకల్ని కూల్చినా అంతకు రెట్టింపు నౌకలు యుద్ధంలోకి దూకుతున్నాయి.

గట్టిగా తల విదిల్చాడు సురేష్.

"మిస్టర్ లోశ్. మనం ఇలాగ పోరాడితే లాభం లేదు. ఎన్ని నౌకల్ని నాశనం చేసినా ఇంకా పుట్టుకొస్తున్నాయి. అదీకాక మనదగ్గరున్న అమ్యూనిషన్ కొంచమే. అదయిపోయాక ఎలా ఎదుర్కొనేది?" అడిగాడు.

"ఏం చేద్దామంటారు?"

"ఏం చెయ్యాలన్నా విజయం రావాలంటే చేయవలసింది ఒక్కటే! ఎలాగయినా రాజభవనంలో ప్రవేశించి గూసెవ్‌ను చంపెయ్యటం. గూసెవ్ చనిపోయిన మరుక్షణంలో నూతన చక్రవర్తిగా మీ ఆజ్ఞను అనుసరించి సైనికులు వెనక్కి మరులుతారు" చెప్పాడు సురేష్.

"కాని రాజభవనంలోకి ప్రవేశించటం కష్టం. చుట్టూ చాలా బందోబస్తుంటుంది!" నెమ్మదిగా అన్నాడు లోశ్.

"కాని తప్పదు! ఇక్కడి కెంతదూరం వుంటుంది రాజమందిరం?" అడిగాడు.

"దగ్గరే! నాలుగు ఫర్లాంగులుండొచ్చు!"

"అయితే ఆలస్యం ఎందుకు వెంటనే వెళ్తాను."

"నేనూ వస్తాను పదండి!" లేచాడు లోకేశ్.

"వద్దు! మీ పరిస్థితేమీ బాగుండలేదు."

బలహీనంగా నవ్వేడు లోకేశ్.

"ఫర్వాలేదు. నాయకుడిగా నాకా బాధ్యత తప్పదు."

"సరే మీ ఇష్టం" బయటికి వెళ్ళి భవనాలచాటు నుంచి నడిచాడు. అనుసరించారు లోకేశ్, అతని అనుచరుడూ.

పావుగంట గడిచింది. నెమ్మదిగా నడుస్తూ చక్రవర్తి భవనాల సమీపానికి చేరుకొన్నారు, అన్ని భవనాలలో దీపాలు వెలుగుతున్నాయి. సాయుధ సైనికులు అన్నీ భవనాలపైన చీమల్లా కన్పిస్తున్నారు.

వారిని చూడగానే నీరసంగా నిట్టూర్చాడు ఇంజనీర్ లోకేశ్. "అంత బలమైన కాపలా వుండగా గూసెవ్‌ను చంపటం ఆ దేవుడితరంకూడా కాదు" గొణిగాడు.

సురేష్ జేబునిండుగా ఉన్న బాంబులు తీసి లోకేశ్‌కు కొన్ని అతని అనుచరుడికి కొన్ని ఇచ్చాడు.

"ఆకాశపుత్రా! ఏమిటి మీ ఆలోచన అంతమంది వుండగా గూసెవ్‌ను చంపటం ఎలా?" గట్టిగా అడిగాడు లోకేశ్ సురేష్ వైపు అయోమయంగా చూస్తూ.

"లోకేశ్! ఆ చీకటిగా కనబడే భవనం ఎవరిది?" లోకేశ్ ప్రశ్నకు జవాబు చెప్పకుండా చక్రవర్తి భవనాలకు కొంచెం ప్రక్కనే ఉన్న ఖాళీ భవనంవైపు చూపిస్తూ అన్నాడు సురేష్.

"చక్రవర్తిదే! అప్పుడప్పుడు రహస్యమైన విషయాలను గురించి చర్చించటానికి, సమావేశాలు జరపటానికి ఉపయోగిస్తుంటాడు" సురేష్ వైపు చూస్తూ చెప్పాడు.

"గుడ్. మనకీ భవనం బాగా ఉపయోగిస్తుంది. దీనిపై నుంచి తేలికగా ఎటాక్ చెయ్యవచ్చు" ఉత్సాహంగా అన్నాడు. ఐదునిముషాల తర్వాత అతి కష్టంమీద ఆ భవనంలో ప్రవేశించగలిగారు.

గన్‌తో తాళం బద్దలుగొట్టి లోనికి పరిగెత్తి మెట్ల మీదుగా పైకి చేరుకొన్నారు. టెర్రస్‌పై నుంచి చకవర్తి భవనాలపై సైనికులు స్పష్టంగా కన్పిస్తున్నారు. సురేష్ లోశ్ అనుచరుడివైపు తిరిగాడు.

"నువ్వు టెర్రస్ అవతలివైపు కెళ్ళి అటు ప్రక్క వాళ్ళను ఎటాక్ చేస్తూ వాళ్ళదృష్టిని నీమీద కేంద్రీకరించుకో!" చెప్పాడు. అతను తల ఊపి వెళ్ళిపోయాడు.

"ఆ సైనికులందరి దృష్టీ అతనిమీద కేంద్రీకృతం కాగానే మనం ఇక్కడినుంచి దాడిచెయ్యొచ్చు. పరిస్థితి మనకు అనుకూలంగా మారుతుంది" మెషిన్‌గన్ బారల్ ఒక శుక్రగ్రహ సైనికుడికి గురిపెడుతూ అన్నాడు.

క్షణాలు గడుస్తున్నాయ్. నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ గన్ ప్రేలింది. ఒక భవనంపై పహారా కాస్తూ తిరుగుతున్న సైనికుల్లో ఒకడు నేలకూలాడు. మరుక్షణంలో ఆ ప్రదేశమంతా కురుక్షేత్రంగా మారింది. లోశ్ అనుచరుడు బాంబు విసిరాడు. భయంకరమైన విస్ఫోటం ఉద్భవించి ఆ భవనం పైభాగం నామరూపాలు లేకుండా నాశనమయ్యింది.

మిగిలిన భవనాలపై ఉన్న సైనికులలో కలవరం ఎక్కువైపోయింది. లోశ్ అనుచరుడున్నవైపు నిప్పుర్వ్వలు తుఫానులా పయనిస్తున్నాయి. లోశ్‌కు సైగజేసి ఫైరింగ్ మొదలెట్టాడు సురేష్. రెండుబాంబులు తీసి క్లిప్‌లు ఊడపీకి మరో రెండు బిల్డింగ్‌లపైకి శక్తికొలదీ విసిరాడు.

అరనిముషంపాటు శబ్దం భరించలేక చెవులు మూసుకొని వలసి వచ్చింది ఇద్దరూ. ఖండాలైన శుక్రగ్రహ సైనికుల శవాలు గాలిలోకి ఎగిరాయి. చక్రవర్తి భవనాలపై ప్రేలుళ్ళు చూసి వందలకొద్ది వాయునౌకలు ఎగుర్తూ రాసాగాయి.

జేబులోంచి బాంబు అందుకొని క్లిప్ లాగబోతూ లోశ్ అనుచరుడు వేసిన చావుకేక విని ఆగిపోయాడు. కంగారులో ప్రమాదాన్ని గ్రహించక లేచి నిలబడి అటు వైపు తిరిగాడు లోశ్.

సురేష్ మెరుపులా చెయ్యందుకొని క్రిందకి లాగాడు. కాని ఆలశ్యమయ్యింది.

భగభగా మండుతున్న మంటల వెలుతురులో లోశ్ ఆకారాన్ని స్పష్టంగా చూడగలిగిన సైనికుల చేతిలోని గన్స్ మెరిగి లోనుంచి వెలువడ్డ బులెట్స్ లోశ్ హృదయాన్ని చీల్చేశాయ్.

కేక వేసే ఓపికకూడా లేక చిన్నగా మూలిగాడు లోశ్. అతని శరీరం సురేష్ పైకి వాలిపోయింది. అతని చేతులు కృతజ్ఞతగా సురేష్ చేతులపై బిగుసుకొన్నాయ్.

మేజర్ సురేష్ కళ్ళలో నీళ్ళు తిరిగాయ్. తనపైనున్న లోశ్ శవాన్ని ప్రక్కకు నెట్టి నెపోలియన్ లా చేతిలోని రెండు బాంబులూ ప్రక్కనే వున్న చక్రవర్తి భవనంపైకి విసిరి మెట్లవైపు పరుగుతీశాడు.

చక్రవర్తి భవనంలో ప్రేలుతున్న ప్రేలుళ్ళకి సురేష్ వున్న భవనం దద్దరిల్లిపోతోంది. మెట్లపై పరుగుతీస్తూ క్రిందకి దిగుతున్న సురేష్ కి మరో నాలుగైదు మెట్లున్నా యనగా కాలు జారింది.

తర్వాతేమయిందీ అతనికి తెలీదు.

# 13

సైంటిస్ట్ పృధ్వీరాజ్ నౌకను నడుపుతోన్న కోనా వైపు ప్రశారకంగా చూశాడు. సోఅత్సేర నగరమంతా యుద్ధజ్వాలలతో మండుతూ కన్పిస్తోంది. వాయునౌకలు ఆకాశంలో పక్షుల్లా వున్నాయి.

సురేష్, సోఅత్సేర నగరంవైపు వెళ్ళిపోయాక అయిలీత తమ వాయునౌకను అంతరిక్షనౌక వైపు ప్రయాణం సాగించింది. అంతరిక్షనౌక చేరుకోగానే అయిలీతను, నౌకలో విడిచి, ఆమె బ్రతిమలాడుతున్నా వినకుండా తిరిగి వెనక్కి బయలుదేరాడు పృధ్వీరాజ్, కోనాను సహాయంగా తీసుకొని.

తీరా సోఅత్సేర నగరం చేరేసరికి వాతావరణం చాలా ప్రమాదకరంగా మారింది. నగరంలోనికి ఎలా ప్రవేశించాలో సురేష్‌ని ఎలా కలుసుకోవాలో అర్థంకాలేదు పృధ్వీరాజ్ కి.

"లాభంలేదు కోనా! ఈ పరిస్థితులలో నగరంలోనికి ప్రవేశించటం అసంభవం. ఏమాత్రం అనుమానం కలిగినా కాల్చేస్తారు సైనికులు. ఒకవేళ ప్రాణాలకు తెగించి ప్రవేశించినా, సురేష్ బ్రతికున్నాడో, లేదో తెలియదు" నిస్పృగా అన్నాడు.

"అధైర్యపడకు ఆకాశపుత్రా! క్షేమంగా రాజభవనం దగ్గరకు చేర్చే దారి నాకు తెల్సు, మిమ్మల్ని చేర్చే పూచీ నాది!" అంటూ నౌకను ప్రక్కకి మరల్చింది కోనా.

"కోనా!" ఆశ్చర్యంగా చూశాడు.

"అవును ఆకాశపుత్రా! చక్రవర్తి గూసెప్ ప్రమాదకరమైన సమయాలలో తప్పించుకుపోయేందుకు వీలుగా

తన రాజభవనాలలో ఒక దానినుంచి సో అత్సేర నగరం బైటకు రహస్యంగా సొరంగాన్ని త్రవ్వించాడు. ఒక సందర్భంలో అయిలీతతో కలిసి దానిని నేను చూడటం తటస్థించింది. అదెక్కడుందో నాకింకా గుర్తే!'' అంటూ వేగంగా నౌకను పోనిచ్చింది.

టైమ్ చూసాడు పృథ్వీ. పావుతక్కువ ఎనిమిది. ఆలో చిస్తూ కూర్చొన్నాడు.

అయిదునిముషాల తర్వాత వాయునౌక క్రిందికి దిగి ఒక చోట ఆగింది. కోనా క్రిందకి దూకి ముందుకి పరిగెత్తింది. ఆమెను అనుసరించి వెళ్ళి సొరంగంలో ప్రవేశించాడు.

సొరంగం చీకటిగా వుంది. టార్చి వేసాడు పృథ్వీరాజ్. నిశ్శబ్దంగా నడుస్తున్నారు. ఎంతనడిచినా సొరంగం తరగటం లేదు. నగరంలో ప్రేలుళ్ళు అస్పష్టంగా విన్పిస్తున్నాయి.

సరిగ్గా ముప్పావుగంట తర్వాత సొరంగం అంతమయ్యి చీకటిగా వున్న భవనంలోకి అడుగుపెట్టారిద్దరూ. టార్చి ఆర్పేశాడు పృథ్వీరాజు. నెమ్మదిగా నడుస్తూ ఒక్కొక్క గదినీ దాటి విశాలమైన హాలులోనికి వచ్చారు.

అకస్మాత్తుగా ప్రక్క నెక్కడో బాంబు పడిన శబ్దం విన్పించింది. రెండు సెకన్లపాటు గదిగోడలు దద్దరిల్లి పోయాయి.

మరుక్షణం ఎవరో మెట్లమీదుగా పరుగులు తీస్తున్న శబ్దం, ఆ వెనువెంటనే కాలుజారి క్రిందపడి దొర్లిన శబ్దం, విన్పించాయి.

మెట్లవైపు టార్చి వేశాడు పృథ్వీరాజ్.

మేజర్ సురేష్ తక్కున లేచి కూర్చోబోయాడు.

"సురేష్‌జీ! దెబ్బలేమీ తగల్లేదుకదా?" పృథ్వీరాజ్ కంఠం ఆత్రంగా, ఆశ్చర్యంగా విన్పించింది.

"పృథ్వీ...?"

"అవును నేనే!" సురేష్ భుజం పట్టుకొని పైకి లేపుతూ అన్నాడు సంతోషంతో.

"లోశ్ చచ్చిపోయా డబ్బాయ్!" సురేష్ కంఠం విచారంగా పలికింది.

ఏదో అనబోయాడు పృథ్వీరాజ్. అంతలో ఆ భవనం వైపు చాలామంది సైనికులు పరుగెత్తుకొస్తున్నట్లు శబ్దాలు విన్పించాయి.

"కమాన్ సురేష్‌జీ! నడవగలరుకదా?" కంగారుగా అడిగేడు పృథ్వీరాజ్.

"మహారాజులా" నవ్వేడు సురేష్.

సొరంగం వైపు పరుగెత్తారు ముగ్గురూ. తలుపులు బద్దలుకొడుతున్న శబ్దం విన్పిస్తోంది! సొరంగం చివరకు రాగానే బాంబువిసిరి సొరంగాన్ని కూల్చివేశాడు సురేష్.

ఇరవై నిముషాల్లో ముగ్గురూ వాయునౌకలో అంతరిక్ష నౌకను చేరుకున్నారు. అప్పటిదాకా వారికోసమే ఎదురు చూస్తూ ఒంటరిగా కూర్చున్న అయిలీత కళ్ళు మలమిల మెరిసాయి.

తెల్లవారుతుండగా అంతరిక్షనౌక గగనంలోకి లేచి, భూగ్రహంవైపు ప్రయాణం సాగించింది.

—: ఐపోయింది :—

# తోడు దొంగలు

ఏ. వీ. మోహన్రావ్

మద్రాసు త్యాగరాయ నగర్‌లోని, కోదండపాణి వీధి చివర వున్న పాడుపడ్డ పాత బంగళాకు ఉన్నట్లుండి దశ తిరిగింది. పది దినాలనుంచి రకరకాల పనివాళ్ళు వచ్చి రాత్రింబవళ్ళు రిపేర్లు చేసి, రంగులు పూసి, క్రొత్త మహల్‌లా తీర్చిదిద్దటం ఆ వీధిలోని చాలా మందికి ఆశ్చర్యం కలిగించింది.

ఆ యిల్లు ఎవరో రాజకుమారుడు కొన్నట్లు, ఆయన మకాం రాబోతున్నట్లు అందుకోసమే, ఆయన సెక్రెటరీగా చెప్పుకొనే వొంటికంటి మనిషి, రెట్టింపు కూలీలిచ్చి పని చేస్తున్నట్లు చెప్పుకోసాగారు అంతా.

ఒక రోజు తెల్లవారేసరికి బంగళా మొత్తం హడా వుడిలో మునిగిపోయింది. సెక్రెటరీ గుమ్మం వెలుపల నిల్చుని, హాండ్ స్టిక్ ఊపుకుంటూ, ఆత్రుతగా రోడ్ వంక చూడటం, ఎదురింట్లో బ్రహ్మచారి ఏకాంబరం పైనుంచి గమనించసాగాడు.

మెల్లగా క్రిందికి దిగొచ్చి సెక్రెటరీగార్కి దూరంగా నిలబడి "నమస్తే" అన్నాడు.

ప్రతినమస్కారం చేశాడు సెక్రెటరీ.

"నాపేరు ఏకాంబరం. ఆ యింట్లో మేడమీద అద్దె కుంటున్నాను, ఈ బంగళాను మీరు కొన్నారా?" అడిగాడు.

అతన్ని ఆపాదమస్తకం పరిశీలనగా చూశాడు సెక్రెటరీ. కాలుతున్న పైపును నోట్లోనుంచి తీసి, చేత్తో పట్టుకొని "నో! ఇలాంటి చెత్త కొంపలు కొనరు మారాజా వారు. నెల రోజుల మకాం వుండాలని వచ్చాం! అద్దెకు తీసుకున్నాం!" అన్నాడు సెక్రెటరీ.

"ఆ మాత్రానికేనా బంగళా మొత్తం తిప్పి కట్టారు. కనీసం పాతిక వేలన్నా అయివుండాలి." అన్నాడు ఏకాంబరం విస్తుపోతూ.

"అది ఆఫ్టరాల్ చిన్న ఖర్చు మా రాజావారికి." అన్నాడు సెక్రెటరీ.

అంతలో దూరంనుంచి పెద్ద ఇంపాలా కారు దాని వెనుక మరో అంబాసిడర్ రావడం కనిపించింది.

"రాజావారు వస్తున్నారు. మీరు వెళ్ళండి!" అంటూ హడావుడిగా రోడ్డుకు అడ్డం పరుగెత్తాడు.

రాజావారి కారు గేటు గాటి బంగళా కాంపౌండ్ లోకి ప్రవేశించి పోర్టికో చేరింది. సెక్రెటరీ పరుగెత్తు

అంటూ వెళ్ళాడు.

పది మంది పనివాళ్ళు వరుసగా నిలుచున్నారు, తలలు వంచుకొని తెల్లటి యూనిఫాంలో.

రాజావారు దిగి అందరి అభినందల్ని, నమస్కారాలనూ, స్వీకరిస్తూ, సెక్రెటరీ ఒకవైపు, రాణిగారు మరో వైపు నడుస్తుండగా మేడపైకె వెళ్ళారు.

ముగ్గురూ గదిలోకి వెళ్ళగానే, సెక్రెటరీ వెళ్ళి తలుపులు మూసి వచ్చాడు.

"ఏమిటి విశేషాలు?" అడిగాడు రాజాగారు పట్టు బాలీసుల నానుకొని కూర్చుంటూ.

"ఏమిలేవు అంతా నార్మల్ గావుంది" అన్నాడు సెక్రెటరీ.

"కలకత్తా వ్యవహారం గురించి ఈ వూళ్ళో ఏమైనా చర్చలు జరుగుతున్నాయా?"

"ఇప్పుడు లేదు. అంతా చల్లబడిపోయింది."

"గుడ్! మనం ఆరు మాసాలు అజ్ఞాతవాసం చేసి ఆ తర్వాత తల బైట పెట్టడం మంచిదయిందంటావా?" అడిగాడు రాజాగారు.

"అవును ఈ రాణిగార్ని ఎక్కడ పట్టారు" అడిగాడు సెక్రటరీ.

"కాకినాడ బ్యాంక్ స్ట్రీట్ లో."

"ఆ బాపతని చూడంగానే అనుకొన్నాను. నడక, నవ్వు, మాట బాగా మార్చుకోవాలి నువ్వు. లేకుంటే నీ గుట్టు బైట పడుతుంది. దాంతోపాటు మేమూ తిన్నగా శ్రీకృష్ణజన్మస్థానం పోవల్సి వుంటుంది." అన్నాడు సెక్రెటరీ.

"చెప్పండి. ఇనుకొంటూ" అంది రాణిగారు.

"మూర్తీ! ఈమెను గదికి పంపెయ్" అన్నాడు రాజాగారు.

ఆ సెక్రెటరీ పేరు మూర్తని ఆమెకు అప్పుడు అర్థమయింది.

మూర్తి ఆగదికి వెనుకనున్న గది చూపించి వెళ్ళమని కళ్ళతో చెప్పాడు. రాణిగారు వెళ్ళిపోయింది.

"ఇంక చెప్పు!" అన్నాడు రాజాగారు.

"మనం అనుకున్న పథకానికి అన్ని ఏర్పాట్లు చేశాను. ముహూర్తం కూడా సిద్ధం చేశాను. నెల తిరిగేలోపల పని మొత్తం పూర్తి చేసుకొని మనం మకాం ఎత్తేయ్యాలి ఈలోగా ఇక్కడ్నుంచి ఎక్కడికి వెళ్ళాలన్నది కూడా మనం ఆలోచించుకోవాలి," మూర్తి అన్నాడు.

"గుడ్! ఈ పని పూర్తయ్యాక మన తర్వాతి కార్యక్రమం దొంగ నోట్లు అచ్చు వెయ్యడం దానికి అనువైన ప్రదేశం చూచి వుంచాను. ముందక్కడికి చేరుకుంటే ఆ తర్వాత మిగిలిన పనులు చూద్దాం." అన్నాడు రాజాగారిలా నటిస్తున్న ఆనంద్.

ఆనంద్ పేరుపడ్డ గజదొంగ. చిన్నతనంనుంచి ఎన్నో దొంగతనాలు చేశాడు. ప్రతిసారి పోలీసులకు చిక్కినట్లే చిక్కి, పాదరసంలా వాళ్ళ చేతిలోంచి తప్పిపోయాడు. అతన్ని ఆ డిపార్టుమెంటులో అందరూ 'మిస్టర్ మెర్క్యూరీ' అని రిఫెర్ చేస్తుంటారు.

మూర్తి అతని నమ్మిన బంటు. ఆనంద్‌తో చేరక ముందు కలకత్తాలోని రిలియన్స్ బ్లాక్ మేకింగ్ కంపెనీలో పనిచేసేవాడు. అతన్ని మించిన పనివాళ్లు లేరని అందరూ అంటారు. ఒక డిజైన్ చూసి, అందులో ఎన్ని రంగు

లున్నదీ, ఎలాంటి స్క్రీన్ వాడవలసిందీ, ఎలా ఎచ్చింగ్ చెయ్యవలసిందీ, గడగడ చెప్పగల సమర్థుడు. కౌంటర్ ఫీటింగ్ చేసి కోటీశ్వరుడు కావాలన్న కలలు కనేవాడు. అతనికి ఆనంద్ తోడయినాడు.

ఇద్దరూ కలసి కలకత్తాలో ఫస్టుసిటీ బ్యాంక్ వాళ్ళ వానును పట్టపగలే దోచుకొన్నారు. వీళ్ళ దురదృష్టంవల్ల నాలుగు లక్షలకు మించి దొరకలేదు అందులో. కానీ వాన డ్రైవర్నూ, తమను చూశారన్న అనుమానంతో మరో కిల్లీ కొట్టు ఓనర్ను చంపివేశారు.

ఆ తర్వాత అండర్ గ్రౌండ్ లో వుండిపోయారు. మరో క్రొత్త పథకం వేసుకుని మద్రాసుకు ప్రస్తుతపు రూపాల్లో చేరుకున్నారు.

"రాణీగారి సంగతేమిటి?"

"ఈ నెలా అనుభవించనీ భోగం. ఆ తర్వాత ఆమెను స్వర్గానికి పంపించి మనం నరకానికి పోదాం!" అన్నాడు ఆనంద్.

"నా రాక గురించి అవసరమైన ప్రచారం చేశావా?" అడిగాడు ఆనంద్.

"పోలీసులకు చెప్పలేదు. కాస్మాపాలిటన్ క్లబ్బులో మీ పేరున మెంబర్ షిప్ తీసుకున్నాను, అలాగే లయన్స్ క్లబ్, రోటరీ క్లబ్ లోకూడా. మూడుచోట్ల పెద్ద పార్టీలు ఏర్పాటు చేశాను. అవి పూర్తయ్యేసరికి ఈ మద్రాసు మహానగరంలో మిమ్మల్ని తెలీని కోటీశ్వరులు వుండరని నా అభిప్రాయం. ఆ తర్వాత మన పని ప్రారంభం చేద్దాం!" అన్నాడు మూర్తి.

"నీది బ్రెయిన్ కాదు?" ఆనందంతో ఉప్పొంగిపోతూ అన్నాడు రాజాగారు వురఫ్ ఆనంద్.

"దాన్ని పొగడడం మాటలా వుంచు. మనదగ్గర ఎక్కువ డబ్బు లేదు. రెండులక్షలదాకా ఖర్చయిపోయింది. జాగ్రత్తగా వాడుకోవాలి." అన్నాడు మూర్తి.

"ఓ. కే." అన్నాడు రాజావారు.

"మన గురించి ఎవరైనా ఆతృత పడుతున్నారా?" అనుమానంగా చూస్తున్నారా?"

"లేదు! కానీ ఎదురింట్లో ఏకాంబర మనే ఒకతను వున్నాడు. అతను కిటికీలో కూర్చుని అస్తమానం ఈ బంగళాకేసి చూస్తున్నట్లు నా కనుమానంగా వుంది. ఆతృత ఆపుకోలేక ఇవాళ నా దగ్గరకొచ్చి మాట్లాడాడు కూడా!"

"ఖర్చు రాసేద్దాం?"

"అంత అవసరం లేదు! అతని సంగతి నేను చూచుకుంటాను, నువ్వుమాత్రం అసలైన నిసలయిన రాజాలా దర్పం వెలగబోస్తూ, దర్జా వెలిగిస్తూ వుండాలి!" అన్నాడు మూర్తి.

## 2

వారంలోపల ప్లాన్ ప్రకారం మూడు క్లబ్బుల్లోనూ నేరేడుపల్లి రాజా శ్రీ వీరవెంకట సత్యనారాయణమూర్తి గారు ఇచ్చిన ఘనమైన పార్టీలు ముగిశాయి.

కోట్లకు పడగలెత్తిన ప్రముఖులంతా శ్రీమతులతో సహా వచ్చి విస్కీతోపాటు విందు గూడా ఆరగించి వాళ్లు అలసిందాకా బాల్ డాన్సులు చేసి వెళ్ళిపోయారు.

ఇరవై వేల ఖర్చుతో పదిదినాల్లో రాజావారు మద్రాసు మహానగరంలోని పెద్ద వాళ్ళ సంఘంలోకి జొరబడిపోయాడు.

ఆయన్ని పెట్టుబడి పెట్టమంటూ కొందరూ, విరాళా లివ్వమంటూ మరికొందరూ, సభలకు రమ్మనో, లేక ప్రారంభోత్సవం చెయ్యమనో మరికొందరూ, రావటం మొదలెట్టారు.

"ఈ మనుష్యులు నిజంగా మట్టిముద్దలు మూర్తీ. మెరిసేదంతా బంగారమనుకుంటారు. మన నిజస్వరూపం తెలిసిందంటే మైళ్ళదూరం పారిపోతారు!" అన్నాడు ఆనంద్.

"వాళ్ళను కాదు మనం అనుకోవలసింది. వాళ్ళ డబ్బుకూ, అది ఉన్నవాళ్ళకు, ఇచ్చే గౌరవాన్ని. ఈ సంఘంలో అదే బలహీనత. దాన్ని ఆధారం చేసుకొనే మనలాంటి వాళ్ళు దెబ్బ తియ్యాలి" అన్నాడు మూర్తి.

"అది సరే! మనం ఈ ప్రాజెక్టుపైన దాదాపు రెండు లక్షలు ఖర్చుపెట్టాం. కనీసం పెట్టుబడన్నా దక్కుతుందంటావా?" అడిగాడు ఆనంద్.

"ఎంత చచ్చుగా వచ్చిన కనీసం పదిలక్షలన్నా రావాలి! ఆపైన చిక్కితే మనం అదృష్టవంతులమే!" అన్నాడు మూర్తి.

"ఏమో?" అన్నాడు ఆనంద్.

"అలా నిరాశపడకూడదు. అన్ని వ్యాపారాలలాగే మనదీ ఒక వ్యాపారం. లాభనష్టాలు ముందే తెలుస్తాయా? వ్యాపారం జరిగాక గాని లెఖలు తేలవు" అన్నాడు మూర్తి.

"నా బాధ అదికాదు. ఏ పరిస్థితుల్లోనూ మనం చిక్కిపోకూడదు. జాగ్రత్తగా అన్ని ఏర్పాట్లు చెయ్యి. ఓ మారు మనం కూర్చుని తర్కించుకోవడం అవసరం.

ఏవైనా లోటుపాట్లు ఉన్నట్లు తోస్తే సర్దుకోవచ్చు"
అన్నాడు ఆనంద్.

"అలాగే!" అంటూ లేచాడు మూర్తి.

ఆనంద్ ఆతర్వాత ఆలోచిస్తూ కూర్చున్నాడు. రాణీ
గారు లోనికొచ్చారు.

"ఏమండీ!" పిలిచింది రాణి.

"రా! కాంతం!" అన్నాడు ఆనంద్.

రాణి వచ్చి దగ్గరగా నిలుచుంది.

"ఏం కావాలి!" అడిగాడు ఆనంద్,

"నాకు, ఖరీదైన చీరలు, తిండి, పడక, కావాలను
కొని మీతో వచ్చేశాననుకుంటున్నారా?" అడిగింది
కాంతం.

అర్థం గానట్లు చూశాడు ఆమెవేపు.

"నేనెలాంటి బ్రతుకు బ్రతికానో మీకు తెలుసు.నన్ను
తెచ్చి ఇలా బంగారుపంజరంలో తోశారు. నా అతీగతీ
కనుక్కోవడంలేదు. నా కిక్కడ వుండాలనిపించడంలేదు.
పంపించెయ్యండి. కాకినాడ వెళ్ళిపోతాను"అంది కాంతం.

ఆ మాటలకు అదిరిపడ్డాడు ఆనంద్.

"మూర్తి, అదే నా సెక్రెటరీ నీ మంచిచెడ్డలు చూడ
టం లేదా?"

"అతను చూసేవి వేరు. మీరు చూడవలసినవి వేరు"
అంది కాంతం.

ఆమె అభిప్రాయం అర్థమైంది. తన గొడవల్లో, ఆలో
చనల్లో, భయాల్లో, ఆమె దైహికావసరం సంగతి మరచే
పోయాడు. ఆనంద్ కు స్త్రీ వ్యామోహం చాలా తక్కువ.
ఆమెను తన అవసరాలకు అడ్డం పెట్టుకోనేందుకు లేపు

కొచ్చాడు తప్ప, కాపురం చేసేందుకు కాదు.

"ఓః! సారీ! బిజీగా వుండిపోయాను. పద!" అంటూ లేచాడు రాజాగారు.

కాంతం నవ్వింది.

ఆమె భుజంపైన చెయ్యివేసి నడిపించుకుపోయాడు ఆమె గదిలోకి. గాలి బాగా రాలేదు. కిటికీ తలుపులు తీశాడు.

ఎదురుగావున్న ఇంటి మేడ పైభాగానికున్న కిటికీకి అతుక్కుపోయి వున్న మానవాకారం మసక చీకట్లో చూచాయగా కనుపించింది. రెక్కలు దగ్గరకు నెట్టాడు.

"అ స్తమానం అలా చూస్తూనే వుంటాడు ఎవరో గాని" అంది కాంతం మంచంపైన కూర్చుంటూ.

"నిన్నా?"

"కాదు! మన బంగళాను."

"ఎందుకో?"

"నాకు మాత్రం ఏం తెలుసు? మీలా ఇంట్లోనే వుండే దాన్ని" కాంతం.

"ఒకవేళ నీకు తెలిసిన మనిషేమో. గుర్తుపట్టి అలా ఆశగా చూస్తున్నాడా?"

"అలా అయివుండదు. ఎక్కడ కాకినాడ? ఎక్కడ మద్రాసు?" అంది కాంతం.

గదిలో కొచ్చేప్పుడు వున్న వుత్సాహం ఆనందంలో చచ్చిపోయింది. అతని ఆలోచనంతా కిటికీకి అతుక్కుపోయి వుంటున్న ఆకారం చుట్టూ పరిభ్రమించసాగింది. మాట్లాడకుండా లేచివెళ్ళాడు వెలుపలికి.

తన రూంలో బెడ్ ప్రక్కనున్న కాలింగ్ బెల్ నొక్కాడు. ఐదునిముషాల తర్వాత మూర్తి పైకొచ్చాడు.

అతనికి ఎదురింటి కిటికీ మనిషి గురించి చెప్పాడు.

"ఏం చేద్దాం?" అడిగాడు మూర్తి.

"నువ్వే ఆలోచించు, కొంపదీసి అతనే రహస్య గూఢచారో అయితే మనం చిక్కుల్లో పడతాం. అతను నోరు విప్పకముందే గొంతు కురిబిగించడం మనకు శ్రేయస్కరమనిపిస్తుంది" అన్నాడు ఆనంద్.

"అలాగే అనుకున్నా - దానివల్ల చాలా ఇబ్బందులున్నాయి. ఇతను చచ్చాక, డిపార్టుమెంటు మొత్తం నిద్రలేస్తుంది. మనపైకి దాడి చేస్తుంది. మన ప్లాన్ అసలు పారదు. అందువల్ల ఆ మనిషి కంత ప్రాధాన్యం ఇవ్వకుండా మన వ్యవహారం ముగించుకొని గుట్టుచప్పుడు కాకుండా వెళ్ళిపోవడం ఉత్తమం" అన్నాడు మూర్తి.

"ఆల్ రైట్! నీ యిష్టప్రకారమే కానివ్వు!"అన్నాడు ఆనంద్.

మూర్తి లేచి తన రూంకి వెళ్ళిపోయాడు.

## 3

"మన ప్లాన్ మరోమారు వివరంగా చెప్పు!" అన్నాడు ఆనంద్.

మూర్తి సిగరెటు దమ్ము లాగి ఆష్ట్రేలో విదిలించాడు కాళ్లు కొంచెం ముందుకు జాపి విశాలంగా, విశ్రాంతిగా కూర్చున్నాడు కుర్చీలో.

"రేపు రాత్రి సరిగ్గా ఎనిమిదిగంటలకు ప్రారంభ మవుతుంది రాజాగారి పుట్టినదినం వేడుక. ఈ పార్టీకి మొత్తం అరవై మందిని పిలుస్తున్నాం. అందరూ కోటీశ్వరులు, కొంతమంది భార్యలతో వస్తారు. మొత్తం వందమందికి పైగా అవుతారు.

మీరు మీ కులదైవానికి పూజచేస్తుంటారు సతీసమే తంగా. ఆ గదిలోకి అందరూ ప్రత్యేకమైన దుస్తులు ధరించివెళ్ళాలన్న నియమం పెడతాం. చీరలు, జాకెట్లు, పట్టుపంచెలు, పై కండువాలు మనం సప్లయి చేస్తాం. ఎవ్వరూ యేవిధమైన నగలు ధరించకూడదన్న నిబంధన పెడతాం.

దాంతో వచ్చిన వాళ్ళు వాళ్ళ బట్టలు నగలు, విప్పి పెడతారు. వాటిని కాపలా కాసే బాధ్యత నేను తీసు కుంటాను. ఆహుతులందరూ లోనికెళ్ళగానే నగలన్ని పోగుచేసుకుని మన అంబాసిడర్ కారులోనికి చేర్చుకొని వెళ్ళిపోతాను. వాళ్ళందరూ గడబిడలో వుండగా నువ్వు తప్పించుకొని కాంతంతో వచ్చేయ్యాలి. ఆమెను మన వీలు చూసుకొని ఎక్కడో సఫా చేసేద్దాం'' అన్నాడు మూర్తి.

''వీళ్ళు పోలీసులకు ఫోన్ చేద్దామని గడబిడ చేస్తే!'' అడిగాడు ఆనంద్.

''చేసుకోని నువ్వేదో నెపం చెప్పి వెనక దారిన పారి పోవాలి'' అన్నాడు మూర్తి.

''ఓకే!'' అన్నాడు ఆనంద్.

''మనం ఎక్కడ కలుసుకోవాలి!''

''అదీ నువ్వే చెప్పు!''

''అహ్మదాబాద్‌లో మన స్థలం తెలుసుగా?''

''తెలుసు.''

''అక్కడే వుంటాను. ఒంటి కంటి రామ్మూర్తిగా కాదు. రెండు కండ్ల రజనీ పటేల్‌లా'' అన్నాడు మూర్తి.

''అలాగే'' అన్నాడు ఆనంద్.

మూర్తి దిగి క్రిందికి వచ్చాడు. పోర్టికోలోంచి వెలుపలి గార్డెన్‌లో పచార్లు చెయ్యసాగాడు. ఎదురింటి కిటికీలో చీకట్లో దయ్యంలా కూర్చునివున్న ఏకాంబరం రూపం కనుపించింది మసకగా. చూడగానే అదిరిపోయాడు.

ఏ విధమైన అవసరమూ లేకుండా, తమపైన అనుమానం కలగకుండా వుండివుంటే, ఆ మనిషి అలా గత నెలరోజులుగా ఎందుకు పహారా వేస్తుండి వుంటాడన్న అనుమానం పెనుభూతంలా మూర్తి మెదడును తొలచి వెయ్యటం ప్రారంభించింది.

ఒక్క రోజు! మరో ఇరవైనాలుగు గంటలలో తాము దాదాపు నాలుగు లక్షల రూపాయలు పెట్టుబడిపెట్టి ఆడుతున్న నాటకంలోని ఆఖరి సీను ముగిస్తుంది. అంతదాకా అతని వల్ల ఏ విధమైన అడ్డంకీ ఏర్పడకుండా చూసుకోవాలని తీర్మానించుకున్నా మూర్తి.

కానీ అది ఎలా సాధించాలన్నది అర్థంగాలేదు. ఆలోచిస్తూ పచార్లు చెయ్యసాగాడు.

## 4

తెల్లవారింది.

రాజాగారి బంగళా మొత్తం కోలాహలంగా వుంది. వంటలు చేస్తున్నారు. పూజగది అలంకారం చెయ్యడం కొందరు చూస్తుంటే, విస్కీ సీసాలు, గ్లాసులు, మొదలైనవి మరి కొందరు సర్దసాగారు.

క్రింది అంతస్తులో వున్న పెద్ద హాలులో, రాబోయే అతిథులు బట్టలు మార్చుకొనేందుకు ప్రత్యేకించాడు మూర్తి. అక్కడ చిన్న చిన్న బాండ్ కేసులు దాదాపు యాభై వున్నాయి. అన్నింటిపైన ఆహుతుల పేర్లు వ్రాసి

వున్నాయి. వాళ్ళు తెచ్చుకొన్న నగలు మొదలైనవి అందులో వుంచుకొని, తాళం వేసుకుని వెళ్ళేందుకు వీలుగా అలాంటి ఏర్పాటు చేసిపెట్టారు.

ఆనంద్, మూర్తి, క్రిందా పైనా తిరిగి అన్ని పనులు ఎలా జరుగుతున్నవీ పర్యవేక్షణ చేశారు.

ఇంత హడావుడిలోనూ, మూర్తి ఎదురింటి ఏకాంబరం గొడవ మరచిపోలేదు.

పది గంటల ప్రాంతంలో పైపు కాలుస్తు వెళ్ళి గేటు దగ్గర నిలబడ్డాడు ఏకాంబరం రాకకోసం చూస్తు. పది నిముషాల తర్వాత అతను రావటం కనుపించింది. మూర్తే పలకరించాడు, "ఆఫీసుకా?" అంటూ.

"అవునండీ!" అన్నాడు ఏకాంబరం.

"ఏ ఆఫీసులో పనిచేస్తారు?"

"ఐ. జి. ఆఫ్ పోలీసులో" అతను జవాబు చెప్పాడు. విని అవాక్కయిపోయాడు.

"ఇవాళ రాత్రికి మా రాజాగారి పుట్టిన దినం వేడుకలు జరుపుతున్నాం మీకు రావడానికి వీలుంటుందా?" అడిగాడు మూర్తి.

"అయ్యో! మీ అంత పెద్దలు పిలుస్తుంటే వీలు ప్రశ్న ఏమిటి? తప్పకుండా వస్తాను" అన్నాడు ఏకాంబరం.

"థాంక్స్!"

"నేను చెప్పాలి! ఇంతకూ ఎన్ని గంటలకు రమ్మంటారు?"

"మందు పుచ్చుకునే అలవాటుందా?

"ఆహాఁ! శేషుగా తాగుతాను. తేరగావస్తే..." అంటున్నాడు ఏకాంబరం.

"అయితే ఎనిమిది గంటలకల్లా రండి" అన్నాడు మూర్తి.

"వస్తాను! ఖచ్చితంగా వస్తాను. ఇప్పుడే ఆఫీసుకు వెళ్ళొస్తాను!" అంటూ సెలవు పుచ్చుకున్నాడు మూర్తి దగ్గర ఏకాంబరం. అతను రోడ్ మలుపు తిరిగేదాకా చూసి, ఆ తర్వాత బంగాళాలోకి ప్రవేశించాడు.

ఆనంద్ ఎదురొచ్చి "ఎక్కడికెళ్ళావ్" అడిగాడు.

చేసిన ఘనకార్యం చెప్పాడు.

అంతా విని "వాకు రావడం లేనిపోని అడ్డంకు కాదూ!" అన్నాడు.

"అది కాదు నాప్లాన్! ఎనిమిదింటికల్లా వాడొస్తాడు. రాగానే వాణ్ణి వెనుక వేపు గదుల్లో ఒక దాంట్లో తోసి తాళం పెడతాను."

"అల్లరి చేస్తే!"

"ఆ అవకాశం మనం ఇస్తేగా! కాళ్ళూ చేతులు కట్టి నోటికి టేపు కరిపిస్తే బ్రతికున్న శవంలా వుంటాడు" అన్నాడు మూర్తి.

ఆనంద్‌కు మూర్తి విలువ, అతని తెలివి తేటల యొక్క ఉపయోగం అప్పుడర్థమైంది.

"సాహసం తప్ప ఓర్పు లేదు నాకు. నీకు ఓర్పుతో పాటు అపారమైన తెలివి కూడా వుంది" మెచ్చుకోలుగా అన్నాడు ఆనంద్.

"అందుకే మన ఇద్దరం ఒకటైనాం! మనకు అపజయం అసలు లేదు!" అన్నాడు మూర్తి.

ఆ పగలంతా అన్ని ఏర్పాట్లూ చేసుకోవడంలోనే సరిపోయింది ఇద్దరికి. దొడ్డి వేపు తమ దగ్గరున్న రెండు కార్ల టాంకులనిండా పెట్రోలు పోసి పెట్టుకొన్నారు. వాటికి

నెంబరు ప్లేట్లు మార్చివేశారు.

ఏకాంబరాన్ని ఏ గదిలో బంధించవలసిందీ తర్కించుకొని నిర్ణయం చేసుకున్నారు. పనివాళ్ళను ఇద్దరిని తప్ప మిగతావాళ్ళను పంపించి వేశారు.

కాంతం తలార నీళ్ళు పోసుకొని, లూజుగా ముడి వేసుకుంది వెంట్రుకలు. ఖరీదైన తెల్ల పట్టుచీర, జాకెట్ ధరించింది. ఆనంద్ కూడా పట్టు బట్టలు కట్టుకున్నాడు. విశాలమైన ఆ హాలులో తూర్పు దిక్కుకు అభిముఖంగా ఒక దేవత తాలూకు ఆయిల్ పెయింట్ ఉంది. దాని ముందు రకరకాల పండ్లు పూలు పెట్టి వున్నాయి. ఆహుతులు కూర్చునేందుకు పులి చర్మాలు చాపల్లా పరచి వుంచారా గదినిండా.

# 5

రాత్రి ఏడు కావస్తూంది.

ఆహుతు లొక్కొక్కరే రావడం మొదలెట్టారు. వచ్చినవాళ్ళందరికీ మూర్తి, రాజాగారి వంశంలోని, కట్టుబాట్లు వివరించి చెప్పాడు. వాళ్ళు బట్టలు విప్పి, నగలు తీసి తమకిచ్చిన బ్యాండ్ కేస్‌లో పడేసుకుని తాళం వేసి, తాళాలు తీసుకొని పూజ జరుగుతున్న గదివేపు పోసాగారు.

ఎనిమిదయ్యేసరికల్లా దాదాపు అందరూ వచ్చేశారు. రాజావారింటికి రావడం కాబట్టి, ప్రతి ఒక్కరూ తమ కున్న సంపదంతా ప్రదర్శించేందుకుగాను అన్నట్లు ఉన్న నగలన్నీ పెట్టుకొని వచ్చారు. ఇరవైదాకా వజ్రాల నెక్లెసులుకూడా కనుపించాయి మూర్తికి.

అందరూ పూజ జరుగుతున్న హాల్లోకి వెళ్ళారు.

ఏకాంబరం కోసం ఎదురుచూస్తూనే వున్నాడు ఏడింటి నుంచి. అతని జాడ లేదు. వస్తానన్న మనిషి రాకపోవడం

అనుమానాల్ని రేపుతూంది అతనిలో. అతన్ని గురించి ఎదురుచూడటం మానేశాడు మూర్తి. తన ప్లాన్ అమలు జరిపే పని పెట్టుకొన్నాడు.

ఆ గది తలుపులన్నీ మూసి, బాండ్ కేస్‌లన్నీ ఒక దానిపై ఒకటి పేర్చాడు. ఆ గది ప్రక్కగదిలో వున్న ఎలక్ట్రిక్ కనెక్షను కమర్చిన ఫ్యూజ్ పీకేశాడు. బంగళా మొత్తం చీకట్లో నిండిపోయింది.

మూర్తి ముందుగా సిద్ధం చేసుకున్న ప్రకారం తన అనుచరుల సాయంతో బాండ్ కేసులన్నీ కారులోకి చేర్పించుకొని, వాళ్ళిద్దరికీ చెరో వెయ్యి రూపాయలిచ్చి తుర్రుమని పారిపోయాడు కార్లో.

చీకట్లోనే కాంతాన్ని వెంటబెట్టుకుని ఆనంద్ గూడా, ఫోన్ చెయ్యమనీ, మనుషుల్ని పిలవమనీ, అరుస్తూ, జనాన్ని తప్పుకుంటూ క్రిందికొచ్చాడు. సిద్ధంగావున్న కారెక్కి స్టార్టు చేశాడు.

ఆ కారుకూడా రయ్యిమని వడిసెల్లో రాయిలా దూసుకు పోయింది.

మళ్ళీ లైట్లు వెలిగాయి.

ఆహూతులందరూ ఆత్రంగా రాజాగారికోసం చూశారు. మెట్లెక్కి పైకొచ్చిన ఏకాంబరం అందరికీ జరిగింది చెప్పాడు.

అందరూ మొత్తుకున్నారు.

అందరి నగల విలువ కలసి వెరశి పదహారు లక్షలదాకా వుంటుందని అంచనా వేశారు.

ఏకాంబరం పోలీసు రిపోర్టు ఇద్దామన్నాడు. ఒక్కరూ ఒప్పుకోలేదు, పరువు పోతుందని. ఆ నగలన్నీ నల్లడబ్బుతో

కొనివుండటంవల్ల, అనవసరమైన గొడవల్లో చిక్కుకో వలసి వస్తుందని భయపడ్డారు వాళ్లు.

ఏకాంబరం తిన్నగా పోలీస్ స్టేషనుకు వెళ్ళి జరిగింది మొత్తం వివరంగా చెప్పాడు.

ఇన్స్పెక్టర్ విని "ముందుగా మీరెందుకు చెప్పలేదు!" అడిగాడు.

"వాళ్ళను గురించి నా కనుమానం కలిగింది. అది నిర్ధారణ చేసుకుందామనుకున్నాను. ఈలోగా వాళ్ళు చెక్కేశారు. కానీ వాళ్ళ ఫొటోలు తీశాను. ఫిలిమ్ ఇంకా డెవలప్ చెయ్యలేదు. చేశాక మీకు ప్రింట్లు ఇస్తాను" అన్నాడు.

"మీరెక్కడ పనిచేస్తున్నారు?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"పనికోసం తిరుగుతున్నాను. ఇంతలో వీళ్ళు తటస్థపడ్డారు. వీళ్ళు చేసిన బాంక్ దోపిడీ వివరాలు పేపర్లో చదివాను. వీళ్ళను పట్టుకొని మీ కప్పగిస్తే లక్షరూపాయల బహుమానం దొరుకుతుంది గదాని ఆశ పడ్డాను. అది కాస్తా నిరాశయింది" అన్నాడు ఏకాంబరం.

"మళ్ళీ ప్రయత్నించండి!"

"ఏవూరు వెళ్ళారో? ఏమో? ఈమారు ఏ రూపంలో వుంటారో? ఏం నాటకం ఆడతారో? ఎలా తెలుసుకోవడం?" నిర్లిప్తంగా చెప్పాడు ఏకాంబరం.

ఆ తర్వాత పోలీసులు ఆ బంగళాకు వెళ్ళారు. అన్నీ వెతికారు. కొంతమంది విజిటర్సును ప్రశ్నించారు. కానీ వాళ్ళకు ఏమీ అంతు చిక్కలేదు.

ఈ పథకం జయప్రదంగా నిర్వహించేందుకు వాళ్ళు పెట్టిన ఖర్చు, వెలిగించిన దర్జా, వీటినిబట్టి, ఇది మెర్క్యురీ

ముఠా చేసిన పనే అయివుంటుందని, పోలీసువర్గాలు భావించాయి.

ఏకాంబరం సప్లయిచేసిన ఫొటోల ఆధారంగా దేశం లోని పోలీసు బలగం యావత్తూ అప్రమత్తంగా వుండి, వాళ్ళు కనుపిస్తే అదుపులోకి తీసుకునే సన్నాహాలు చేశారు. పేపర్ల నిండా వాళ్ళ ఫొటోలు ప్రకటించారు. అంతకు ముందు బ్యాంక్ దోపిడీ సందర్భంగా, వాళ్ళ ఆచూకీకోసం ప్రకటించిన లక్షరూపాయల బహుమతి, లక్షాయాభైవేలకు పెంచింది ప్రభుత్వం.

ఇంతటి గుండెలు తీసిన మొనగాళ్ళను పట్టుకోవడంలో జాప్యం చేస్తున్నందుకు ప్రభుత్వాన్ని దుయ్యబట్టాయి పత్రికలు.

సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ వెంటనే రంగంలోకి దిగింది, దేశవ్యవహారాల మంత్రిగారి ఆదేశా న్ననుసరించి.

సీనియర్ ఆఫీసర్ లాల్ నియమింపబడ్డాడు. ఆయన అన్ని వివరాలు సేకరించుకుని కేసుల్ని క్షుణ్ణంగా 'పరిశీ లించాడు. తను అవలంబించవలసిన పరిశోధనాపద్ధతి గురించి తీవ్రంగా ఆలోచించుకుని ఒక నిర్ణయానికి వచ్చాడు.

## 6

"ఏకాంబరం మీరేనా?" అడిగాడు లాల్ గదిలోకి ప్రవేశించిన వ్యక్తిని ప్రశ్నార్థకంగా చూసి.

"అవును!" అన్నాడు ఏకాంబరం.

"ప్లీజ్ సిట్ డౌన్!" కుర్చీ చూపించి, తనూ టేబుల్ కావలనున్న కుర్చీలో జేరబడ్డాడు లాల్. ముందుకు వంగి

ఏకాంబరం మొఖాన్నీ, కళ్ళనూ, తదేకంగా రెండు నిము షాలు గమనించి చూశాడు. ఆతర్వాత వెనక్కి వాలి సిగరెట్ తీసి వెలిగించుకొన్నాడు.

దమ్ము లాగి, పొగ వదుల్తూ "మిస్టర్ సుధాకర్! ఇక చెప్పండి! ఎంతదాకా వచ్చింది మీ పరిశోధన? ఎవరి తరఫున పరిశోధిస్తున్నారు?" అడిగాడు లాల్.

"ఎలా కనుక్కున్నారు?" అడిగాడు ఏకాంబరంగా వ్యవహరిస్తున్న డిటెక్టివ్ సుధాకర్.

"మీ అంత గొప్పవాణ్ణి కాకున్నా కనీసం, మిమ్మల్ని మారు వేషంలో వున్నంత మాత్రాన మోసపోయి, ఏకాంబరం అనుకొనేటంత అవివేకిని గాను!" అన్నాడు లాల్.

"నన్నెవ్వరూ గుర్తు పట్టలేదు. మిస్టర్ మెర్క్యూరీ కోసం దాదాపు సంవత్సరంనుండి వల పన్నుతున్నాను. చిక్కినట్లే చిక్కి తప్పించుకొంటున్నాడు.

భిక్కవరం రాజాగార్ని లక్నోలో హోటల్లో కలుసుకున్నాడు ఈ మెర్క్యూరీ. అక్కడే అతనూ మకాం పెట్టాడు. తనదగ్గర వందరూపాయల నోట్లు అచ్చువేసే చిన్న పోర్టబుల్ మిషన్ వుందని చెప్పాడు. వారికి దాన్ని డెమాన్‌స్ట్రేషన్ చేసి చూపించాడు కూడా.

దాంట్లో అసలైన వందరూపాయల నోటు పైభాగాన పెట్టి, క్రిందివైపు, తెల్లకాగితం పెట్టి స్విచ్ నొక్కితే లైటు వెలుగుతుందట. రెండు క్షణాలుంచి ఆర్పితే, క్రింది కాగితం అసలైన, సిసలైన నూరురూపాయల నోటుగా మారుతుందట.

రాజాగారు నమ్మారు. రెండు లక్షలిచ్చి కొనుక్కున్నాడు. ఆతర్వాత మరో మూడులక్షలు ఖర్చుపెట్టి కరెన్సీకి వాడే కాగితాన్ని సంపాదించాడు. కానీ ఆ మిషన్

పని చెయ్యలేదు. అంతా బూటకం అని తెలుసుకున్నాడు. నా దగ్గరకొచ్చి చెప్పాడు. అతన్ని ఎలాగైనా పట్టుకొని తనకు ఒప్పగించమని కోరాడు.

ఆ పనిలో పడి ఆరాలు తీశాను. ఆచూకీలకోసం ప్రయత్నించాను. కలకత్తాలో అతన్ని గుర్తించాను. నేను నిర్ధారణ చేసుకొని, అతన్ని బంధించాలనుకొనేలోగా, బ్యాంక్ దోపిడీచేసి మాయమయినాడు. అక్కడ్నించి నానాబాధపడి అనుమానం మీద మద్రాసు చేరాను. ఇక్కడా నా కళ్ళలో దుమ్ముకొట్టి వెళ్ళాడు'' అన్నాడు డిటెక్టివ్ సుధాకర్.

''అంటే వాళ్ళు సామాన్యులు కారనిపిస్తూంది!'' అన్నాడు లాల్.

''అవును, ఇన్నాళ్ళూ వాళ్ళను పరిశీలించటమే సరిపోయింది నాకు. సరియైన అవకాశం చిక్కలేదు. వాళ్ళ పథకం ఏమిటో నా కర్థం కాలేదు. ఇంత హఠాత్తుగా అంతర్ధానమై పోతారని నే నూహించలేక పోయాను'' అన్నాడు సుధాకర్ నొచ్చుకుంటూ.

''అందుకే అతనికి మిస్టర్ మెర్క్యూరీ అని పేరు పెట్టాం. చిక్కినట్లే చిక్కి, మాయమై పోతుంటాడు'' అన్నాడు లాల్.

''ఈమారు అది సాధ్యం కాదనుకుంటాను. మనం ఇద్దరం వున్నాం'' అన్నాడు సుధాకర్.

''వాళ్ళు ఇంద్రజిత్తులు, మాయాజాలం తెలిసిన వాళ్ళలా, కళ్ళముందే ఆవిరిగా మారి అంతర్ధానమై పోతారు! మన భవిష్యత్ కార్యక్రమం ఏమిటి?'' అడిగాడు లాల్.

"ఇలాంటి నేరాలు చేశాక కొన్నాళ్ళపాటు వీళ్ళు మనకు కనుపించరు. ఎక్కడో అనామకులుగా వుండి పోతారు. ఆ తర్వాత మెల్లగా ఏదో పెద్ద పథకం వేసుకుని, పెద్ద సిటీలో ఆడంబరంగా మకాం పెడతారు. ఆ మకాం పెట్టిందాకా మనం కాచుకొని కూర్చోవలసిందే!" తన అభిప్రాయం చెప్పాడు సుధాకర్.

"వాళ్ళు ఎటు వెళ్ళివుంటారో మనం ప్రయత్నిస్తే తెలుస్తుం దనుకుంటాను. అజ్ఞాతవాసంలో వుండగానే మనం పసిగట్టగలిగితే చేతుల్లోంచి జారిపోకుండా పట్టుకో గల మనిపిస్తుంది!" అన్నాడు లాల్.

"ఆల్ రైట్! నేను రెడీ!" అన్నాడు సుధాకర్.

ఇద్దరూ ఆ తర్వాత ఒక గంటసేపు ఏం చెయ్యావలసిందీ ఎలా ముందుకు వెళ్ళవలసిందీ ఆలోచనలు చేసుకుంటూ గడిపారు.

బల్లపై నున్న ఫోన్ మ్రోగింది.

రిసీవరు పైకెత్తి "హల్లో! లాల్ హియర్!" అన్నాడు మెల్లగా.

"నేను ఐ. జి. పీ. ని మాట్లాడుతున్నాను" అవతలి వేపునుండి వినవచ్చింది బొంగురు గొంతు.

"చెప్పండి!"

"బిట్రగుంట కివతల, గ్రాండ్ ట్రంక్ రోడ్ కు ప్రక్కగా ఒక అంబాసిడర్ కారు వదలివేసి వుందట. అందులో ఒక స్త్రీ శవంకూడా వుందట. ఆమె రూపు రేఖలు, మనం రాత్రే అన్ని స్టేషనులకూ టెలిఫోటో ద్వారా పంపిన మిస్టర్ మెర్క్యురీ వెంటవున్న స్త్రీని పోలి వున్నాయట. మీరు చూస్తే బాగుంటుందేమో!" అన్నాడు ఐ. జి. పి.

"నా వెంట సుధాకర్ గారుకూడా వున్నారు. ఇద్దరం వెళ్ళొస్తాం" అన్నాడు లాల్.

"మీకు అవసరం అనిపిస్తే నేనూ వస్తాను!" అన్నాడు ఐ. జి. పి.

"వద్దు సార్! మేం చూసుకుంటాంగా?" అని ఫోన్ పెట్టేశాడు లాల్. విషయం వివరంగా చెప్పాడు.

రెండునిముషాల తర్వాత వాళ్ళిద్దరూ ఎక్కిన నల్ల అంబాసిడర్ మద్రాసు మహానగరపు రోడ్లను చీల్చుకుంటూ పరుగెత్తసాగింది.

మూడుగంటలా ముప్ఫయిఅరు నిముషాలకు వాళ్ళ కారు అల్లూరు రోడ్ బ్రిడ్జి కివతలవేపున్న చెట్లక్రింద ఆగింది.

లాల్ దిగాడు కారు. అతని వెనుక సుధాకర్ కూడా దిగాడు. ఇద్దరూ రోడ్ వారగానున్న అంబాసిడర్ కారు దగ్గరకు నడిచారు. పోలీస్ జీప్ కున్న హెడ్ లైట్లు ఆ కారువేపుకు పెట్టి ఆన్ చేయించారు.

రాణీగారిలా తిరిగిన స్త్రీయే హత్యకాబడిన మనిషని చూడగానే గుర్తుపట్టాడు సుధాకర్. ఆ విషయం లాల్ కు చెప్పి, కారంతా పరిశీలించి చూడసాగాడు. ఏ విధమైన ఆచూకీ దొరకలేదు.

డాష్ బోర్డుకు ప్రక్కనున్న రేడియో ఆన్ చేసివుంది. ఘుర్ మన్న శబ్దం తప్ప మరేవిధమైన సంగీతం వినరావడం లేదు. ఆ రేడియో సరిగ్గా చనిపోయిన ఆమె ముందుంది. బ్యాటరీలైటు వేసి బ్యాండ్ ఇండికేటరునూ, స్టేషను ట్యూన్ చేసేందు కుపయోగపడే ముల్లును గమనించాడు. అది అహమ్మదాబాద్ స్టేషను అయివుండా లనిపించింది.

ఆ రాత్రివేళ ఆ స్టేషను ఎందుకు ట్యూన్ చేసివుంటా రాని అనుమానం వచ్చింది. ఆ స్టేషనులో ఏ విధమైన ప్రోగ్రాములు వుండే అవకాశం లేదు.

వెలుపలున్న ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్‌ను పిల్చి, ట్యూనింగ్ నాబ్ పైనున్న వేలిముద్రలు డెవలప్ చెయ్యమన్నాడు. అతను పని ప్రారంభించాడు. అరగంట తంటాలు పడ్డాక, సుధాకర్‌ను పిలిచి, ఆ ట్యూనింగ్ నాబ్ పై వున్నవి ఆమె వేలిముద్రలే నని చెప్పాడు.

"అంతమాత్రాన మనకేం తెలుస్తుంది?" అడిగాడు లాల్.

"మిస్టర్ మెర్క్యూరీ, అతని అనుచరుడూ, బహుశా అహమ్మదాబాద్ పోవాలనుకున్నారేమో. ఆమెను చంపే ప్రయత్నం చెయ్యగానే, వాళ్ళ ఆచూకీ అందించేందుకు ఆమె అలా ట్యూన్ చేసి వుండవచ్చుగా" అడిగాడు సుధాకర్.

"ఆమె వాళ్ళనుండి తప్పుకోవటంలో చేసిన ప్రయత్నంలో ఆ నాబ్ కదిలి అక్కడ ఆగిందేమో?" తన అనుమానాన్ని వ్యక్తపరచాడు లాల్.

"ప్రాణాలు తీస్తుంటే తీరికగా ఎవరన్నా రేడియో ట్యూన్ చెయ్యగలుగుతారా? అదీ ఏ ప్రోగ్రామూ రాని స్టేషనుకోసం తిప్పలు పడటం విచిత్రంగా లేదూ?" అడిగాడు సుధాకర్.

లాల్‌కి కూడా అనుమానం కలిగింది. సుధాకర్ సునిశిత పరిశోధనాశక్తికి అచ్చెరువు పొందాడు. క్షణంపాటు అవాక్కయి చూస్తూ నిల్చున్నాడు.

"ఇక్కడ మనం చేసేది ఏమీలేదు! మిగిలిన తతంగ

మంతా పోలీసులు చూసుకుంటారు. మనం వెళ్దాం!" అన్నాడు సుధాకర్.

"అలాగే!" తలాడించాడు లాల్.

ఇద్దరూ కారెక్కారు.

కారు రయ్యిమని ముందుకు దూసుకువెళ్ళింది.

## 7

రోడ్ వెంట కనుపించిన ప్రతి పెట్రోలు బంకుదగ్గరా కారాపి, మెర్క్యురీ, అతని అనుచరుడూ, గుర్తులు చెప్పి అలాంటి రూపురేఖలున్న మనుషులు ప్రయాణంచేసే కారే దైనా వచ్చిందాని అడిగారు. ఎవ్వరూ చూచినట్లు చెప్ప లేదు. చిలకలూరిపేట దగ్గరున్న పెట్రోలుబంకువాలా అలాంటి మనుషులున్న ఒక పెద్ద కారు వచ్చిందనీ, పెట్రోలు పోసి డబ్బు తీసుకున్నానని చెప్పాడు.

"ఏం కారది?" అడిగాడు డిటెక్టివ్ సుధాకర్.

"పాత స్టుడీబేకర్ లాగుంది."

"రంగు."

"తెలుపనుకుంటాను."

"ఎంతమందున్నారు?"

"ముగ్గురున్నారు. ఫ్రంటు సీట్లో ఇద్దరూ, వెనుకసీట్లో ఒకతనూ కనుపించాడు."

"ఎన్ని లీటర్లు పోశావ్?"

"యాభై."

"నీ బిల్లులో కారు నెంబరు నోట్ చేశావా?" అడిగాడు లాల్ గద్దించి.

"చేశాను సార్. చెప్తానుండండి" అంటూ అతను లోనికి పరుగెత్తుకుపోయి బిల్ బుక్ తెచ్చి కాగితాలు త్రిప్పి "ఆ కారు నెంబరు జి. జె. కె. ఆరువేల మూడొం

దలా నలభై ఆరు సార్!'' అన్నాడు.

''థాంక్స్!'' అన్నాడు లాల్.

పదిరూపాయల కాగితం తీసి అతని చేతిలో పెట్టి లాల్ వెంట వెళ్ళి కారెక్కాడు సుధాకర్.

''ఏమనిపిస్తుంది?'' అడిగాడు లాల్.

''అంతా పకడ్బందీగా ప్లాను వేసుకొని చేశారు. అతనివరో సిద్ధంగా కారు తెచ్చిపెట్టాడంటే మనకు అంతకన్నా ఇంకేమనిపిస్తుంది?'' అడిగాడు సుధాకర్.

''మెర్క్యూరీకి పెద్ద బలగం వుండివుండాలి. అందువల్లే అతను పాదరసంలా జారిపోతున్నాడు'' అన్నాడు లాల్.

ఆ కారు నెంబరు చెప్తూ, దాన్ని ఎవరైనా చూసిందీ లేనిదీ అడిగి తెలుసుకుంటూ, హైద్రాబాద్ చేరుకున్నారు ఇద్దరూ.

అక్కడిదాకా మెర్క్యూరీ కారు నెంబరును మార్చడం గానీ, లేదా వేరే కారు తెచ్చుకోవడం గానీ చెయ్యలేదు. నకిరేకల్ దగ్గిర పెట్రోలు పోయించుకున్నాడు. పెట్రోలు బంకు ప్రక్కనేవున్న టీ దుకాణంలోంచి కాఫీ తెప్పించుకున్నాడు. అన్నింటినీ మించి ఐదుపాకెట్ల రెడ్ విల్స్ సిగరెట్లు కొన్నాడు. ఆ బ్రాండ్ మెర్క్యూరీ చాలా దినాలనుండి వాడుతున్నట్లు సుధాకర్‌కు తెలుసు.

''ఆ కారులో వెళ్ళింది మెర్క్యూరీయే అనుమానం లేదు!'' అన్నాడు సుధాకర్.

''ఇందాకా ఫరవాలేదు. హైద్రాబాద్‌నుండి అతను ఎటు వెళ్తాడో, ఏ కారులో వెళ్తాడో మనకు తెలీదు. అలాంటప్పుడు ఏం చెయ్యడం'' అడిగాడు లాల్.

''మనం ఫాలో అయిన కారును అతను వాడని

పక్షంలో అదెక్కడో ఒకరి దగ్గర హైద్రాబాద్‌లో వుండి తీరాలి. దాన్ని వెతుకుదాం. అది దొరక్కుంటే మెర్క్యురీ అందులోనే ముందుకు పోతున్నట్లనుకొని వెంట పడదాం. అలా కాకుండా కారు ఇక్కడే దొరికితే, ఎవరి దగ్గర దొరికిందో వాళ్ళను కాస్త భయపెడితే అతని ఆచూకీ చెప్పొచ్చు,'' అన్నాడు సుధాకర్.

''వండర్‌ఫుల్! మీ ఆలోచన భేషుగ్గా వుంది!'' అన్నాడు లాల్ స్టీరింగు వదలి రెండు చేతుల్తో చప్పట్లు కొడుతూ.

''అలా వదలకు, ఆక్సిడెంటవుతుంది. ముందు మనం పోలీస్ కమిషనర్‌ను కలుసుకుని వచ్చిన పని వివరాలు చెప్పి, మనకు కావలసిన కారు జంటనగరాల్లో ఎక్కడుందో వెతికి చెప్పమని కోరుదాం'' అన్నాడు సుధాకర్.

''అదీ బాగుంది!'' అన్నాడు లాల్.

కారు తిన్నగా పోలీస్ కమీషనర్ గారి ఆఫీస్‌కు పోనిచ్చారు.

లాల్‌నూ, సుధాకర్‌నూ చూడగానే కమీషనర్ గారు వాళ్ళు వచ్చిన పని అర్థం చేసుకొన్నాడు. ఆయనకు మెర్క్యురీ, అతని అసిస్టెంటుల ఫోటోలు అంతకు ముందే వచ్చి వున్నాయి.

''మీకేదైనా ఆచూకీ దొరికిందా?'' అడిగాడు సుధాకర్.

''లేదు!'' చెప్పాడు కమీషనర్.

''బహుశా ఆ యిద్దరూ, మేకప్‌లు మార్చుకొని, కార్లో ప్రయాణం చేస్తు వుండివుంటారు. అందువల్లే ఇంతదాకా ఎవ్వరూ అనుమానించలేక పోయారు'' అన్నాడు లాల్.

''అదీ పాయింట్. మీరిచ్చిన నెంబరు కారు ఇంకా

ఈ జంటనగరాల్లో వుంటే, ఇక పైన మనకండ్ల బడకుండా వెళ్ళేందుకు వీలు లేకుండా, అన్ని రోడ్లు బ్లాకుచేయించి వేస్తాను. సిటీ అంతా వెతికిస్తాను. నాలుగైదు గంటలు పడుతుంది. ఎక్కడుంటారు" అడిగాడు కమీషనరు.

"మేమూ తిరుగుతాం ఊరంతా! అరగంటకోసారి మిమ్మల్ని కాంటాక్టు చేస్తాం" చెప్పాడు సుధాకర్.

"ఓ. కే!" అన్నాడు కమీషనర్.

# 8

లాల్, సుధాకర్ ఇద్దరూ వెలుపలికొచ్చి కారెక్కారు.

కారు కదిలింది.

"సుధాకర్ గారు" పిలిచాడు లాల్ డ్రైవ్ చేస్తునే.

"ఊఁ!" పలికాడు సుధాకర్.

"మనం రాకముందే వాళ్ళు హైద్రాబాద్ దాటిపోయి వుంటే అనవసరంగా టైం పాడుచేసుకొన్నట్లవుతుందేమోనని అనుమానంగా వుంది. మరో ఐదు గంటలు అక్కడే వుండి, అలాంటి కారెక్కడా దొరకలేదని చెప్తే మనం వాళ్ళకు ఇంకా ఎక్కువ దూరమయిపోయే ప్రమాదముంది" అన్నాడు లాల్.

"అదే నేను ఆలోచిస్తున్నాను. మీరు అచ్చూకీ తీస్తూ ఇక్కడే వుండండి. నేను కారు తీసుకొని వెళ్తాను. నేను బొంబాయి రోడ్ నే వెళ్తాడు. పెట్రోలు బంక్సులో చెప్పిపోతుంటాను. దాన్ని బట్టి మీరు నావెంట రావచ్చు ఈ కారు మీరు తీసుకెళ్ళండి!" అన్నాడు సుధాకర్.

"ఓకే" అన్నాడు లాల్, ఇంజన్ ఆపి దిగుతూ.

డిటెక్టివ్ సుధాకర్ స్టీరింగు ముందుకొచ్చి కూర్చున్నాడు.

కారు బొంబాయి రోడ్ ఎక్కింది.

ఆక్సిలేటరు నొక్కాడు.

అక్కడక్కడా కారాపి, మెర్క్యురీ ప్రయాణిస్తున్న కారు వివరాలు చెప్పి, ఆచూకీ తెలుసుకోనేందుకు ప్రయత్నించాడు. కానీ లాభం లేకపోయింది. మధ్యాహ్నం ఒంటి గంట ప్రాంతంలో షోలాపూరు దాటి ఇరవై మైళ్ళు ప్రయాణం చేశాడు. అక్కడ్నుంచి ఎడమవైపుకు దారి తీసే కచ్చారోడ్ కనిపించింది. ఆ సెంటర్లో కల్లు దుకాణంవుంది. అక్కడ కారాపి అడిగాడు.

కల్లు దుకాణంలోవున్న మనిషి, చిన్న కారొకటి వచ్చిందనీ, అందులో ఇద్దరున్నారనీ, ఇద్దరూ బాగా త్రాగి, కచ్చా రోడ్ వెంట వెళ్ళిపోయారనీ చెప్పాడు! అతను చెప్పిన పోలికల్ని బట్టి, మెర్క్యురీ, అతని అసిస్టెంటు అయివుండాలనిపించింది సుధాకర్‌కు. కానీ కారు మాత్రం స్టుడీబేకరు అయివుండదనుకున్నాడు. హైదరాబాదులో కారు మార్చుకొని వుంటారేమోననుకున్నాడు సుధాకర్.

ఏమైనా ఆ కచ్చారోడ్ వెంట వెళ్ళి, కల్లు దుకాణం వ్యక్తి చెప్పిన మనుషుల్ని చూచిరావడం మంచిదని తీర్మానించుకున్నాడు.

కారు కచ్చా రోడ్ పైకి తిరిగింది. దాదాపు అరగంట తర్వాత, ఒక పాడుపడ్డ పెద్ద భవంతి కనుపించింది. అది రోడ్‌కు దూరంగా వుంది. దాని వద్దకు కారు వెళ్ళే మార్గం లేదు.

తనకు ముందొచ్చిన వాళ్ళ కారు కోసం చూశాడు. ఎడమ వేపు, పెద్ద రాతి గుట్టవుంది. కారు దిగి ఆవైపు వెళ్ళాడు. ఆ గుట్ట వెనుక ఆస్టిన్ కారు కనుపించింది.

తలుపు లన్నీ మూసివున్నాయి. హాండల్ పట్టి క్రిందికి నొక్కాడు. డోర్ తెరచుకోలేదు.

వెనక్కి వెళ్ళి నంబర్ చూసి నోట్ చేసుకొన్నాడు. జేబులోంచి తాళాల రింగు తీశాడు. అందులోంచి మాస్టర్ కీ ఒకటి వెతికి, దాన్ని కారుడోర్ తెరవటానికి ప్రయత్నించాడు. అది లోనున్న లివర్లను సరిగ్గా పట్టుకోలేదు. వెలుపలకు లాగి, చిన్న ఫైల్‌తో రెండు మూడు సార్లు కొద్దిగా అరగ దీశాడు. మళ్ళీ ప్రయత్నించాడు. ఈమారు తక్కున తిరిగింది తాళం. డోర్ తెరచి లోనికి ఎక్కి కూర్చున్నాడు. కారంతా పరిశీలించాడు.

విప్పేసిన రెండు జతల బట్టలు కనిపించాయి. ఒక చిన్న జిప్ బ్యాగ్ వెనుక సీటుపైనుంది. దాన్ని తీసుకొని జిప్ లాగి చూశాడు సుధాకర్. రెండు రివాల్వర్లు కొంత అమ్యూనిషన్ వున్నాయి అందులో. దాన్ని యధాస్థానంలో పెట్టాడు.

ఆ కారు మెర్క్యురీ, అతని అసిస్టెంటు ఉపయోగించిందేనన్న నమ్మకం కలిగింది సుధాకర్‌కు. కారు దిగి తను వచ్చిన అంబాసిడర్ ఎక్కాడు. అది పోలీసుకారు కావడం వల్ల దాన్లో వైర్‌లెస్ సెట్ అమర్చివుంది. ఫోన్ తీసి, రేడియో ద్వారా కాంటాక్టు సాధించాడు ఆంధ్రా ఐ. జి. పి. తో. ఆయనకు విషయం వివరంగా చెప్పాడు. తానెక్కడున్నదీ చెప్పి, మహారాష్ట్ర ఐ. జి. పికి రింగ్ చేసి వెంటనే తగిన పోలీసు బలగాన్ని పంపే ఏర్పాట్లు చెయ్యమని కోరాడు. ఐ. జి. పి. గారు అందుకు అంగీకరించారు.

సుధాకర్ ఫోన్ పెట్టేసి ఆలోచించసాగాడు. ఆ ఇద్దర్నీ తనొక్కడే బంధించగలుగుతాడా అన్నది అను

మానంగా వుంది. పైగా వాళ్ళు పాడు పడ్డ ఆ పాత భవనంలో వున్నారు. ఏ మూలో దాక్కొనో తన పైన తుపాకీ కాల్చే ప్రమాదముంది. లాల్ వెంబడి వుంటే బాగుండేదనిపించింది. ఆ కారు కోసం తంటాలుపడుతూ అతను అక్కడే వుండిపోవటం, ఇప్పుడు తనకు సాయం లేకుండా చేసిందని బాధపడ్డాడు.

ఐ. జి. పి. గార్ని కారు విషయం, లాల్ విషయం అడిగివుంటే బాగుండే దనిపించింది. తన భవిష్యత్ కార్య క్రమం ఏమిటాని ఆలోచించసాగాడు. ఒంటరిగా వెళ్ళి ఆ ఇద్దరితో కలబడదామని రెండుమూడుసార్లు అనిపించినా, మెదడు అతని సాహసాన్ని అణచివేసింది.

కార్లో కూర్చుని, కప్ బోర్డ్లోంచి ఫీల్డ్ గ్లాసెస్ తీశాడు సుధాకర్. వాటి సాయంతో దూరంగా వున్న పాత భవంతిని క్షుణ్ణంగా పరిశీలించి చూడసాగాడు. బంగళా పై అంతస్తులోని టెర్రెస్ బాగా కనుపించ సాగింది.

అక్కడెవ్వరూ మనుషులు లేరు. ఎవరయినా వస్తా రేమో చూద్దామని కూర్చున్నాడు. అలాగే గ్లాసెస్ పెట్టుకొని అలా దాదాపు ఇరవైనిముషాలు తదేకంగా చూస్తుండిపోయాడు సుధాకర్. అతని నిరీక్షణ ఫలించింది.

మెర్క్యురీ వచ్చాడు వరండాలోకి, అతని వెంట అనుచరుడుకూడా వున్నాడు. ఇద్దరి చేతుల్లోనూ పెద్దపెద్ద స్టెన్‌గన్ లున్నాయి.

వాళ్ళు తనున్నవైపే గమనించి చూడసాగారు. ఐనా అంతదూరంనుండి వాళ్ళకు తను కనుపించే అవకాశంలేదు.

సుధాకర్‌కూడా లోడెడ్ గన్ తీసి చేత్తో పట్టు కొన్నాడు.

# 9

రెండు పోలీస్ జీప్‌లు వచ్చి ఆగాయి.

వాటి వెనుక మరో కారొచ్చింది. అందులోంచి లాల్ దిగాడు. తిన్నగా సుధాకర్ వద్దకొచ్చాడు.

"గ్లాడ్! మొత్తానికి వాళ్ళ ఆచూకీ పట్టి సాధించావ్" అన్నాడు లాల్.

"ఇంతకూ వాళ్ళు ప్రయాణించిన కారు దొరికిందా?"

"లేదు! అనవసరంగా దానికోసం అక్కడుండి పోయాను నేను" అన్నాడు లాల్.

అంతదాకా జరిగింది టూకీగా చెప్పాడు సుధాకర్, లాల్‌కు. వాళ్ళకు కొద్దిదూరంగా నిలబడ్డారు పోలీసులు.

అందరూ పాత భవంతివేపు వెళ్ళారు.

పోలీసుల్ను తగిన జాగ్రత్తలో వుండమనీ, అవతలి ముఠావద్ద కావలసినంత ఆయుధసామగ్రి వుందనీ, చెప్పాడు సుధాకర్.

పోలీసుల్ని భవంతి చుట్టూ కాపలా పెట్టాడు. అంతకు ముందే ఆస్టిన్ కారు టైర్ గాలి తీసేశాడు సుధాకర్, అందులోంచి తప్పించుకెళ్ళే అవకాశం లేకుండా.

లాల్, సుధాకర్, గన్‌తో కాలుస్తూ, భవంతిలోకి అడుగుబెట్టారు. లోపలంతా పాడుబడిపోయి వుంది. సాలె గూళ్ళు, పిచ్చికగూళ్లు, రణగొణ ధ్వనులు, మొత్తం దాన్ని చూడగానే దయ్యాల నివాసంలా మార్చివేశాయి.

ఇద్దరూ చెరో స్తంభం చాటు చేసుకుని, నుంచుని చుట్టుప్రక్కల గమనించి చూడసాగారు. ఏ విధమైన అలికిడిగానీ, ఎవరయినా తిరుగుతున్న జాడగానీ కనుపించలేదు.

"వాళ్ళు క్రింద లేనట్లున్నారు. ఇందాకా నేను చూసి నప్పుడుకూడా పైనే వున్నారు" అన్నాడు సుధాకర్.

"అయితే పైకే వెళ్దాం!" చెప్పాడు లాల్.

"పదండి!" అంటూ ముందు దారితీశాడు సుధాకర్. మెట్లు ఎక్కడున్నాంచి వున్నాయో వెతుక్కునేందుకు పది నిముషాలు పైనే పట్టింది.

మెట్లెక్కి పైకి చేరుకున్నారు.

పైమెట్టు దగ్గరుండగా, మిరుమిట్లు గొలుపుతూ పేలిన తుపాకీ గుండు చెవిదగ్గరనుంచి రయ్యిమని దూసుకు వెళ్ళడం గమనించాడు సుధాకర్.

"మిస్టర్ సుధాకర్!" ఎవరిదో పిలుపు వినవచ్చింది.

అటూ ఇటూ పరికించి చూశాడు.

మనుషులెవ్వరూ కనుపించలేదు.

"మమ్మల్ని పట్టుకోవాలని రావడం అవివేకం. మెర్క్యూరీ సామర్థ్యాలు మీకు తెలియనివి గావు. మీది వృధా ప్రయాస. మీ వెనుకనున్న సి. బి. ఐ. ఏజెంటు లాల్ గారికూడా నా సలహా ఇదే. దయచేసి వెళ్ళి పోండి. మీ ప్రాణాలు తియ్యనని హామీ ఇస్తున్నాను" అన్నాడు మెర్క్యూరీ ఏదో గోడ చాటు చేసుకుని.

"మిస్టర్ మెర్క్యూరీ! నీ ఆటలు సాగే కాలం పోయింది. ఇన్నాళ్ళూ నువ్వు మా కళ్ళు గప్పి తిరిగావ్. ఇక నీకు అది సాధ్యం గాదు. మర్యాదగా లొంగిపో. లేకుంటే నీ శవాన్నైనా తీసుకుని వెళ్ళగలను" అన్నాడు సుధాకర్.

మరు నిముషంలో సుధాకర్ కాళ్ళముంగు లావుపాటి వస్తువేదో పడింది. నేలకు తగలంగానే పగిలి అందులోంచి

విపరీతంగా పొగ నల్లగా, దట్టంగా రాసాగింది. స్మోక్ బాంబ్ విసిరారని అర్థం చేసుకొన్నాడు సుధాకర్.

జేబురుమాలు తీసి ముక్కు దగ్గర పెట్టుకొన్నాడు. పొగలోంచి రివాల్వరు గురిపెట్టుకుని ముందుకు వెళ్ళాడు. లాల్ రాలేకపోయాడు. పొగ దాటి అవతలివేపు వెళ్ళి నిలుచున్నాడు.

కళ్ళలోకి పొగ పోవటంతో మంటలు పుట్టసాగాయి. నీళ్ళు క్రమ్మాయి. ఎదురుగా వున్నదేదీ కనుపించటం లేదు. జేబురుమాలుతో కళ్ళు తుడుచుకుని తల పైకెత్తి చూశాడు.

తన గుండెలకు తుపాకీ గురిపెట్టి నవ్వుతూ నిలుచున్న మెర్క్యూరీ కనుపించాడు. అతన్ని అంటిపెట్టుకొని తిరిగే మూర్తి కనుపించలేదు.

సుధాకర్ క్షణం ఆలోచించాడు.

"చేతులు పైకెత్తు!" అరచాడు మెర్క్యూరీ.

చెప్పినట్లు చేశాడు సుధాకర్.

"రివాల్వర్ పారెయ్!" ఆజ్ఞాపించాడు మెర్క్యూరీ.

విసిరికొట్టాడు గురిచూసి మెర్క్యూరీ మొహానికి తగి లేట్లు. అది తగలకుండా తప్పించుకునేందుకు ప్రక్కకు వంగాడు మెర్క్యూరీ. వెంటనే ఎడంకాలిని రివ్వున గాలి లోకి విసరి నడుం విరిగేట్లు బలమైన దెబ్బ తగిలించాడు సుధాకర్.

ఆ తాకిడికి తట్టుకొని నిలబడలేక క్రింద పడ్డాడు మెర్క్యూరీ. సుధాకర్ వెంటనే అతనిపైకి దూకాడు. ఉడుంలా పట్టుకొని, పైకి లేవనీకుండా తన శక్తి మొత్తం ఉపయోగించి అదిమిపెట్టాడు.

లాల్ కూడా అక్కడికొచ్చాడు. మెర్క్యురీని ఇద్దరూ పట్టి లేపారు.

"అతనెక్కడ?" అడిగాడు సుధాకర్.

"ఎవరు?"

"నీ అసిస్టెంటు మూర్తి!"

"ఏమో? తేలీదు!"

"చెప్పు! లేకుంటే చంపేస్తాము నిన్ను."

"తెలీదు!" అన్నాడు మెర్క్యురీ.

లాల్ కు వొళ్లు మండింది. అరచెయ్యి పదునెక్కించి బలంగా విసిరాడు. చెంప ఛెళ్లుమంది. నోట్లోనుంచి రక్తం కూడా వచ్చింది.

"ఇతన్ని ఇక్కడ కొట్టి లాభంలేదు. షోలాపూరు తీసుకుపోదాం. అక్కడ చిత్రహింసలు పెడితే తప్ప మనకు అవసరమైన వివరాలు చెప్పడు" అన్నాడు సుధాకర్.

"అదీ నిజమే!" అన్నాడు లాల్.

"మీరు ఇతన్ని తీసుకువెళ్ళండి. నేనా మూర్తిని చూసివస్తాను!" అన్నాడు సుధాకర్.

లాల్ మెర్క్యురీని జబ్బపట్టుకుని క్రిందికి లాక్కు వెళ్ళాడు. సుధాకర్ పైనున్న గదులన్నీ జాగ్రత్తగా తిరిగి వెతికాడు. ఎక్కడా మూర్తి కనుపించలేదు. ఏమయి వుంటాడని అక్కడే రెండు నిముషాలు నిలుచుని ఆలోచించాడు. తప్పించుకొని వెళ్ళి వుంటాడేమోనన్న అనుమానం కలిగింది. అందుకు అతనికి తగిన వీలు వుండడానికి అవకాశం లేదనిపించింది.

క్రింది గదుల్లో ఎక్కడైనా వున్నాడేమోనని మెట్లు

దిగి క్రిందికొచ్చి వెతికాడు.

లాల్ తిరిగొచ్చి "మూర్తి తప్పించుకొన్నాడు" అన్నాడు.

"ఎలా?" ఆత్రతగా అడిగాడు సుధాకర్.

"మన జవాన్ను ఒక తన్ను బాగా తన్ని, స్పృహ పోయేట్లు చేసి, అతని యూనిఫాం ధరించి, మీ కారులో ఉడాయించాడు" అన్నాడు లాల్.

"వండ్రఫుల్! మరి పోలీసులంతా ఏం చేస్తున్నట్లు."

"చూశారట. మన మేదన్నా కార్లోంచి తెమ్మని అతన్ని పురమాయించి వుంటామని చూస్తూ వుండిపోయారట."

"మెర్క్యూరీ ఎలా వున్నాడు."

"నోట్లోంచి ఊరకే రక్తం కారుతూంది. నిస్పృహగా పడివున్నాడు. ముందతన్ని హాస్పిటల్ కు తీసుకువెళ్ళడం నయం!" అన్నాడు లాల్.

"అలాగే చేద్దాం! మీ రతన్ని షోలాపూర్ తీసుకెళ్ళి, ఆ పనులు చూడండి. నేనా మూర్తినికూడా పట్టుకొస్తాను" అన్నాడు సుధాకర్.

"అలాగే! ఒంటరిగా వెళ్ళకండి. కావాలంటే కొంత మంది పోలీసుల్ని వెంటబెట్టుకొని పొండి!" అన్నాడు లాల్.

"అవసరం లేదు!" అంటూ అంతకుముందు తను కారాపిన ప్రదేశానికి వచ్చాడు. కారు లేదు.

లాల్ గారొచ్చిన కారు తను తీసుకున్నాడు. రెండు పోలీసు జీపుల్లోనూ మిగిలినవాళ్లు సర్దుకున్నారు. వాహనాలన్నీ మెయిన్ రోడ్ వైపు బయలుదేరాయి.

పోలీస్ జీప్ లు షోలాపూరుకు కదిలాయి.

# 10

డిటెక్టివ్ సుధాకర్ కారాపి మళ్ళీ కల్లు అంగడిలోకి నడిచాడు. అంతకుముందు తనతో మాట్లాడిన వ్యక్తి రక్తపు మడుగులో పడివున్నాడు. దగ్గరకెళ్ళి చూశాడు. అతని గుండె భాగంపైన నల్లగా కాలి వుంది. గుండ్రని రంధ్రంకూడా పడివుంది.

తన దగ్గరనుండి తప్పించుకొన్న మూర్తి, అతన్ని గురించి, మెర్క్యూరీ గురించి సమాచారం ఆ కల్లు దుకాణం మనిషే అందించి వుంటాడన్న కోపంతో ఇంత దారుణం చేసివుండా లనిపించింది. మూర్తిపైన ఎక్కడలేని కోపం వచ్చింది సుధాకర్‌కు.

అతను షోలాపూర్ వైపు వెళ్ళివుండ డనిపించింది. బొంబాయి రూటువెంట పోనిచ్చాడు కారు. కనుపించిన ప్రతి కారును ఆపి, తనకు కావలసిన సమాచారంకోసం అందులోనివాళ్ళను ప్రశ్నించి ప్రయత్నించాడు. ఎవ్వరూ ఏమీ చెప్పలేకపోయారు. కనీసం అలాంటి కారును చూచి నట్లుకూడా చెప్పకపోవటం సుధాకర్‌కు ఆశ్చర్యం కలి గించింది.

అంటే మూర్తి ఆ రూటులో పోయివుండడేమో ననిపించింది. కారు వెనక్కి త్రిప్పి షోలాపూర్ వేపు పోనిచ్చాడు.

మెర్క్యూరీని పట్టుకోగలిగినందుకు ఆనందం కలిగినా, మూర్తిని పట్టుకోలేక పోయినందుకు విచారం వేసింది. తాను ఇంకా కొంత జాగ్రత్త పడి వుండాల్సిం దను కొన్నాడు సుధాకర్.

ఆలోచనలు తెగకముందే కారు షోలాపూర్ వూరి మధ్యకు వచ్చేసింది.

జనరల్ హాస్పిటల్‌లో మెర్క్యూరీకి ట్రీట్‌మెంట్ ఇస్తున్నారని తెలుసుకొని కారు అక్కడికే పోనిచ్చాడు డిటెక్టివ్ సుధాకర్.

రెండో అంతస్తులో వున్న స్పెషల్ రూమ్స్‌లో నాలుగో నెంబరుదాంట్లో పెట్టారు మెర్క్యూరీని. వెలుపల పోలీసులు కాపలా కాస్తున్నారు.

లాల్‌గారు కారిడార్‌లో పిట్టగోడ ప్రక్కగా ఫ్రేము కుర్చీ వేసుకొని సిగరెట్ త్రాగుతూ కూర్చున్నాడు.

సుధాకర్ రాగానే "చిక్కాడా?" అడిగాడు లేచి నిల్చుని.

"లేదు! అతను కూడా ఇటే వచ్చివుండా లనిపిస్తుంది. కనుపించిన ప్రతి కారునూ ఆపి వాకబు చేశాను. నల్లరంగు కారును ఎవ్వరూ చూడలేదంటున్నారు" అన్నాడు సుధాకర్.

"దెబ్బ ఎక్కడ తగిలిందో ఏమో, ఇతనికి టెంపరేచర్ బాగా వచ్చింది. రక్తం నోటినుండి కారుతూనే వుందట. మన స్మారకంలో లేడతను. పోలీసులు అజాగ్రత్తగా వుంటారేమోనని నేనూ కాపలా కాస్తున్నాను" అన్నాడు లాల్.

అంతలో ఒక డాక్టరు స్టెతస్కోపు ఊపుకుంటూ వచ్చి, తిన్నగా మెర్క్యూరీ గదిలోకి వెళ్ళిపోయాడు.

"ఇతనేనా మెర్క్యూరీని ట్రీట్ చేస్తున్నది" అడిగాడు సుధాకర్.

"ఒకరని లేనట్లుంది. ఎవరు డ్యూటీలో వుంటే వాళ్లు వచ్చేట్లుంది. ఇంతకుముందొకతను వచ్చాడు. ఇతను రెండోవాడు" అన్నాడు లాల్.

"మూర్తి ఇంకా బైటే వున్నాడు. అతన్ని పట్టుకో

లేకపోవడం, మనకు మెర్క్యూరీని కాపాడుకోనడం పెద్ద సమస్యగా మారుతుంది. క్రొత్తవాళ్ళను ఇటు రానివ్వ కూడదు. పిలైనంతవరకూ, ఒకే డాక్టరు, ఒకే నర్సు, అతన్ని ట్రీట్ చెయ్యడం మంచిది. ఈ విషయంలో తగిన ఏర్పాట్లు చెయ్యమని డి. యం. ఓ. తో నేను మాట్లాడు తాను'' అన్నాడు సుధాకర్.

లాల్ జవాబు చెప్పకుండా మౌనంగా వుండిపోయాడు. సుధాకర్ క్రిందికి వెళ్ళాడు డి. యం. ఓ. ను కలుసు కునేందుకు.

లోపలకు వెళ్ళిన డాక్టరు వెలుపలికొచ్చి ఒక్క క్షణం కారిడార్ లోకి చూసి, బూట్లు చప్పుడు చేసుకుంటూ చకచక వెళ్ళిపోయాడు.

ద్వారబంధానికి రెండు ప్రక్కలా నిలుచునివున్న పోలీ సులు అప్పుడే కునికిపాట్లు పడటం గమనించాడు లాల్. కుర్చీలో లేచి సర్దుకుని కూర్చున్నాడు.

మెర్క్యూరీ చేసిన నేరాలు, దొంగతనాలు, హత్యలు, దోపిడీలు, మొదలైనవాటి వివరాలతో నిండిన ఫైల్సు కళ్ళముందు తిరిగాయి. అతన్ని డిటెక్టివ్ సుధాకర్ సాయంతో పట్టుకోగలిగినందుకు ఎంతో ఆనందంగా వుంది.

కానీ అతనికి అన్ని విషయాల్లోనూ కుడిభుజంగా వుండిన అసిస్టెంటు మూర్తిని పట్టుకోలేక పోయినందుకు అసంతృప్తిగా వుంది.

సుధాకర్ క్రిందనుండి పైకొచ్చాడు. లాల్ గారి కెదురుగావున్న కుర్చీలో కూర్చున్నాడు.

''డి. యం. ఓ. తో మాట్లాడారా?'' అడిగాడు లాల్.

''ఆఁ ఏర్పాట్లు చేస్తానన్నాడు.''

"మూర్తి విషయం ఏం చేద్దాం?" అడిగాడు లాల్.

"అతను, మెర్క్యురీని ఇక్కడనుంచి ఎలాగైనా తప్పించి తీసుకెళ్ళేందుకు పెద్ద పథకం వేస్తాడు. మనం ఒళ్ళంతా కళ్ళు చేసుకుని కాపలా కాయాలి. లేకుంటే పడ్డ శ్రమ అంతా వృధా అవుతుంది. అతన్ని మనం వెతికి పట్టుకోలేం. కానీ వెతుక్కుంటూ ఇక్కడికొచ్చినప్పుడు అప్రమత్తంగా వుండి, పట్టుకోవాలి! అంతకన్నా నాకు మరో మార్గం తోచడం లేదు!" అన్నాడు సుధాకర్.

"కరెక్ట్! మీ ఆలోచనే బాగుంది!" అన్నాడు లాల్.

క్రింద ఏదో కోలాహలం వినిపించింది. నర్సులు, డాక్టర్లు అంతా స్టాఫ్ రూంకేసి పరుగెత్తడం గమనించారు. సుధాకర్ దిగి క్రిందికి వెళ్ళాడు.

స్టాఫ్ రూం వెలుపల జనం గుమిగూడి వున్నారు.

"ఏమయింది?" అడిగాడు అక్కడున్న మనుషుల్లో ఒకర్ని.

"ఎవరో డాక్టరు ఆత్మహత్య చేసుకున్నాడట!" చెప్పాడతను.

"ఎందుకని?"

"తెలీదు!"

సుధాకర్ జనాన్ని త్రోసుకొని లోనికి వెళ్ళాడు. డాక్టర్లు చాలామంది నిలుచుని వున్నారు. వాళ్ళ మధ్య డి. యం. ఓ. గారుకూడా వున్నారు. ఆయన దగ్గరగా వెళ్ళి నిలుచుని అడిగాడు విషయమేమిటని.

"ఇతనెవరో అర్థం కాలేదు. ఇక్కడికొచ్చి ఆత్మహత్య చేసుకొన్నాడు" అన్నాడు కుర్చీలో మెడ వ్రేలాదేసి కూర్చున్న డాక్టరును చూపించి.

"డాక్టరులాగున్నాడు. ఇక్కడి వాడు కాడా?"

"లేదు!" అన్నాడు డి. యం. ఓ.

"ఇందాక పైనున్న ఖైదీని పరీక్ష చేసిపోయిందితనే!" అంటూ, దగ్గరకంటూ వెళ్ళి చూశాడు సుధాకర్. క్రాపు కృత్రిమంగా వుంది. జుట్టు పట్టుకుని లాగాడు. విగ్ ఊడి వచ్చింది చేతిలోకి. కళ్ళకున్న జోడు తీశాడు. మీసాలు లాగేశాడు. కుడిబుగ్గపై నున్న నల్లని పులిపిరిని చేత్తో అదిమాడు. అది కాస్తా రాలి క్రింద పడింది.

ఆ ఆకారం చూసి విస్తుపోయాడు సుధాకర్.

"స్కౌండ్రల్!" అంటూ జనాన్ని తోసుకుని మేడ మీదకు పరుగెత్తాడు.

సిగరెట్ కాలుస్తున్న లాల్ తక్కున లేచి "ఏమైంది?" అడిగాడు.

"సర్వనాశనమయింది" అంటూ గదిలోకి పరుగెత్తాడు. తలమీద దుప్పటి కప్పుకుని పడుకునివున్నాడు మెర్క్యూరీ. దుప్పటి క్రిందనున్న చెయ్యి లాగి పల్స్ చూశాడు. అంద లేదు. చల్లగా వుంది శరీరం.

మెర్క్యూరీ ప్రాణాలు పోయి అప్పటికే ఎంతోసేపు అయివుండదని తెలుసుకోనేందుకు పెద్ద విజ్ఞానం అవసరం లేదనిపించింది సుధాకర్‌కు.

ప్రక్కనే నిల్చున్న లాల్‌తో "ఆ మూర్తిగాడు అనుకున్నంతా చేశాడు. డాక్టరు వేషంలో వచ్చి మెర్క్యూరీని చంపేశాడు. ఎటూ చట్టానికి పట్టుబడక తప్పదని తనూ విషం తీసుకొని చనిపోయాడు" అన్నాడు.

లాల్ రెండు చేతులూ గట్టిగా నలుపుకున్నాడు. డి. యం. ఓ. నిశ్చేష్టుడై నిలుచున్నాడు.

—: ఐపోయింది :—

# హత్యకు ఆహ్వానం!

## అజీజ్

"ఎస్! ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి స్పీకింగ్!"

"నేను! ఆర్ముగాన్ని మాట్లాడుతున్నాను!"

"ఏ ఆర్ముగం?"

"అప్పుడే మరిచావా ఇన్‌స్పెక్టర్? రెండేళ్ళ క్రితం ఓ ఖూనీ కేసులో నన్ను పట్టుకుని, కోర్టులో పదేళ్ళ శిక్ష వేయించావు, ఆ ఆర్ముగాన్ని!"

"ఓ...నీవా! బావున్నావా?" అడిగేను ఓరగా రిస్టు వాచీ చూసుకుంటూ. రాత్రి రెండు గంటలు!

"మీ దయవల్ల ఇంతవరకూ బాగానే ఉన్నాను!"

"నీకు రెండేళ్ళ క్రితం పదేళ్ళ శిక్ష పడింది. అంటే, నీవు జైలునించి తప్పించుకున్నావన్న మాట!"

అవతల ఆర్ముగం నవ్వేడు. "ఔను! ఎన్నాళ్ళనించో తప్పించుకోడానికి వేస్తున్న ప్లాను ఈ నాటికి ఫలించింది. నేను తప్పించుకున్నట్టు నీకు తప్ప మరో ప్రాణికి తెలీదు. జైలునించి బైట పడగానే సరాసరి నీకు ఫోన్ చేస్తున్నాను. దేనికో తెలుసా?"

"దేనికి?"

"నిన్ను కుక్కని చంపినట్టు చంపడానికి!"

నవ్వేను. "అలాగా! అదంత సులువైనపని అనుకుంటే, అలాగే చంపెయ్!"

"నవ్వులాటకాదు ఇన్‌స్పెక్టర్! ఇది నిజం. నిన్నీరాత్రి చంపందే నేను నిదరపోను. ఈ రెండేళ్ళు నీవల్ల నేను పడ్డ కష్టాలకి బదులు, వడ్డీతో సహా వసూలు జేస్తాను. అలా ఇలా కాదు. నిన్ను చరిత్రాత్మకంగా చంపుతాను. చంపబోయేముందు నీకిలా తెలిజెయ్యడంలోనే, నా వీరత్వం బైటపడుతోంది. ఏ వీరుడు తన శత్రువు మీద వెనకనించి దెబ్బ తియ్యడు. నీలో ఏ మాత్రం చీమూ, నెత్తురూ ఉన్నా, అరగంటలోగా కాంథోం బీచి దగ్గిరున్న మామిడి తోటలోకి రా!

అక్కడ డ్యూయల్ ఆడదాం! అందులో నీవు నన్ను చంపగలవో, నేను నిన్ను చంపగలనో తేలిపోతుంది. అక్కడ నన్ను తప్ప నాకు తోడుగా ఇంకెవ్వరూ ఉండరని ప్రమాణం జేస్తున్నాను. అలాగే నీవూ మూడో వ్యక్తికి తెలీకుండా, పోలీసులను వెంట బెట్టుకురానని ప్రామిస్ జెయ్యాలి. నీకు మరో హామీ ఇస్తున్నాను. పార్కులో మొదటి ఫైర్ నీ పిస్టల్‌నించే జరగనివ్వు. ఏమంటావ్?"

వాడి ధైర్యానికి నివ్వెరబోయేను. వాడంత ధైర్యంగా నన్ను పిస్తోలు యుద్ధానికి ఆహ్వానిస్తోంటే కాదనడం నా అహాన్ని చంపుకు తిన్నట్టే అవుతుంది.

క్షణం ఆలోచించి అన్నాను. "ఆల్ రైట్! నీ దగ్గర పిస్తోలు ఉందా? లేక వచ్చేటప్పుడు వెంట తెమ్మంటావా?"

"అవసరం లేదు. నా దగ్గర జర్మన్ మోడల్ ఆటోమేటిక్ రివాల్వర్ రెడీగా వుంది. అందులో నిండి వున్న ఆరు గుళ్ళూ నీ గుండెల్లో దిగడానికి తహతహలాడుతున్నాయి. జైలోంచి పారిపోగానే, ఓ రహస్య ప్రదేశంలో అవసరానికి పాతి ఉంచిన దీన్ని తెచ్చుకున్నాను. నీతోబాటు నా శత్రువుల్ని మరో ఐదుగుర్ని వైకుంఠం పంపే వరకూ దానికి విశ్రాంతి ఇవ్వను!" అన్నాడు ఆర్ముగం.

చిన్నగా నవ్వి- "ఆల్ రైట్ మిస్టర్ ఆర్ముగం! నీ ఆయువు మూడినప్పుడు ఎవరేం జేస్తారు? అరగంటలో అక్కడుంటాను. కాచుకో!" అంటూ రిసీవర్ క్రెడిల్ జేసి వెనుదిరిగేను.

గబగబ వేసుకున్న స్లీపింగ్ గౌన్ విడిచి, సూట్ తొడుక్కున్నాను. కాళ్ళకి చప్పుడుకాని షూస్ వేసుకున్నాను. గోద్రెజ్ బీరువా తెరిచి, పౌచ్ లో ఉన్న పిస్తోలు తీసేను. విరిచి చూసేను. నిండుగా ఉన్నాయి గుళ్ళు. దేనికైనా మంచిది స్పేర్ గా మరో పదిగుళ్ళు కోటు జేబులో వేసుకుని, చకచకా ఇంట్లోంచి బైటికి నడిచేను. తలుపు మూసి లాక్ జేసి పోర్టికోలో రెడీగా ఉన్న ఫియట్ కారెక్కి బైలుదేరాను.

# 2

అదే, మామిడి తోట!

చుట్టుపక్కలంతా నిర్మానుష్యం! ఎముకలు కొరికే చలి. వీధి స్తంభాలు ఒంటరిగా నిల్చుని కునికిపాట్లు పడుతున్నట్టు వెలుగుతున్నాయి.

ఓ టెలిఫోన్ పోల్ కింద కారాపేను. తోటచుట్టూ చిన్న సైజు పిట్టగోడ కట్టేరు. గేటు మూసిఉంది. అర్ముగం అప్పటికే తోటలో ప్రవేశించి, నాకోసం కాచుకునుంటాడు. కారు శబ్దం విని నేను వచ్చినట్టు ఈ పాటికి పసిగట్టి ఉంటాడు.

హెడ్ లైట్స్ ఆర్పి కారు దిగేను. డోర్స్ లాక్ జేసి చూట్టూ చూసేను. పక్క దిక్కు లేదు. అడుగులో అడుగు వేసుకుంటూ పిట్టగోడవైపు నడిచేను. ఆ గోడ దూకి తోటలో ప్రవేశించడం ఏమంత కష్టం కాదు. కన్ను మూసి తెరిచేలోగా ఎగిరి లోనికి దూకాను. ముందే భారీ మనిషిని. పిడుగు పడ్డట్టు అదిరింది భూమి. బూట్సు కింద పడి ఎండు పుల్లలు ఫెళ ఫెళమన్నాయి. నిమిషం అలాగే కూర్చుని చెవులు రిక్కించేను. చుట్టుపక్క లెక్కడా అలికిడి కాకపోడంతో మెల్లిగా లేచి నిల్చున్నాను.

అది చాలా పెద్దతోట. చెట్లన్నీ దగ్గరదగ్గరగా ఉంటం వల్ల చీకట్లో మరీ చీకటిగా కన్పిస్తోంది. మామిడి పిందెల కాలంలో తప్ప ఆ తోటలో మనిషి మాత్రుడు ఉండడు. చెట్ల ఆకుల మధ్య కూర్చుని అరుస్తున్నాయి కీటకాలు.

ఆ చలిలో నా చేతివేళ్ళు కొంకర్లు తిరుగుతున్నట్టు తోస్తోంది. జేబులోని నల్లని ఉలెన్ గ్లవుస్ తీసేను. అవి తొడుక్కోకుంటే, చలికి వేళ్ళు మొద్దుబారి నా గురి తప్పే ప్రమాదముంది. చకచకా వాటిని తొడుక్కుని,

పాంటు జేబులోంచి పిస్తోలు బైటికి తీసేను. చూపుడు వేలు ట్రిగ్గర్ మీద రెడీగా పెట్టుకుని, అడుగులో అడుగు వేసుకుంటూ ముందుకి నడిచేను.

నా సర్వీసులో ఇంతవరకూ ఎన్నో చిత్ర విచిత్రమైన సంఘటనల్ని ఎదుర్కొన్నాను. మరేన్నో గుండెలు జలదరించే కేసుల్లో పనిజేసేను. అనేక సార్లు మృత్యువుని వెంట్రుక వాసిలో తప్పించుకున్నాను. కానీ, ఇది జీవితంలో అత్యంత చిత్రమైన ఘటన. నేను వెళ్ళేది మృత్యుగహ్వారంలోకి. ఊహించలేని థ్రిల్‌తో మనసు కొట్టుకుంటోంది.

కాళ్ళ క్రింద ఎండుటాకుల సవ్వడి కానివ్వకుండా జాగ్రత్తగా అడుగు తీసి అడుగు వేస్తున్నాను. కొద్దిదూరం నడిచేనో లేదో, పది గజాల దూరాన, చీకట్లో పకపక నవ్వు వినిపించింది. ఆగిపోయేను! చెవులు రిక్కరించుకున్నాను.

"శెభాష్ ఇన్‌స్పెక్టర్! నీవు వస్తావని నాకు తెలుసు. కారణం. నీవు మగాడివి, గుండెలున్న మగాడివి. ఒప్పందం ప్రకారం మొదటి ఫైర్ నీవే చెయ్! ఊఁ, ఆలస్యం చెయ్యకు!" అర్ధగం కంఠం మారుమోగింది చీకట్లో.

వాడి ధైర్యాన్నీ, నిజాయితీనీ మెచ్చుకోకుండా ఉండలేకపోయేను. సాధారణంగా అటువంటి పచ్చి రౌడీలు మాటకు కట్టుబడి వుంటారు. తన ఉనికి నాకు తెలీకముందే నన్ను చీకట్లో కాల్చిపారేసే అవకాశం ఉన్నా, వాడలా చెయ్యలేదు.

చిన్నగా నవ్వి అన్నాను–"ఇంతవరకూ నా గురి తప్పడం జరగలేదు. నేను పిస్తోలు పేల్చిన మరుక్షణంలో నీవు వైకుంఠంలో ఉంటావ్! అప్పుడు నన్ను చంపాలన్న

నీ కోరిక కోరికగానే మిగిలిపోతుంది. కనుక, నీవే ముందు కాల్చు!"

"నో, నో, ఇన్స్పెక్టర్! నా మాటంటే మాటే, దాన్ని మళ్ళీ వెనక్కి తీసుకోవడం కల్ల! ముందు నీవే కాల్చు!"

అంతే! గురిపెట్టి ట్రిగ్గర్ వత్తేను.

"ఢాం!" దిక్కులు పిక్కటిల్లేయి.

గావు కేక!

నా గురి తప్పలేదన్నమాట. ఆ చెట్టువేపు ఉరికేను. మసక వెలుగులో చుట్టూ చూసేను. ఖాళీ! అక్కడ ఎవ్వరూ లేరు. టార్చి తీసుకు రానందుకు నా మీద నాకే కోపం వచ్చింది. నా పిస్తోలు గుండు తగిలి ఆర్కుగం అక్కడే కూలిపోయాడనుకున్న నా అంచనా తారు మారైంది. వెనుదిరగబోయేను.

సరిగ్గా అదే సమయంలో, "ఢాం!" అన్న చప్పుడు.

నా భుజాన్ని చీల్చుకుంటూ దూసుకుపోయింది గుండు.

"మై... గాడ్!" అంటూ భుజంపట్టుకుని చెట్టు బోదెకి ఆనుకున్నాను.

మంట! ఎర్రగా కాల్చిన కమ్మీతో వాత పెట్టినట్టు భరించలేని మంట.

దూరంగా సరసర ఆకుల చప్పుడు.

గురిపెట్టి కాల్చేను.

"ఓహ్!" అరుపు.

మరోసారి కాల్చేను. "ఢాం!" చెవులు చిల్లులు పడే చప్పుడు.

నిశ్శబ్దం!

"ఇన్‌స్పెక్టర్ విధి విచిత్రమైంది. మొత్తానికి ఈ డ్యూయల్ ఆటలో దాదాపు నీవే గెలిచావ్! నేను చెప్పటానికి లేనంత దయనీయంగా, గాయపడ్డాను. నీవు పేల్చిన గుండు తగిలి నా పిస్తోలు కూడా ఎగిరి చీకట్లో ఎక్కడో పడిపోయింది. నీకింకా ఆయుషు ఉంది. నేను వెళ్ళిపోతాను. మళ్ళీ త్వరలో నీ ముందుకు వచ్చి నిన్ను ఛాలెంజ్ జేస్తాను. ఇంత గాయపడ్డా, నా మాట ప్రకారం నా మిగతా నలుగురు శత్రువుల్లో ఎవరో ఒకర్ని ఈ రాత్రి చంపి తీరుతాను పిస్తోలు పోయినా, పదునైన స్ప్రింగ్ నైఫ్ నా జేబులో రెడీగా ఉంది. వస్తా..." నాకు చాలా దూరంలో పెద్దగా వినిపించాయి మాటలు.

నా రక్తం పొంగి పొర్లింది. వాణ్ణి ఎట్టి పరిసితుల్లోనూ ఇక్కణ్ణించి పారిపోనివ్వకూడదు. పట్టుకోవాలి. మళ్ళీ కటకటాల వెనక్కి పంపించాలి, జైలునించి పారిపోయి నందుకు అదనంగా మరికొన్నాళ్ళు శిక్ష విధిస్తారు.

పళ్ళు బిగబట్టి బాధని ఓర్చుకుంటూ పావుగంట పిచ్చి వాడిలా తోటంతా తిరిగేను. అర్ధ్మగం ఐపులేదు.

అంత చీకట్లో ఏమాత్రం సవ్వడి కానివ్వకుండా ఎలా పారిపోయేడు? చెప్పలేని నిస్పృహతో గేటువేపు అడుగులు వేసేను. మెల్లిగా గేటు కొక్కెం తీసి తోటలోంచి బైటపడి, కారు వేపు నడిచేను.

కారు నిల్చున్న తీరు చూస్తే ఏదో అనుమానం వేసింది. వంగి లెఫ్ట్ ఫ్రంట్ వీల్‌ని పరీక్షగా చూసేను. అనుమానమే నిజమైంది.

దాంట్లోంచి గాలి తీసెయ్యబడింది! నవ్వుకున్నాను. పోతూ పోతూ తనని నేను వెంబడించకుండా, జాగ్రత్త కోసం గాలి తీసిపోయేడు అర్ధ్మగం.

టాక్సీలో తప్ప ఇహ ఇల్లుచేరే మార్గం లేదు. టైం చూసుకున్నాను. రాత్రి మూడు గంటలు! అక్కడికి ఫర్లాంగు దూరంలో ఉన్న శాంత్ మహల్ టాకీస్ టర్నింగ్ లో ఓ టాక్సీ స్టాండ్ ఉంది. గబగబ నడవ సాగేను. టాకీస్ టర్నింగ్ తిరిగే సరికి కన్పించింది టాక్సీ స్టాండ్.

రెండు మూడు టాక్సీలు ఆగి ఉన్నాయి. ఐదు నిమిషాలు అరిచి గీపెట్టితే ఓ డ్రైవర్ లేచేడు. నిద్రమత్తులో నా అవతారాన్ని అట్టే గమనించలేదు.

బాక్ సీట్లోకి దూరి, "వినాయకన్ స్ట్రీట్ పోనివ్!" అన్నాను.

టాక్సీ కదిలింది!

రెండేళ్ళ క్రితం పార్వతప్ప అనే ఓ లక్షాధికారిని అతని ఇంట్లోనే పిస్తోలుతో కాల్చి చంపేడు ఆర్ముగం! పార్వతప్పకి మద్రాసులో బిజినెస్ మాగ్నెట్ గా మంచి పరపతి వుండేది. అతను తమిళుడు కాదు. మైసూర్ నించి మద్రాసు వచ్చి సెటిలయ్యేడు. అతను చెయ్యని వ్యాపారమంటూ లేదు. రకరకాల పద్ధతులద్వారా, ఫారిన్ నించి స్మగ్లింగ్ గూడ్స్ తెప్పించి, మద్రాసు మార్కెట్ లో రహస్యంగా డిస్ట్రిబ్యూట్ జేసేవాడు. అతని కనుసైగలో పెద్ద స్మగ్లింగ్ గ్యాంగ్ పనిజేస్తుండేది.

ఆ గ్యాంగ్ లోని సభ్యుల్లో ఆర్ముగం ఒకడు. పార్వతప్పకి ఆర్ముగంమీద ఓ ప్రత్యేకమైన అభిమానం వుండేది. కస్టమ్స్ ఉద్యోగులనించీ, అనేక పోలీస్ ఆఫీసర్లని సైతం గుప్పిట్లో వుంచుకునేవాడు పార్వతప్ప. అటువంటి పాపులర్ వ్యక్తిని ఎవ్వరూ ఊహించని విధంగా కాల్చి చంపేడు ఆర్ముగం! అరెస్టయ్యేక పార్వతప్పని తనే

చంపేసనని ఒప్పుకున్నాడు గానీ, హత్యకి కారణం ఏమిటో ఎంత ప్రయత్నించినా చెప్పలేదు.

ఆర్ముగానికి పంకజం అనే ఓ చెల్లెలు వుండేది. హాస్టల్లో వుండి, కన్యా ఆర్ట్స్ కాలేజ్‌లో చదువుకునేది. ఆర్ముగానికి శిక్షపడి జైలుకెళ్ళాక ఆమె ఎక్కడికెళ్ళిందో, ఏమైపోయిందో ఎవ్వరికీ తెలీదు.

పార్వతప్పకి ఇద్దరు కొడుకులుండేవారు. అందులో కరియప్ప అనే పెద్దకొడుకు సన్యాసం స్వీకరించి దేశాల వెంట తిరుగుతున్నాడు. రెండో కొడుకు బసవప్ప, తండ్రి మార్గాన్నే స్వీకరించి, నిరాఘాటంగా స్మగ్లింగ్ బిజినెస్ నడుపుతున్నాడు.

సడన్ బ్రేక్‌తో ఆలోచనలు చెదిరిపోయేయి. వీధి మలుపులో ఆపేడు డ్రైవర్. దిగి మీటర్ బిల్ పే జేసి గబగబ ఇంటివేపు నడిచేను. లాక్ తీసి ఇంట్లో అడుగు పెట్టేను. తలుపు మూసి గడియ బిగించి, గబగబ బట్టలు విప్పేను.

బీరువాలోంచి ఫస్ట్ ఎయిడ్ బాక్స్ తీసి, దూదితో శుభ్రంగా గాయాన్ని కడిగేను. అదృష్టం బావుండి గుండు భుజంలో తిష్టవెయ్యలేదు. లేకుంటే ఆపరేషన్ జేసి తియ్యవలసి వచ్చేది. సెప్టిక్ కాకుండా, గాయంమీద బెంజాయిన్ పులిమి బాండేజీతో కట్టు కట్టుకున్నాను. మందు ప్రభావంతో చిమచిమలాడుతోంది గాయం.

స్లీపింగ్ గౌన్ తొడుక్కుని, బల్లమీది ఫోన్ వేపు నడిచేను. వెంటనే సెంట్రల్ జైల్‌కి ఫోన్ జేసి ఆర్ముగం తప్పించుకున్న విషయం చెప్పాలి.

నెంబర్ రింగ్ జేసి రిసీవర్ అందుకున్నాను.

"ఎస్! జైలర్ షణ్ముగం స్పీకింగ్!" అవతలినించి వినిపించింది.

"నేను క్రయిం బ్రాంచి ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి మాట్లాడుతున్నాను!"

"గుడీవినింగ్ సార్! ఏమిటి విశేషం?"

"కొన్నిగంటల క్రితం మీ జైలునించి ఆర్ముగం అనే ఖైదీ పారిపోయేడు!"

అవతల జైలర్ నవ్వు వినిపించింది. "సారీ సార్! మీరేదో కన్‌ఫ్యూజింగ్‌లో ఉన్నట్టున్నారు. ఇప్పుడే ఐదునిమిషాల క్రితం నేను సెల్సన్నీ రౌండ్ జేసి వచ్చేను. ఖైదీ ఆర్ముగం తన సెల్లో శుభ్రంగా నిదరబోతున్నాడు!"

నిర్ఘాంతబోయేను! అప్రయత్నంగా రిసీవర్ని క్రెడిల్ మీదుంచేను. ఏమిటీ మాయ? ఖైదీ ఆర్ముగం జైల్లో నిదర బోతుంటే, నన్ను తోటలోకి ఆహ్వానించి నాతో డ్యూయల్ ఆడిన వ్యక్తి ఎవ్వరు? ఆర్ముగం పేరుతో నన్ను దేనికి ఫూల్‌ని జేసేడు?

నా ఆలోచన ఇంకా తెగక ముందే, ఫోన్ గణగణ మోగింది.

రిసీవర్ అందుకుని, "ఎస్! రాజారెడ్డి స్పీకింగ్!" అన్నాను.

"నేను! ఆర్ముగాన్ని మాట్లాడుతున్నాను!"

నా రక్తం వేగాన్ని పుంజుకుంది. "మిస్టర్! నీవు ఆర్ముగానివి కాదు. నేనిప్పుడే సెంట్రల్ జైల్‌కి ఫోన్ జేసి కనుక్కున్నాను. ఖైదీ ఆర్ముగం తన సెల్లో హాయిగా నిదరబోతున్నాడు. నన్ను ఫూల్‌ని జెయ్యడానికి ప్రయత్నించకు!"

అవతలివేపు పెద్దగా నవ్వేడతను. "కరెక్ట్ ఇన్‌స్పెక్టర్! జైలర్ మీతో చెప్పింది సగం కరెక్ట్! కానీ, ఆ సెల్లో కంబళీ కప్పుకు పడుకుంది నేను కాదు. ఆ జైలు వార్డర్! అతన్ని చూసి, నేనని పొరబడుంటాడు జైలర్!

జరిగిందేమిటో చెబుతా వినండి. రాత్రి సరిగ్గా ఒంటి గంటకి, నా సెల్ ముందునించి ఓ డ్యూటీ వార్డర్ పోతున్నాడు. అతని రాకకోసమే కటకటాల తలుపుదగ్గిర కాచుకున్న నేను, పొట్ట పట్టుకుని మూలగసాగేను. అతను దగ్గరికి వచ్చి ఏం జరిగిందని అడుగుతున్నాడు. అంతే, చిరుతలా అతని గొంతు పట్టుకుని ఊచల దగ్గరికి లాక్కున్నాను. కన్ను మూసి తెరిచేలోగా ఎడంచేతి అంచుతో అతని మెడమీద ఒక్కటి ఇచ్చేను. కిక్కురుమనకుండా మెడ వాల్చేసేడు.

అతని జేబులోంచి సెల్ కీ తీసి, కటకటాలకి వేళాడే తాళం తెరిచేను. అతన్ని సెల్లోకి లాగి, నా బట్టలు అతనికి తొడిగి, అతని యూనిఫాం నేను వేసుకున్నాను. నిదరబోతున్నట్టు అతనిమీద కంబళీ కప్పి, సెల్లోంచి బైటపడ్డాను. యథాప్రకారం తలుపుకి తాళం వేసి, అత్యంత జాగ్రత్తగా జైల్లోంచి ఇవతల పడ్డాను.

ఇంతకీ, ఇప్పు డెక్కణ్ణించి మాట్లాడుతున్నానో తెలుసా ఇన్‌స్పెక్టర్! ఓ ప్రైవేట్ డాక్టర్ ఇంటినించి, నీవు పేల్చిన గుళ్ళు నా రెండు చేతుల్లోనూ దిగబడ్డాయి. తోటలో నిన్ను పల్టీ కొట్టించి, అక్కణ్ణించి సరాసరి ఈ డాక్టర్ ఇంటికి వచ్చేను. నా పరిస్థితి చెప్పి, గుళ్ళు తియ్యమన్నాను. మొదట ఒప్పుకోలేదు. స్ప్రింగ్ నైఫ్ తీసి బెదిరించి ఒప్పించేను. ఆపరేషన్ జేసి, రెండు గుళ్ళూ బైటికి తీసేడు. కట్టు కట్టేడు. నా అయామ్ క్వైట్ ఇన్

స్పెక్టర్! అంటిల్ ఎనీ టైమ్ ఐ విల్ మీట్ యూ!” అవతల క్లిక్‌మంది.

వాడి ధైర్యం నన్ను దిగ్భ్రాంతుణ్ణి జేస్తోంది!

గబగబ ఓ నెంబర్ రింగ్ జేసి—“హలో, సెంట్రల్ జైల్!” అన్నాను.

“యస్! షణ్ముగం స్పీకింగ్!”

“నేను, ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి మాట్లాడుతున్నాను!”

“మీరు చెప్పింది రైటే సార్! మీ ఫోన్ వచ్చేక దేనికైనా మంచిదని ఓసారి ఆర్ముగం సెల్ వేపు వెళ్ళి చూసేను. లోపల పడుంది ఆర్ముగం కాదు. మా వార్డర్! వాడు తప్పించుకున్నట్టు మీకెలా తెలిసింది సార్?” షణ్ముగం కంఠం వణుకుతోంది.

ఔను మరి. అతని డ్యూటీలో పారిపోయేడు ఆర్ముగం. రేపుదయం లోగా అతన్ని సస్పెండ్ జేస్తారు. జరిగిందంతా పూసగుచ్చినట్టు చెప్పేను షణ్ముగంకు.

రిసీవర్ క్రెడిల్ జేసేను.

సరిగ్గా అదే సమయంలో తలుపు తట్టిన చప్పుడు.

నా కనుబొమలు ముడివడ్డాయి. “ఎవ్వరు?” అన్నాను.

“దయచేసి కాస్త తలుపు తెరవండి!” అది ఓ స్త్రీ కంఠం.

ఇంత రాత్రివేళ నా ఇంటికి ఓ ఆడది రావడమా? ఆశ్చర్యంతో తల మున్కలవుతూ తలుపువేపు నడిచేను. జాగ్రత్తకోసం తలుపుకడ్డంగా నిల్చుని, గడియ లాగి, ఓరగా తలుపు తెరిచి చూసేను. గుమ్మాని కవతల చీకట్లో చీరలో ఓ స్త్రీ ఆకారం కనిపించడంతో తలుపు పూర్తిగా తెరిచేను.

ఆమె ఎవ్వరో కాదు. ఆర్ముగం చెల్లెలు! పంకజం!!

ఇన్నాళ్ళూ ఏమైపోయింది? ఎక్కడుంది? ఊహించని విధంగా ఇక్కడెలా ప్రత్యక్షమైంది?

ఒకే ఒక్క క్షణంలో ఇన్ని తేలుకొండీలు మెదిలేయి నా బుర్రలో.

"లోనికి రావచ్చా ఇన్ స్పెక్టర్ గారూ?" అడిగింది.

తలూపి, తలుపు కడ్డం తొలిగేను. లోన అడుగుపెట్టింది పంకజం.

పాతికేళ్ళుంటాయి. మిడిల్ హైట్. ఎముక కనిపించని నిండైన ఒళ్ళు. గుండ్రని భుజాలు. రౌండ్ ఫేస్. కొందరాడవాళ్ళని చూస్తే చేతులెత్తి దండం పెట్టాలనిపిస్తుంది. మనకి తెలీకుండానే వారిపట్ల ఓ రెస్పెక్టిబుల్ ఫీలింగ్ వస్తుంది. కొందర్ని చూస్తే ముసలివాళ్ళకైనా సరే నరాలు వేడెక్కుతాయి. ఓరగా చూసి కన్ను గీటాలనిపిస్తుంది. పంకజాన్ని చూస్తే సరిగ్గా అదే భావం కలుగుతుంది.

"అలా కూర్చో!" అన్నాను గదిమధ్య సోఫా చూపిస్తూ.

వెళ్ళి సోఫాలో కూర్చుంది. కాస్త ఛాతీ విరిచి నడుస్తుంది. అడుగులు వేస్తే లయబద్ధంగా కదులుతాయి పిరుదులు.

తలుపు మూసి వెళ్ళి సోఫాలో కూర్చున్నాను.

"ఇంత రాత్రివేళ, ఇలా హఠాత్తుగా మీ ఇంటికి వచ్చినందుకు ఆశ్చర్యపడుతున్నారు కదూ ఇన్ స్పెక్టర్? నేను మీతో ముఖ్యమైన సమాచారం అందజెయ్యడానికి వచ్చేను!"

"ఏమిటి?" నా కంఠంలో క్యూరియాసిటీ ధ్వనించింది.

"మా అన్నయ్య జైలునించి పారిపోయేడు!"

ఆశ్చర్యం నటించేను.

"అంతే కాదు, ఈ రాత్రి ముగ్గుర్ని హత్య జెయ్యబోతున్నాడు!"

"ఎవ్వర్ని?"

"హోటల్ అపోలో ప్రొప్రైటర్ హరీంద్రనీ, సేట్ పార్వతప్ప కొడుకులు బసవప్పనీ, కరియప్పనీ చంపబోతున్నాడు!"

"నీ కెలా తెలిసింది?"

"గంట క్రితం అన్నయ్యా స్వయంగా వచ్చి నాకు చెప్పేడు!"

"ఇంతకీ, రెండేళ్ళ క్రితం మీ అన్నయ్యా సేట్ పార్వతప్పని హత్యజేసి జైలుకెళ్ళేక నీవు ఏమైపోయావ్? ఇన్నాళ్ళూ ఎక్కడున్నావ్?" అడిగేను ఆశ్చర్యంగా.

పంకజం వెంటనే పలకలేదు. క్షణం ఆలోచించి, ఏమనుకుందో ఏమో తలెత్తి అంది—"సేట్ పార్వతప్పని అన్నయ్యా దేనికి చంపేడో తెలుసా ఇన్‌స్పెక్టర్?"

"తెలీదు! తెలుసుకోడానికి ఎంత ప్రయత్నించినా, అతను గం చెప్పలేదు. పార్వతప్ప జేసే స్మగ్లింగ్ వ్యాపారంలో అతనూ పనిజేసేవాడు కదా, ఇద్దరి మధ్యా ఏవో లావాదేవీలు వచ్చి చంపివుంటాడనుకున్నాం. అలాగే కేసు బనాయించాం. దానికి మీ అన్న ఏమీ అభ్యంతరం చెప్పలేదు!"

పేలవంగా నవ్వింది పంకజం—"ఆ హత్య కేవలం నా గురించే జరిగింది ఇన్‌స్పెక్టర్!"

"వాట్?" నివ్వెరబోయేను.

భారంగా నిట్టూర్చి చెప్పసాగింది పంకజం: "రెండేళ్ల క్రితం నేను చదివే కన్యాఆర్ట్స్ కాలేజ్‌కి సేట్ పార్వతప్ప

ఫైనాన్షియల్ కన్వీనర్ గా ఉండేవాడు. నేను హాస్టల్లో ఉండి చదువుకునేదాన్ని. ఒకరోజు రాత్రి హాస్టల్ కి సేఠ్ పార్వతప్ప ఇంటినించి ఫోన్ వచ్చింది. మా అన్నయ్య తన ఇంట్లో ఉన్నాడనీ, నాతో ఏదో అర్జెంటుగా మాట్లాడా లంటున్నాడనీ, వెంటనే బైలుదేరి రమ్మని ఫోన్ జేసేడు పార్వతప్ప. ఉన్నపళంగా బైలుదేరి వెళ్లేను.

అంతకిముందు అనేకసార్లు అతనింటికి వెళ్ళేను. ఆ ఇంటి ఆడవాళ్ళతో కూడా నాకు పరిచయం వుంది. ఇంటి కెళ్ళగానే నన్ను మేడమీదికి వెళ్ళమన్నాడు నౌఖరు. మేడమీది గదిలో పార్వతప్ప తప్పితే ఇంకెవ్వరూ లేరు. నేను మోసపోయేనని గ్రహించేలోగా గది తలుపులు మూసుకున్నాయి. ఆ సమయంలో ఇంట్లో ఆడవాళ్లుకూడా లేరు. ఏ సినిమాకో వెళ్ళుంటారు. అటువంటి నిస్సహాయ పరిస్థితిలో నామీద పడి క్రూరంగా చెరిచేడు పార్వతప్ప.

ఇంటికెళ్ళి ఏడుస్తూ జరిగింది చెప్పేను అన్నయ్యకి. ముందే ముక్కోపి! ఆ సంగతి వినగానే అతని రక్తం పొంగిపొర్లింది. ఆన్ ది స్పాట్ వెళ్ళి పార్వతప్పని పిస్తోలుతో కుక్కని కాల్చినట్టు కాల్చి పారేసేడు. నా పరువు కాపాడటానికి ఆ హత్య ఎందుకు జేసేడో చెప్పలేదు ఖూకు. ఆ రహస్యం మా ఇద్దరి మధ్యే ఉండిపోయింది.

పార్వతప్పనే కాదు, వాడి కుటుంబాన్నంతా తుడిచి పెడతానని శపథంజేశాడు అన్నయ్య. అతని శపథం పూర్తికాక ముందే అరెస్టయ్యేడు. అతను జైలుకెళ్ళగానే, నేను హైదరాబాద్ లో ఓ స్నేహితురాలిదగ్గర కొన్నాళ్ళుండి, సంవత్సరం క్రితం మళ్ళీ ఇక్కడికి వచ్చేను. ఓ ప్రైవేట్ కంపెనీలో స్టెనోగ్రాఫర్ గా జేరి, మద్రాసు మారుమూల ఓ అద్దె యింట్లో ఉంటూ అజ్ఞాతజీవితం

గడుపుతున్నాను. జైల్లో వున్న అన్నయ్యాకి అడపాదడపా ఉత్తరాలు రాస్తూ వేవున్నాను. అక్కణ్ణించి అతనూ నాకు ఉత్తరాలు రాసేవాడు... ఈ రోజు ఉన్నట్టుండి హఠాత్తుగా జైలునించి పారిపోయి వచ్చేడు!''

''పార్వతప్ప కొడుకులు బసవప్పనీ, కరియప్పనీ చంపుతానన్నాడంటే, పాత పగ అనుకోవచ్చు. కానీ, హోటల్ అపోలో ప్రొప్రైటర్ హరీంద్రని దేనికి చంపుతానన్నాడు?'' అడిగేను ఆశ్చర్యంగా.

క్షణం ఆగి అంది పంకజం. ''హరీంద్ర నాకు తీరని ద్రోహం జేసేడు ఇన్‌స్పెక్టర్! నమ్మించి మోసం జేసేడు. అన్నయ్యాకీ, అతనికీ మొదటినించీ బిజినెస్‌లో మంచి స్నేహం వుండేదిట. జైలుకెళ్ళగానే అన్నయ్య నాకు ఉత్తరం రాసేడు. తన డబ్బు ఐదువేలరూపాయలు హరీంద్ర దగ్గిర ఉన్నాయనీ, డబ్బుకోసం ఎటువంటి బెంగ పెట్టుకోవద్దనీ, హరీంద్రని కలుసుకుని డబ్బు తీసుకోమనీ రాసేడు. అప్పుడు కలుసుకున్నాను హరీంద్రని. అతన్ని మొదటిసారి చూడగానే ఒకరకం అభిమానం ఏర్పడింది నాలో. అడపా దడపా కలుసుకునేదాన్ని. అనుకోకుండా ఇద్దరం చేరువైపోయాం. నన్ను పెళ్ళి జేసుకుంటానని ప్రమాణం జేసేడు హరీంద్ర. నిజమే అనుకున్నాను. ప్రలోభంలో పడిపోయేను. ఫలితంగా నాకు నెల తప్పింది. అతని ప్రతిరూపం నాలో నిలిచిపోయింది.

వారం క్రితం అతన్ని కలుసుకుని, ఆ సంగతి చెప్పి, వెంటనే పెళ్ళిప్రయత్నాలు చెయ్యమన్నాను. నా వంటి చరిత్ర హీనురాలిని ఎలా చేసుకుంటా ననుకున్నావని నవ్వేడు! నా కాళ్ళకింది నేల పగిలిపోయినట్టు తోచింది. ఆ సంగతి వివరంగా తెలీజేస్తూ అన్నయ్యాకి ఉత్తరం

రాసేను. ఫలితంగా హరీంద్రమీద పగ తీర్చుకోడానికి జైలునించి తప్పించుకున్నాడు.

ఇన్‌స్పెక్టర్ గారూ! పార్వతప్పని చంపినందుకే అన్నయ్యకి పదేళ్ళు శిక్ష పడింది. పదేళ్ళ తరవాత మళ్ళీ స్వేచ్ఛాజీవి అవుతాడనే గ్యారంటీ వుంది. కాని, ఇలా జైలునించి తప్పించుకుని, మూడు హత్యలు చేస్తే అతనికి మరణశిక్ష తప్పదు. ఆ దయనీయ పరిస్థితి రాకముందే ఆ అఘాయిత్యం చెయ్యకుండా అతన్ని ఆపడం మంచిది కదూ? ఎవ్వర్ని చంపినా, ఎందర్ని చంపినా, పోయిన నా శీలం తిరిగివస్తుందా? నాకీ లోకంలో అన్నయ్య తప్పితే ఇంకెవ్వరున్నారు?" అంటూ వెక్కి వెక్కి ఏడవసాగింది పంకజం.

"ఏడవక! ఇటువంటి పరిస్థితిలోనే మనసు రాయి చేసుకోవాలి. నా శాయశక్తులా ప్రయత్నించి, అర్కుగం చేతిలో ఆ హత్యలు జరక్కుండా ఆపుతాను!" అంటూ లేచి ఫోన్ వేపు నడిచేను.

క్రయిం బ్రాంచి హెడ్ క్వార్టర్స్‌కి రింగ్ చేసి రిసీవర్ అందుకున్నాను.

"ఎస్! సార్జంట్ డేవిడ్ స్పీకింగ్!" అవతలినించి వినిపించింది.

"నేను! ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి మాట్లాడుతున్నాను!"

"చెప్పండి సార్!"

"తక్షణం బైలుదేరి నన్ను కలుసుకో! ఇంట్లో వున్నాను."

"ఓ. కే. సర్!" అవతల క్లిక్‌మంది.

రిసీవర్ దించి వెనుదిరిగేను.

"ఇక నన్ను వెళ్ళమంటారా?" అడిగింది పంకజం.

తలూపేను. "అవసరం కలిగితే మళ్ళీ నిన్ను కలుసుకుంటాను."

పంకజం లేచి, వేనిటీ బాగ్ తెరిచి ఓ స్లిప్ తీసిచ్చింది. అందుకుని చూసేను. దాంట్లో పంకజం ఇంటి ఎడ్రెస్, ఆమె పనిజేసే ఆఫీసు అడ్రెస్, ఆఫీస్ ఫోన్ నెంబర్ వున్నాయి.

"ఇంటివరకూ ఎలా వెళతావ్? టాక్సీ స్టాండ్ కి ఫోన్ జేసి టాక్సీ తెప్పించనా?" అడిగేను.

"వద్దు! వచ్చేటప్పుడు టాక్సీలోనే వచ్చేను. బైట వెయిటింగ్ లో వుంది" అంటూ తలుపు తెరుచుకుని వెళ్ళి పోయింది పంకజం.

స్లీపింగ్ గౌన్ విడిచి, గబగబ యూనిఫాం తొడుక్కున్నాను. ఓల్డ్ ఫైల్స్ బీరువాలోంచి, ఆర్ముగం కేసుకి సంబంధించిన ఫైల్ తీశ్నేను. నేను పరిశోధించిన క్రిమినల్ కేసులన్నీ నా పెర్సనల్ రికార్డ్స్ గా ట్రూ కాపీస్ జేసి అట్టే పెట్టుకుంటాను. ఆ ఫైల్లో కేబినెట్ సైజు ఆర్ముగం ఫోటో వుంది. దాన్ని తీసి జేబులో పెట్టుకుని బీరువా లాక్ జేసేను.

ఇంతలో బైట మోటర్ బైక్ వచ్చి ఆగిన చప్పుడైంది. బహుశా సార్జంట్ డేవిడ్ వచ్చుంటాడు. అతను అనేక కేసుల్లో నాకు అసిస్టెంట్ గా పనిజేసేడు. డిపార్ట్ మెంట్లో మమ్మల్ని ట్విన్ టైగర్స్ అని పిలుస్తారు.

బూట్సు టకటక చప్పుడు జేసుకుంటూ లోనికి వచ్చేడు డేవిడ్. పొట్టిగా, గున్నఏనుగులా వుంటాడు. కాస్త నలుపు, మంచి బాక్సర్! చేతికి గ్లవుస్ తొడుక్కో

ఉండా, పిడికిలి బిగించి గోడని గుద్దేడంటే పెచ్చు ఊడి పడవలసిందే!

"వాట్ హేపెండ్ సర్?" అడిగేడు నన్ను కాస్త పరీక్షగా చూస్తూ.

"చెబుతాను పద!" అంటూ తలుపువేపు నడిచేను.

"మీ నడకలో ఏదో మార్పు కనిపిస్తోంది!" అన్నాడు డేవిడ్ అనుమానంగా.

"ఔను! భుజానికి పిస్టల్ గుండు గాయమైంది. రైట్ హేండ్ సరిగ్గా పనిజెయ్యడం లేదు."

"వాట్?" డేవిడ్ కళ్ళు పెద్దవయ్యేయి.

"దార్లో అంతా విపులంగా చెబుతాను పద!" అంటూ ఇంటికి లాక్ జేసి మోటర్ బైక్ వేపు నడిచేను.

డేవిడ్ బైక్ స్టార్ట్ జెయ్యగానే బాక్ సీటుమీద కూర్చుంటూ—"హోటల్ అపోలోకి పోనివ్!" అన్నాను.

గేర్ మార్చి క్లచ్ వదిలేడు. గేటుగుండా బైటికి పోనిచ్చి, ఎడంవేపు తిప్పేడు. బాణంలా దూసుకు పోతోంది బుల్లెట్.

జరిగిందంతా డేవిడ్‌కి చెప్పసాగేను.

# 3

హోటల్ అపోలో పార్కింగ్‌లో మోటర్ బైక్ ఆపి లోనికి నడిచాము. యూనిఫాంలో ఉన్న మమ్మల్ని చూడ గానే కౌంటర్ క్లర్క్ చటుక్కున లేచి నిల్చున్నాడు.

"హరీంద్రకోసం వచ్చాం, ఆయన ఎక్కడ?" అడిగేను.

"థర్డ్ ఫ్లోర్‌లో ఆయన గదిలో ఉన్నారు. రండి చూపిస్తాను!" అంటూ లిఫ్ట్ వేపు నడిచాడు క్లర్క్.

లిఫ్ట్‌లో పైకి చేరుకున్నాం. నడవాలో కొంతదూరం తీసికెళ్ళి ఓ గదిముందు ఆగేడు క్లర్క్. తలుపు మూసి ఉంది. మునివేళ్ళతో తట్టేను. కిర్రుమంటూ తెరుచుకుంది. ఆశ్చర్యంతో మరి కాస్త తోసేను. తెరుచుకుంది. గదిలో చీకటి!

"మిస్టర్ హరీంద్రా!" పిలిచేను.

జవాబు లేదు!

నా గుండె వేగం అందుకుంది. మెల్లిగా గదిలో అడుగు పెట్టేను.

చిమ్మ చీకటి! కంటికి ఏమీ కనిపించడంలేదు.

"మిస్టర్ హరీంద్రా!" ఈసారి గట్టిగా పిలిచేను.

సూది పడితే వినిపించే నిశ్శబ్దం!

"మే ఐ కమిన్ సర్?" బైటనించి అడిగేడు డేవిడ్.

"ఎస్!" అన్నాను.

డేవిడ్ లోనికి వచ్చేడు. అతని వెనకే క్లర్క్ రాబోయేడు.

"నువ్వు అక్కడే ఉండు!" అన్నాడు డేవిడ్ కరుగ్గా. అతను బైటే ఉండిపోయేను.

"డేవిడ్! గోడలు వెదికి లైటు వెలిగించు!" అంటూ చీకట్లో రెండడుగులు ముందుకి వేసేను. కాలికి ఏదో తగిలింది. మెత్తగా, లావుగా! సరిగ్గా అదే సమయంలో డేవిడ్ లైటు వేసేడు. అనుమానమే నిజమైంది. నేలమీద శవం! చేతులు బార్లా చాపి బోర్లాపడున్న మగాడి శవం!! చుట్టూ రక్తపు మడుగు!!!

చటుక్కున వంగి శవాన్ని వెల్లకిలా తిప్పి చూసేను.

హరీంద్ర! ప్రాణం లేని హరీంద్ర!!

నోరు సగం తెరిచి ఉంది. కళ్ళు తెరిచి గది కప్పుని చూస్తున్నట్టున్నాయి. ఛాతీలో, పొట్టలో వరసగా కత్తి పోట్లు! ఒక్కటికాదు, రెండుకాదు. ఎనిమిది లోతైన కత్తిపోట్లు.

అనుకున్నంతా అయింది. ఆర్ముగం తన మాట నిలబెట్టుకున్నాడు. వాడు హరీంద్ర గదిలోకి రావడం ఎవ్వరైనా చూసేరా? గబగబ బైటికెళ్ళి క్లర్కుని అడిగేను.

"ఇది ఏరోడ్రోంకి దగ్గర్లో ఉన్న హోటల్, రాత్రింబవళ్ళూ తెరిచి ఉంటుంది. ఎంతోమంది వస్తూ పోతుంటారు. వాళ్ళలో ఎవర్ని ఎలా గుర్తు పెట్టుకోవడం?" అన్నాడు.

నిజమే! లోపల ఏం జరిగిందో అతనికింకా తెలీదు.

మళ్ళీ గదిలోకి వెళ్ళేను. "అంబులెన్స్‌కీ, ఫోటోగ్రాఫర్లకీ ఫోన్ చెయ్. ఈలోగా నేను ఏమైనా ఆధారాలు దొరుకుతాయేమో వెదుకుతాను!" అన్నాను డేవిడ్‌తో.

ఓ మూల ఉన్న ఫోన్ వేపు నడిచేడతను.

గదినంతా నా కళ్ళు ఎక్స్‌రే తియ్యసాగేయి. ఓ గోడవారగా మెత్తని ఫోంబెడ్, దానికి వేళాడుతున్న నీలిరంగు దోమతెర. గోడలకి ఖరీదైన ఆయిల్ పెయింట్స్. ఓ మూల నిలబెట్టిన గాడ్రెజ్ బీరువా. అటు నడిచేను. బీరువా పిడి విప్పి తలుపు తెరిచేను. పై రెండు అరల్లో హేంగర్స్‌కి వేళాడుతున్న సూట్స్, కింది అరలో వరసగా పేర్చిన ఫైల్స్. ఒక్కొక్కటే తీసి చూడసాగేను.

హోటల్‌కి సంబంధించిన పాత ఎకౌంట్స్, పర్సనల్ లెటర్స్, బిజినెస్ కరస్పాండింగ్ మేటర్స్! అందులోనే ఉన్న ఓ ఫొటో ఆల్బమ్ నన్నాకర్షించింది. తీసి చూసేను.

వివిధ సైజు గ్రూప్ ఫోటోస్, సింగిల్ స్నాప్ అందంగా అంటించి ఉన్నాయి. అందులో కొన్ని బ్లాకండ్ వైట్ అదో కలర్ ఫోటోలు!

సింగిల్ స్నాప్స్‌లో ఒకటీ రెండూ తప్ప మిగతా వన్నీ అందమైన అమ్మాయిలవే! అందులో నవ్వుతున్న పంకజం ఫోటోకూడా ఉంది. సాలోచనగా తలూపేను. ఆ ఆల్బమ్ చూసేక హరీంద్ర గొప్ప గ్రంథసాంగుడని ఇట్టే పసిగట్టవచ్చు. ఒకప్పుడు ఆర్ముగంతో కలిసి, పార్వ తప్ప స్మగ్లింగ్ గ్రూప్‌లో పనిజేసేవాడు.

ఆలోచిస్తూ ఆ ఆల్బమ్ అలాగే చేతిలో ఉంచుకుని, ఫైల్సన్నీ బీరువాలో సర్ది తలుపు మూసేను.

"ఫోన్ జేశాను! కొద్ది నిమిషాల్లో అంబులెన్స్, ఫోటో గ్రాఫర్స్ రావచ్చు!" అన్నాడు డేవిడ్.

"ఆల్ రైట్! వాళ్ళు రాగానే, ఇక్కడి తతంగం పూర్తిజేసి, ఎస్. పి.కి జరిగిందంతా ఇన్‌ఫార్మ్ జెయ్. నేను పార్వతప్ప ఇంటికి వెళుతున్నాను!" అంటూ జేబులోంచి ఆర్ముగం ఫోటో తీసి "ఈ ఫోటోని సేమ్ కాపీస్ తీయించి, నగరంలోని ప్రతి పోలీస్ స్టేషన్‌కి పంపించు. మఫ్టీలో డిటెక్టివ్ కానిస్టేబుల్స్‌ని రెడీజేసి, నగరమంతా వల పన్నాలి. ప్రతి హోటల్, ప్రతి లాడ్జింగ్, వ్యభిచార గృహాలూ, బార్స్, క్లబ్స్, అన్నీ సెర్చ్ జెయ్యాలి. వెంటనే పత్రికాఫీసులకి ఓ ప్రకటన కూడా పంపు!" అన్నాను.

ఫోటో అందుకుని తలూపేడు డేవిడ్!

రిస్టువాచీ చూసుకున్నాను. ఆరు గంటలు!

అప్పుడే తెల తెలవారబోతోంది. హోటల్లోంచి బైట పడి మోటర్ బైక్ ఎక్కేను.

# 4

పార్వతప్ప ఇంటికి వెళ్ళేసరికి, చిన్నసైజు జాతర కనిపించింది. ఆడవాళ్లు పెద్దగా ఏడుస్తున్నారు.

అనుకున్నంతా అయింది!

ఓ మూల వరండాలో కూర్చున్న పార్వతప్ప పెద్ద కొడుకు కరియప్ప కనిపించేడు.

అటు నడిచేను. యూనిఫాంలో ఉన్న నన్ను చూడగానే లేచి నిల్చున్నాడు.

"అయామ్ ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డి!" అన్నాను షేక్‌హాండ్ ఇస్తూ.

"మేమే మీకు ఫోన్ జెయ్యాలనుకుంటున్నాం! ఇంతలో, మీరే వచ్చారంటే ఆశ్చర్యంగా ఉంది! నా తమ్ముడు బసవప్పని ఎవ్వరో పొడిచి చంపేరు!" అన్నాడు కరియప్ప.

"శవం ఎక్కడుంది?"

"రండి చూపిస్తాను" అంటూ వెనుదిరిగి లోనికి నడిచేడు. అతన్ని అనుసరించాను. మెట్లగుండా మేడమీదికి తీసికెళ్ళి, ఓ గదిముందు ఆగి, "లోపల ఉంది! చూడండి!" అన్నాడు.

గదిలో అడుగుపెట్టేను. అది బెడ్‌రూం. గది వెచ్చగా ఉంది. బసవప్ప శవం నేలమీద వెల్లకిలా పడుంది. ఛాతిలో రెండేరెండు కత్తిపోట్లు కనిపిస్తున్నాయి. ఓ కాలు మడిచి ఉంది. మంచంమీద పరుపూ, దుప్పటీ, తలగడా చిందరవందరగా పడున్నాయి. మంచంపక్క టీపాయ్‌మీది అలారం టైపీస్, నీళ్ళ జగ్, గ్లాసూ కిందపడి పగిలి ఉన్నాయి.

చావకముందు హంతకుడితో కలియబడుంటాడు బసవప్ప. నా దృష్టి బార్లా తెరిచి ఉన్న గది కిటికీ మీద నిలిచింది.

చలికాలంలో కిటికీ దేనికి తెరిచి ఉంది? అటు నడిచేను. ఓ కిటికీరెక్క కింద గ్లాస్ పగిలి ఉంది. కిటికీ అంచుమీద మట్టి మరకలు! బైటికి తొంగిచూసేను. కిటికీ పక్కనే వాటర్ పైప్!

అర్థమైంది. అర్భుగం ఆ నీటిగొట్టం ద్వారా పైకి వచ్చి' కిటికీగుండా లోనికి దూకి ఉంటాడు. సాలోచనగా తలూపుతూ వెనుదిరిగాను.

బైటికి వచ్చి, "రాత్రి మీ తమ్ముడి కేకలుగానీ, ఈ గదిలోంచి ఏవైనా శబ్దాలుగానీ, మీకు వినిపించేయా?" అడిగేను కరియప్పని.

"ఈ ఇంట్లో జబ్బుతో తీసుకుంటున్న మా అమ్మా, నేనూ, తమ్ముడూ, వేలువిడిచిన మా విధవ మరదలూ ఉంటున్నాము. నాకు ఏకాంత, ప్రశాంత వాతావరణం ఇష్టం కనక ఔట్ హౌస్‌లో ఒంటరిగా ఉంటాను. ఇక ఇంట్లో అమ్మా, విధవ మరదలూ, తమ్ముడూ ఉంటారు. అమ్మకి హార్ట్ ఎటాక్ ఉన్న కారణంగా మేడమెట్లెక్క అవసరం ఉండకుండా కింది గదిలోనే ఉంటుంది. ఆమెకి తోడుగా మరదలూ, నౌఖర్లూ ఉంటారు. మేడమీద ఉండేది తమ్ముడొక్కడే! నేనెలాగూ సన్యసించేను గనక, ఈమధ్యే తమ్ముడికి ఓ సంబంధం నిశ్చయించేము. ఇక వాడి ద్వారానే మా వంశం నిలిచేది. ఇంతలో ఈ ఘోరం జరిగిపోయింది!" అన్నాడు కరియప్ప పూడుకు పోయిన స్వరంతో.

అతనికి దాదాపు ముప్పై అయిదేళ్ళుంటాయి. మనిషిలో ఏదో తేజస్సు కనిపిస్తుంది. కాషాయంరంగు లాల్చీ, అదే రంగు పంచ, మెడలో రుద్రాక్షమాల, నుదుట

విభూతిరేఖలు, అతనికి గౌరవప్రదమైన గాంభీర్యాన్ని కలిగిస్తున్నాయి.

"మీరు యాత్రలనించి ఎప్పుడు తిరిగి వచ్చేరు?" అడిగేను.

"దాదాపు ఏడాది అవుతోంది. నాన్నగారి హత్య తర వాత, తను పోయేవరకూ నన్ను ఇంటిపట్టునే, తన కళ్ళ ముందే ఉండమని మరీమరీ బ్రతిమాలింది అమ్మ. ఆమెకి బాల్యంనించీ నేనంటే ప్రత్యేకమైన అభిమానం. ఈ చివరిదశలో ఆమె కోరిక కాదనలేకపోయేను!"

"మీ తమ్ముడు మీ స్వంత వ్యాపారంతో బాటు,దొంగ బంగారంవంటి స్మగ్లింగ్ బిజినెస్ కూడా చేస్తుంటాడని మీకు తెలుసా?"

తల విదిలించేడు కరియప్ప. "నాన్నగారు పోయేక, ఆ వ్యాపారగొడలేవో తమ్ముడే చూసుకుంటున్నాడు. నా కలాటి లావాదేవీలంటే బొత్తిగా గిట్టదు. నేను పాండు రంగ భక్తుణ్ణి!"

అతనివల్ల అట్టే వివరాలు తెలీవు. సాలోచనగా తలూపి, "మీ అమ్మగార్ని ఓసారి చూడాలి. ఆవిడద్వారా మీ తమ్ముడికి సంబంధించిన వివరాలేవైనా తెలీవచ్చు" అన్నాను.

భారంగా నిట్టూర్చేడు కరియప్ప. "తమ్ముడి దుర్మ రణం ఆమెమీద గట్టిదెబ్బ తీసింది. ఆమెకి మిగిలింది మే మిద్దరమే మగ సంతానం. ఈ జీవితంలో నేనెలాగూ పెళ్ళి జేసుకోను. ఇక ఈ వంశాన్ని నిలిపేది తమ్ము డొక్కడే. వాడిమీద అటువంటి ఆశ నిలుపుకున్నాక, వాడిలా అర్ధాంతరంలో దయనీయంగా వెళ్ళిపోతే ఆ తల్లి హృదయం ఎలా ఉంటుందో మీరే ఊహించండి. ఇటు

వంటి పరిస్థితిలో ఆమెని యక్ష ప్రశ్నలు వెయ్యడం భావ్యం కాదు. ఏమైనా తెలుసుకోవాలంటే మా మరదల్ని పంపిస్తాను. ఆమెనడిగి మీ సందేహాలు తీర్చుకోండి!''

''ఆల్ రైట్! ఆవిడనే పంపండి'', అన్నాను. జేబులోంచి సిగరెట్ తీస్తూ.

''రండి. కింద హాలుపక్క గది ఖాళీగా ఉంది!'' అంటూ మెట్లవేపు నడిచేడు కరియప్ప.

అతన్ని అనుసరించేను. హాలుపక్క ఓ గదిలోకి తీసికెళ్ళి, సోఫా సెట్ చూపించి వెళ్ళిపోయేడు. సోఫాలో కూర్చుంటూ, టీపాయ్‌మీది టెలిఫోన్ ముందుకి లాక్కున్నాను. క్రయిం బ్రాంచికి రింగ్ చేసి, తక్షణం ఆంబులెన్స్‌నీ, ఫోటోగ్రాఫర్స్‌నీ పంపమని చెప్పి రిసీవర్ దించేను.

సరిగ్గా అదే సమయంలో, గదిలో అడుగు పెట్టిన యువతిని చూసి, రెప్ప వెయ్యడం మరిచిపోయేను.

పాతికేళ్ళుంటాయి. పొట్టికాదు, మరీ పొడుగూకాదు. తెల్లగా వుంది. నిండైన ఒళ్ళు. తెల్లబ్లౌజు, తెల్ల చీర, చెదిరిన జుత్తు. ఒంటిమీద వీసమెత్తు బంగారం లేకున్నా, ఎలాంటి మేకప్ జేసుకోకున్నా ఆమెలో ఏదో అనిర్వచనీయమైన ఆకర్షణ ఉంది. కాస్త స్నానం అదీ జేసి తయారైతే కళ్ళు చెదిరిపోయేలా ఉంటుందేమో!

ఏడ్చి కళ్ళు తుడుచుకున్నట్టు కంటికింద ఇగిరిపోయిన నీటిచారలు.

''రండి, ఇలా కూర్చోండి!'' అన్నాను ఈ లోకంలోకి వస్తూ.

పైట నిండుగా కప్పుకుని, వచ్చి సోఫాలో ఒదిగి కూర్చుంది.

"రెండేళ్ల క్రితం పార్వతప్పగారి హత్యకేసులో నేనిక్కడికి వచ్చినప్పుడు మిమ్మల్ని చూసినట్టు గుర్తులేదు!" అన్నాను రంగంలోకి దిగుతూ.

"ఔను! అప్పుడు నాకు కొత్తగా పెళ్ళయింది. అత్తవారి ఇంట్లో ఉన్నాను. ఏడాది క్రితం మా వారు కారు ఏక్సిడెంట్‌లో పోయేరు. అప్పట్నించీ మా అత్తగారికి నేనంటే పడేది కాదు. చీటికీ మాటికీ వేపుకు తినేది. అక్కడ బ్రతకలేక ఇక్కడికి వచ్చేశాను!"

"మీ పేరు తెలుసుకోవచ్చా?"

"కళ్యాణి!"

"రాత్రి బసవప్ప గదిలోంచి కేకలూ, చప్పుళ్ళూ ఏమీ వినిపించలేదా మీకు?"

"లేదు! నాకు పగలు పడుకునే అలవాటు లేదు. కనక రాత్రి బాగా నిదరపడుతుంది. ఇక అత్తయ్యకి చెవులు సరిగా వినిపించవు. ఉన్న ఇద్దరు ముగ్గురు నౌఖర్లూ, పగలంతా పనిజేసి అలసిపోయి, తలో మూల పడుకుని ఆదమరిచి నిదరబోతారు. రాత్రి ఏంజరిగిందో ఉదయం లేచే వరకూ మాకేమీ తెలీదు. ఇంట్లో అందరికీ ఉదయం ఆరు గంటలకే నిద్రలేచే అలవాటుంది. లేవగానే బసవప్పకి బెడ్ టీ తీసుకునే అలవాటుంది. ఉదయం టీ తీసికెళ్ళిన నౌఖరుకి ఆ దృశ్యం కనిపించి, కేకలు పెడుతూ కిందకి వచ్చేడు!"

"మీకు హరీంద్ర తెలుసా?"

"ఏ హరీంద్ర?"

నవ్వేను. "హోటల్ అపోలో యజమాని!"

"తెలీదు!"

"అతను మీకు బాగా తెలుసని నాకు తెలుసు!" అన్నాను నవ్వుతూ.

కళ్యాణి మొహం ఎర్రబడింది. "చెప్పానుగా! అటు వంటి పేరు నేనింతవరకూ వినలేదు?"

పకపక నవ్వేను. "బుకాయించి ప్రయోజనం లేదు కళ్యాణీ! హరీంద్రకీ, మీకూ మంచి పరిచయం ఉన్నట్టు నా దగ్గర నిరుష్టమైన ఆధారం ఉంది!"

"ఉంటే, ఏదీ చూపించండి చూద్దాం!" అంది తీక్షణంగా.

పరువు కోసం ఆమె పడుతున్న పాట్లు చూస్తే ఓ పక్క జాలివేసింది. గదిలో ఆమె అడుగుపెట్టినప్పుడే, నా మెదడులో మెరిసింది ఆలోచన. అంతకి ముందెక్కడో ఆమెని చూసినట్టు. చేతిలో ఉన్న అల్బమ్ తెరిచేను. కొన్ని పేజీలు తిరిగేశాక, కనిపించింది ఫోటో. కళ్యాణిది! పాస్‌పోర్ట్ సైజు అర్హ్వో కలర్ ఫోటో!

ఆమెకు ఫోటో కనిపించేలా అల్బమ్ తిప్పి టీపాయ్ మీద పెట్టి ఆమెవేపు చూసేను. అప్పటికే కళ్యాణి మొహం రంగులు మారింద.

"ఈ అల్బమ్ ఎవ్వరిదో తెలుసా? మిస్టర్ హరీంద్రది! ఇప్పుడైనా ఒప్పుకుంటారా నా ప్రశ్నలో నిజం ఉందని?"

కళ్యాణి పలకలేదు. చేతుల్లో ముఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది. "దయచేసి ఏడవకండి! నేను డిటెక్టివ్ ఇన్‌స్పెక్టర్ని. మీ పర్సనల్ విషయాలేవైనా సరే నాతో చెప్పడానికి సంశయించవద్దు. ఇతర్ల రహస్యాలెప్పుడూ నా మనసులో గుప్తంగా ఉంటాయి. చెప్పండి. మీకు హరీంద్రతో ఎలా పరిచయమైంది? మీ ఫోటో అతని దగ్గరికెలా వచ్చింది?" అడిగేను.

క్షణం తర్వాత పైటతో కళ్ళు తుడుచుకుని, జీవం లేని కంఠంతో చెప్పసాగింది కళ్యాణి: "ఏవో బిజినెస్ విషయాలు మాట్లాడ్డానికి, బసవప్ప కోసం తరచూ ఇక్కడికి వచ్చేవాడు హరీంద్ర! ఒకోక్కసారి బసవప్ప ఇంట్లో లేకుంటే నేనే అతనితో మాట్లాడవలసి వచ్చేది. మొదట ఎంతో మంచివాడని భ్రమిసేను. అతని మాట తీరు అలా ఉండేది. మొదటి పరిచయంతోనే అతనిమీద ఒకరకం అభిమానం ఏర్పడింది నాలో. బసవప్ప ఇంట్లో ఉన్నా, లేకున్నా ఏదో ఒక వంకతో తరుచూ వచ్చేవాడు. నాతో మాట్లాడి వెళ్ళేవాడు. దాన్నిబట్టి అతను నా కోసమే ఇక్కడికి వస్తున్నట్టు గ్రహించేను.

అతని ప్రలోభంలో పడిపోయేను. నన్ను పెళ్ళిజేసుకుంటానని బాసలు జేసేడు. నమ్మేను! అతన్ని చూస్తే అతను చెప్పే ప్రతి మాటా నమ్మబుద్ధి వేస్తుంది. ఒక రోజు రాత్రి ఓ ముఖ్యవిషయం మాట్లాడాలనీ, ఉన్నపళంగా అపోలో హోటల్‌కి రమ్మనీ ఫోన్ జేసేడు. బహుశా మా పెళ్ళి విషయమే అయ్యుంటుందని, ఓ స్నేహితురాలి ఇంటికి వెళ్తున్నానని చెప్పి హోటల్‌కెళ్ళేను.

అక్కడ మాయమాటలు చెప్పి నన్ను మలినం జేసేడు. తరవాత అతని ప్రవర్తనలో మార్పు రాసాగింది. అడపా దడపా ఇంటికి వచ్చేవాడల్లా, ఇప్పుడు పూర్తిగా రావడం మానేసేడు. అనేకసార్లు ఫోన్లో మాట్లాడ్డానికి ప్రయత్నించేను. ఫలితంలేదు. దాంతో అర్థం జేసుకున్నాను అతనిక అందడని!

కేవలం నా శరీరం మీది వాంఛతో నన్ను పరిచయం జేసుకున్నాడు. కల్లిబొల్లి కబుర్లు చెప్పి నన్ను పూర్తిగా

తనవేపు తిప్పుకున్నాడు. వాంఛ తీరింది. దులిపేసు కున్నాడు. తప్పు నాది కాదు. నా వయసుది! ఆ వయసుని సృష్టించిన భగవంతుడిది. ఇంత చిన్న వయసులో, ఇంకా పాదాల పారాణి ఆరకముందే, నా నుదుటి కుంకుమని తుడిచివేసిన ఆ పరబ్రహ్మది!"

నిట్టూర్చేను. ఆమె ఆక్రందనలో నిజం లేకపోలేదు. హరీంద్ర చేతుల్లో ఆటబొమ్మలైన అనేకమంది అమ్మాయిల్లో కళ్యాణి ఒకతి! కేవలం కాక తాళీయంగానే ఈ రహస్యం నా దృష్టిలో నానింది.

సాలోచనగా తలూపేను. "మీ పట్ల నాకు సానుభూతి ఉంది. మీరీ విషయం విని నిర్ఘాంతబోవచ్చు. హరీంద్ర రాత్రి హత్య చెయ్యబడ్డాడు!"

పేలవంగా నవ్వింది కళ్యాణి. "నా శాపం ఊరికే పోలేదన్న మాట. అటువంటి మనుషుల చావు అలాగే రాసిపెట్టి ఉంటుంది!" అంది.

"బసవప్ప వ్యక్తిత్వం ఎటువంటిది?"

"మంచివాడే! కాని, తండ్రిలాగే అతనికీ ధనదాహం ఎక్కువ. డబ్బు సంపాదించడానికి ఎన్ని అక్రమ వ్యాపారాలు చెయ్యడానికైనా వెనుదీయని తత్వం! పోతే, పెద బావ కరియప్ప, ఓ మూగజీవి. ఆయనకీ లోకంతో సంబంధం ఉండదు. యవ్వనంలో ఉన్నప్పుడే ఐహిక బంధాలని త్యజించేరు!"

"బసవప్పని, హరీంద్రనీ ఎవ్వరు చంపేరో తెలుసా?"

"ఎవ్వరు?"

"అర్ముగం!"

ఆశ్చర్యంతో కళ్యాణి నోరు తెరుచుకుంది. "అదెలా? అతను జైల్లో శిక్ష అనుభవిస్తున్నాడే!"

"జైలునించి తప్పించుకున్నాడు. దేనికో తెలుసా? మీ కుటుంబ సభ్యులని తుడిచిపెట్టడానికి. వాడు పట్టుబడే వరకూ మీరంతా కాస్త జాగ్రత్తగా ఉండాలి!" అన్నాను.

అంతలో అంబులెన్స్, ఫోటోగ్రాఫర్స్ వచ్చేరక్కడికి. అక్కడి తతంగం ముగించి, శవాన్ని అంబులెన్స్‌లో పంపి, కరియప్పనీ, కళ్యాణినీ మరోమారు హెచ్చరించి బైలుదేరేను.

# 5

ఆర్ముగం జైలునుంచి తప్పించుకోడం, మద్రాసు ప్రాంతంలో పేరుపొందిన స్మగ్లర్స్ బసవప్పా, హరీంద్రలు హత్యజెయ్యబడటం మా పోలీస్ ఫోర్స్‌లో తీవ్ర సంచలనం రేపింది.

మద్రాసు పొలిమేరలతో సహా ఆర్ముగం కోసం నగరమంతా వలపన్ని ఉంచేము. మఫ్టీలో ఉన్న సి. ఐ. డి. కానిస్టేబుల్స్‌నించి ఏ క్షణంలోనైనా ఇన్ఫర్‌మేషన్ రావచ్చు. క్రయిం బ్రాంచి హెడ్‌క్వార్టర్స్‌లోని నా ఆఫీస్‌లో కూర్చుని ఫోన్‌కాల్స్ కోసం వేచి ఉన్నాను. ఎమర్జెన్సీ టైంలో నాకు తోడుగా ఉండేందుకు సార్జంట్ డేవిడ్ రెడీగా ఉన్నాడు.

అప్పుడు రాత్రి సరిగ్గా ఏడు గంటలవుతోంది. సిగరెట్ అంటించి తీవ్రంగా యోచిస్తున్నాను. మెరుపులా మెరిసింది ఆలోచన. "జైలు కెళ్ళకముందు ఆర్ముగానికి ఓ ప్రియురాలుండేది కదూ?" అడిగాను డేవిడ్‌ని.

"ఔను! మూన్‌లైట్ క్లబ్ డాన్సర్ మిస్ ఎల్లో ఫ్లవర్!" అన్నాడు డేవిడ్ మెరిసే కళ్ళతో.

"ఇంతసేపూ ఆ విషయం నా బుర్రకి తట్టలేదు. కమాన్! ఓమారు మూన్ లైట్ క్లబ్ కెళ్ళి ఎల్లోఫ్లవర్ని కలుసుకుందాం. అర్మ్యగం జైల్లోంచి బైటపడి తప్పకుండా ఆమెని కలుసుకునుంటాడు!" అన్నాను టేబిల్ మీది క్యాప్ అందుకుని లేస్తూ.

ఐదు నిమిషాల్లో మోటర్ బైక్ మీద క్లబ్ చేరుకున్నాం.

క్లబ్ మేనేజర్ మమ్మల్ని చూడగానే సాదరంగా ఆహ్వానించేడు లోనికి.

"మీ క్లబ్ డాన్సర్ ఎల్లోఫ్లవర్ని కలుసుకోవడానికి వచ్చాం! ఆమెని పిలిపించండి!" అన్నాను.

"సారీ సార్, ఆమె ఈ రోజు రాలేదు. రానని లీవ్ లెటర్ పంపింది!"

సాలోచనగా తలూపేను. "ఆల్ రైట్! ఆమె అడ్రస్ చెప్పండి!"

"ధనలక్ష్మి కాలనీ, డోర్ నెంబర్ 145-20/422."

క్షణం వృధా చెయ్యకుండా ధనలక్ష్మి కాలనీ చేరుకున్నాం.

ఓ టెలిఫోన్ పోల్ కింద బుల్లెట్ ఆపేడు డేవిడ్.

"నువ్విక్కడే ఉండు. నేను ఇంట్లో కెళ్ళి చూస్తాను. నా అంచనా ప్రకారం అర్మ్యగం ఆ ఇంట్లో ఉండి ఉంటే, నేను రావడం చూసి ఏదో ఒక ఎత్తువేసి, ఇంట్లోంచి బైటపడవచ్చు. వాణ్ణి వదలకుండా నీడలా ఫాలో జెయ్!" అన్నాను మోటర్ బైక్ దిగుతూ.

డేవిడ్ తలూపేడు.

వీధిని పరీక్షగా చూస్తూ ముందుకి నడిచేను. విశాలమైన వీధి. ఇరుపక్కలా అందమైన ఇళ్ళు. అవి మున్సిపల్ క్వార్టర్స్. చాలా ప్రశాంతమైన ప్రదేశం. వీధిలో అట్టే

జనసంచారంలేదు. డోర్ నెంబర్స్ చెక్ జేస్తూ గబగబ నడుస్తున్నాను.

ఫర్లాంగు దూరం నడిచేక, కనిపించింది ఎల్లోఫ్లవర్ ఇల్లు. గేటుపక్క అందమైన నేమ్ ప్లేట్ వేళాడుతోంది. అది చిన్న సైజు డాబా ఇల్లు. ఇంటిముందు చిన్న కాంపౌండ్, చెక్క గేటు, గేటుముందు నల్లని ఎంబాసిడర్ కారు ఆగి ఉంది. కారులో ఎవ్వరూ లేరు. రిస్టువాచీ చూసుకున్నాను. ఎనిమిదింబావు!

చెక్క గేటు తోసుకుంటూ మెల్లిగా కాంపౌండ్ లో అడుగుపెట్టేను. కాంపౌండ్ లో మసక చీకటి. ఇంటి తలుపు మూసి ఉంది. అడుగులో అడుగు వేసుకుంటూ తలుపువేపు నడిచేను. మెట్లెక్కి, జేబులోంచి రివాల్వర్ తీసేను. సెఫ్టీ కాచ్ లాగి, దాన్ని ఎడం చేతిలో రెడీగా పట్టుకుని, మునివేళ్ళతో తలుపుమీద తట్టేను.

నిశ్శబ్దం!

క్షణం ఆగి మళ్ళీ తట్టేను.

"ఎవ్వరు?" లోపలినించి వినిపించింది స్త్రీ కంఠం.

నేనెవ్వర్నో ముందే చెబితే ప్రమాదం. "మీతో పనుంది. కాస్త తలుపు తెరవండి!" అన్నాను. గబగబ తలుపు దగ్గరికి వస్తున్న అడుగుల చప్పుడు. తలుపు దగ్గిర ఆగిపోయింది. గడియ తీస్తున్న శబ్దం. నిమిషం చూసి మెల్లిగా తోసేను. కిర్రుమంటూ తెరుచుకుంది.

"లోనికి రండి!" జీరగా పలికింది స్త్రీ కంఠం.

లోపల చీకటి! కళ్ళు చిట్లించి చూసేను. ఎవ్వరూ కనిపించడం లేదు. ఇదేదో పన్నాగంలా ఉంది. వీధిలో లైటు వెలుగుతుంటే, ఇంట్లో చీకటేమిటి? "నా చేతిలో రివాల్వర్ ఉంది. చీకట్లో కూడా నా గురి తప్పదం

జరగదు. పిచ్చివేషాలు వేస్తే ముప్పు మీకే! ఇంట్లో లైటు వెలిగించండి!'' అన్నాను లోన అడుగుపెడుతూ.

''ఫ్యూజ్ పోయింది. ఫరవాలేదు. రండి! దీపం వెలిగిస్తాను!''

జేబులోంచి సిగరెట్ లైటర్ తీసేను. సరిగ్గా అదే సమయంలో పడింది దెబ్బ. బుర్రపగిలేలా, కళ్ళు బైర్లు కమ్మేలా తలమీద పడింది. కళ్ళల్లో చుక్కలు మెరిసేయి. తేరుకునేలోగా మరోటి పడింది. అంతే!

మొదలు నరికిన చెట్టులా కింద కూలేను!

## 6

''అబ్బా!'' అంటూ కళ్ళు తెరిచేను.

చీకటి! తలలో సూదిపోటు. జివ్వుమంటోంది.

నేలమీద తడిమి చూసేను. సిగరెట్ లైటర్, పిస్తోలు చేతికి తగిలేయి. మెల్లిగా లేచి నిల్చున్నాను. లైటర్ వెలిగించి గోడలని పరీక్షగా చూసేను. తలుపు పక్క కనిపించింది స్విచ్. తడబడే అడుగులతో వెళ్ళి స్విచ్ వత్తేను. లైటు వెలిగింది. అది డ్రాయింగ్ రూం! ఎదురుగా మరో రెండు గదులున్నాయి. ఇల్లంతా నిశ్శబ్దం. నన్ను స్పృహ పోగొట్టి పిట్టలు ఎగిరిపోయుంటాయి. అడుగులో అడుగు వేసుకుంటూ ఎదురుగా కనిపిస్తున్న ఓ గదివేపు నడిచేను. లోపల చీకటి. లోన అడుగుపెట్టి తలుపుపక్క తడిమి స్విచ్ వత్తేను. లైటు వెలిగింది. ఆ వెలుగులో, కనిపించిన దృశ్యం చూసి, నా గుండె క్షణం ఆగి తిరిగి కొట్టుకో సాగింది. అది కలా? నిజమా? నమ్మాలా? వద్దా?

ఓ గోడవారగా డన్‌లప్ మంచం. ఆ మంచంమీద వెల్లకిలా పడున్న శవం!

ఎవ్వరిదో కాదు. అక్షరాలా అర్చగం శవం! రెండు

చేతులూ, రెండు కాళ్ళూ బార్లా చాపి, వెల్లకిలా పడున్నాడు. ఒంటిమీద కేవలం ఒక కట్ డ్రాయర్ ఉంది. కళ్ళు రెండూ తెరుచుకుని ఇంటి కప్పువేపు చూస్తున్నాయి. కణత దగ్గర రంధ్రం! ఆ రంధ్రంలోంచి కారి చెవికింద ఎర్రగా, చిక్కగా గడ్డకట్టిన రక్తం!

మంచానికి కాస్త ఎడంగా, కింద నేలమీద బోర్లా పడుంది ఎల్లో ఫ్లవర్! ఆమె ఒంటిమీద కూడా కట్ డ్రాయర్ తప్పితే మరో బట్టలేదు. స్తనాలు నేలకి అదుముకుని వెడల్పుగా కన్పిస్తున్నాయి. కళ్లు మూతలు పడున్నాయి. వీపులో ఎర్రని రంధ్రం!

ఇద్దరూ మరణించేరు. మంచి రసపట్టులో ఉండగా హత్య చెయ్యబడ్డారు!

ఆర్ముగం రౌడీ! పచ్చి రౌడీ. అటువంటివాళ్ళకి గడపకో శత్రు వుంటాడు. వాడు జైలునించి తప్పించుకున్నాడని, ఈ పాటికి నగరమంతా పాకిపోయింది. జైల్లో ఉండి బయటపడ్డాక సహజంగా ప్రతివాడూ ముందు, కామతృష్ణ తీర్చుకోడానికే ప్రయత్నిస్తాడు. ఆర్ముగం ఎల్లో ఫ్లవర్ని ఉంచుకున్న సంగతి దాదాపు అందరికీ తెలుసు. వాడు సెక్సప్పీల్ తీర్చుకోడానికి తప్పక ఎల్లో ఫ్లవర్ ఇంట్లో తిష్ట వేస్తాడని ఊహించే హంతకుడు సరాసరి ఇక్కడికి వచ్చేడు...

బయట మోటర్ బైక్ చప్పుడు వినగానే ఆలోచనకి బ్రేకు పడింది. అది బుల్లెట్ చప్పుడు. అంతవరకూ డేవిడ్ సంగతే మరిచేను. చటుక్కున వెనుదిరిగి బయటికి పరిగెత్తేను. బుల్లెట్కి స్టాండ్ వేసి కాంపౌండ్లోకి వస్తున్న డేవిడ్ నన్ను చూడగానే, "థాంక్ గాడ్! మీరు క్షేమంగా ఉన్నారుకదా?" అన్నాడు ఆతృతగా.

"అయామ్ క్వైట్ ఓ. కే. నీ సంగతి చెప్పు!" అన్నాను.

"మీరు ఇంట్లోకెళ్ళిన కొద్దిసేపటికి రెండు ఆకారాలు ఇంట్లోంచి బయటికి వచ్చేయి. దాదాపు పరిగెత్తుతున్నట్టు నడుస్తూ గేటుముందు ఆగి ఉన్న కార్లో కూర్చున్నాయి. చీకట్లో దూరంనించి వాళ్ళని పోల్చుకోలేక పోయేను. కారు స్టార్టయి వేగంగా బయలుదేరింది. వాళ్ళని కాస్త ముందు పోనిచ్చి బుల్లెట్ ఎక్కి వెనక బయలుదేరేను. ఆ కారు తిన్నగా అళగరైస్వామి స్ట్రీట్‌లో ఓ చిన్నసైజు మేడలోకెళ్ళి ఆగింది. ఆ రెండు ఆకారాలు దిగిలోనికెళ్ళేయి!" అన్నాడు డేవిడ్.

నాలో ఉత్సాహం ఉరకలు వేసింది. "పద! అక్కడికెళ్ళి చూద్దాం!" అంటూ బుల్లెట్ వేపు నడిచేను. పావుగంటలో అక్కడికి జేరుకున్నాం.

మేడ ముందుభాగంలో చిన్నసైజు కాంపౌండ్. కాంపౌండ్‌లో కెళ్ళడానికి ఓ చెక్కగేటు. మేడమీద ఒకే ఒక గదిలో లైటు వెలుగుతున్నట్టు బాల్కనీలోంచి వెలుగు కనిపిస్తోంది.

సవ్వడి కాకుండా చెక్కగేటు తెరిచి, ఇద్దరం కాంపౌండ్‌లో ప్రవేశించేము. బాల్కనీ కింద ఆగి తలెత్తి పైకి చూసేను. బాల్కనీ పక్కగోడకి ఆనుకుని కనిపించింది నీటిగొట్టం.

డేవిడ్‌ని నా వెనకే పైకి రమ్మన్నట్టు సైగజేసి నీటిగొట్టం అందుకున్నాను. కన్నుమూసి తెరిచేలోగా పాములా పాకుతూ పైకి జేరుకున్నాను. ఈ సర్వీసులో అదొక అత్యవసరమైన విద్య! పిట్టగోడ అంచు అందుకుని మెల్లిగా బాల్కనీలోకి దిగేను. అక్కడ మసక చీకటి. గదిలో

గ్లాసుల శబ్దం వినిపిస్తోంది.

బల్లిలా గోడకి అతుక్కుని, పిల్లిలా అడుగులు వేస్తూ తలుపుని సమీపించి, లోనికి చూసేను. అంతే! నా స్థానంలో వేరొకరు ఉండివుంటే, ఆ దృశ్యం చూసి బుర్ర గింగుర్లు తిరిగి కింద పడిపోయేవారే! నేనుమాత్రం స్థాణువునై గదిలోని దృశ్యం చూడసాగేను.

గదిమధ్య సోఫాలో కరియప్ప కూర్చున్నాడు! అతని చేతిలో సగం నిండిన విస్కీ గ్లాసు! అతని ముందు, సోఫాలో కూర్చుని సోడా కార్క్ ఊడదీస్తోంది అతడి మరదలు కళ్యాణి!!

గ్లాసులోని విస్కీని ఒక్క గుక్కలో ఖాళీజేసి, "హమ్మయ్య! ఇప్పుడు కాస్త మైండ్ రిలాక్స్ అయింది. ఇక మన మార్గంలోని ముళ్ళన్నీ తొలిగిపోయినట్టే. పోలీసులు ముప్పుతిప్పలు పడి మూడు చెరువుల నీళ్ళు తాగినా ఈ కేసు సాల్వ్ జెయ్యలేరు. వాళ్ళ ఫైళ్ళలో ఈ కేసు మూతపడేవరకూ మనం కాస్త జాగ్రత్త పడాలి!" అంటున్నాడు కరియప్ప కన్నడంలో.

చాలు! కేసు విడిపోయింది. పూర్ కరియప్ప!

జేబులోంచి పిస్తోలు బైటికితీసి, సెఫ్టీ కాచ్ లాగేను. ట్రిగ్గర్ మీద వేలు రెడీగా ఉంచి, తలుపుగుండా గదిలో అడుగుపెట్టేను. అడుగుల చప్పుడు విని, ముందు కళ్యాణి నన్ను చూసి కెవ్వుమంది. ఆ కేక విని కరియప్ప గాభరాగా ఇటు తిరిగేడు. అంతే! గుడ్లు తేలవేసి అలా చూస్తూ ఉండిపోయేడు.

"సన్యాసులవారికి వందనాలు! మీవంటి మహానుభావుల వల్లే ఈనాడు కాషాయవస్త్రాల విలువ దిగజారిపోయింది. ఆల్ రైట్ మిస్టర్ కరియప్పా! నీ అమోఘమైన పథ

కాన్ని మెచ్చుకోకుండా ఉండలేను. కానీ, అనాదినించీ ఈనాటివరకూ దుష్టుల కుతంత్రాలన్నీ చివరిదశలో ఇలా శిథిలమవుతూనే వున్నాయి. ఇది దైవనిర్ణయం కాబోలు. సో, మిస్టర్ హరీంద్రనీ, నీ తమ్ముడు బసవప్పనీ, ఆర్ముగాన్నీ, ఎల్లోఫ్లవర్నీ హత్యజేసిన నేరంకింద మీ ఇద్దర్నీ అరెస్ట్ జేస్తున్నాను!'' అన్నాను జేబులోంచి కఫ్స్ తీస్తూ. ఈలోగా డేవిడ్ బాల్కనీగుండా లోనికి ప్రవేశించేడు.

కరియప్ప నవ్వేడు. విరగబడి నవ్వేడు. ''పూర్ ఇన్స్పెక్టర్! ఆ హత్యలు నేనే జేసినట్టు నీ దగ్గిర ప్రూఫ్ ఏమిటి? కోర్టులో ఎలా ఋజువు జేస్తావ్?'' అన్నాడు ఎగతాళిగా.

అతనిలాగే ఈసారి నేనూ నవ్వవలసి వచ్చింది. నవ్వుతూ కోటుజేబులోంచి నా సిగరెట్ కేస్ తీసేను. ''ప్రూఫ్ కావాలా? ఇంద, చూడు!'' అంటూ అందులో ప్రత్యేకంగా అమర్చబడి వున్న బటన్ వత్తేను. అది మేడిన్ జర్మన్ సిగరెట్ కేస్ కమ్ టేప్ రికార్డర్!

బటన్ పుష్ జెయ్యగానే టేప్ రికార్డర్, రీ సౌండ్ జెయ్యసాగింది. అంతవరకూ గదిలో జరిగిన సంభాషణంతా కంఠాలతో సహా పూర్తిగా వినిపించసాగింది. వింటున్న కరియప్ప ముఖంలో సన్నసన్నగా చమట పట్టసాగింది!

## 7

''ఈ కేసు ఇలా ముగుస్తుందని నేను ఊహించలేదు!'' అన్నాడు సార్జంట్ డేవిడ్.

''నిజమే! నేనూ ఊహించలేదు. కరియప్ప అరెస్ట్తో కేసు అసలు స్వరూపం బయటపడింది. నిజానికి ఆర్ముగం జైలునించి తప్పించుకున్నాడేగానీ, ఎవ్వర్నీ హత్యజెయ్యలేకపోయేడు. హరీంద్రనీ, బసవప్పనీ చంపింది కరియప్పే!

తన చెల్లెలు పంకజం రాసిన ఉత్తరం చూసి, ఆమెకి హరీంద్ర జేసిన తీరని ద్రోహానికి తగిన శిక్ష విధించాలని, ఆర్ముగం జైలునించి తప్పించుకున్నాడు. విచిత్రం ఏమిటంటే, వాడు జైలునించి బయటపడకముందే కరియప్ప హరీంద్రని చంపేడు. దానిక్కారణం హరీంద్ర తన ప్రియురాలు కళ్యాణిని ముందు మాయమాటలతో మోసం జేసి చెరచడమే! అదేరాత్రి కరియప్ప పనిలో పనిగా బసవప్పనీ చంపేడు. దానిక్కారణం ఆస్థి!

తరవాత, తెలిసింది కరియప్పకి ఆర్ముగం జైలునించి తప్పించుకున్నట్లు. పాత పగతో వాడు తమని ఎక్కడ మట్టుబెడతాడో అని, వాడు తమని చంపకముందు, తానే వాణ్ణి యమపురికి పంపించాలని ప్లాన్ వేసేడు. ఆర్ముగం జైలునించి బయటపడి తన ప్రియురాలు ఎల్లో ఫ్లవర్ ఇంట్లో ఉండివుంటాడని ఊహించి, తనకి తోడుగా కళ్యాణిని వెంటబెట్టుకుని ఎల్లో ఫ్లవర్ ఇంటికి వెళ్ళేడు. ప్రియురాలితో పడగ్గదిలో పడుకున్న ఆర్ముగాన్నీ, ఎల్లోఫ్లవర్నీ చంపి, అదే సమయంలో అక్కడికి జేరుకున్న నన్ను స్పృహ పోగొట్టి పారిపోయేడు.

నాకు ఆర్ముగంమీద విపరీతమైన జాలి కలుగుతోంది. రౌడీ అయినా, వాడు తన చెల్లెలు పంకజాన్ని ప్రాణప్రదంగా ప్రేమించేవాడుట. ఆమెని సుఖపెట్టడానికే అన్ని వక్రమార్గాలతో డబ్బు సంపాదించేవాడుట. చివరికి ఆమెకోసమే జైలుపాలయ్యేడు...ఏది ఏమైనా, కేసు మాత్రం నాకు మంచి థ్రిల్ నిచ్చింది!'' అన్నాను పూర్తయిన సిగరెట్ ని ఏష్ట్రేలో నొక్కుతూ.

-: ఐపోయింది :-

# 90 నిమిషాలలో విమాన ప్రమాదం!

## డాక్టర్ పెందుర్తి మాస్టర్జీ

బొంబాయి, సింధియా నగర్‌లో నైట్ పారడైజ్ క్లబ్ అది.

ఎనిమిది గంటల సమయంలో ఒక్కొక్కరు రూమంతా నిండిపోయారు. మొత్తం నూట డెభ్బైఏడు సీట్లు ప్రేక్షకులతో నిండిపోయాయి. కొందరు జిన్ త్రాగుతున్నారు, కొందరు చికెన్ ఫ్రై తింటున్నారు. అందరి కళ్లు డాన్స్ ఎప్పుడు ప్రారంభమవుతుందో స్టేజిపైకి చూస్తున్నాయి.

నరేంద్ర బ్రాంది ఒక్కొక్క పెగ్ తాగుతూ, చిప్స్ తింటున్నాడు.

ఎనిమిది గంటలయింది. వెస్టరన్ మ్యూజిక్ ఆగి పోయింది, రెడ్ లైట్స్ ఆరిపోయి, బ్లూ లైట్స్ వెలిగాయి.

"డియర్ ఫ్రండ్స్ యిప్పుడు ప్రఖ్యాత కేబ్రా డాన్సర్ లూసియా డాన్స్ చేస్తుంది. ఉయ్ ఎంజాయ్ విత్ హర్" అన్నాడు ఎనౌన్సర్.

స్టేజిపైన రెండు రంగుల లైట్లు వెలిగాయి. ఆ రంగుల వెలుగులో రంగు రంగుల లూసి వేదిక మీదకు వచ్చింది. స్పాట్ లైట్స్ వెలుగులో వెన్నెలలా వెలిగిపోతూంది. గోల్డ్ కలర్ క్రీమ్ పూయటంతో బంగారు రంగు శరీరంతో మరీ సుందరంగా వుంది. రొమ్ముల మీద గోల్డ్ కలర్ దారాలు కదులుతూ వున్నాయి. బొడ్డుకు బాగా దిగువగా చేతిరుమాల చుట్టినట్లున్న గుడ్డపైన వజ్రాలు పొదిగినట్లు వుంది. ఆమె కదలికలో తొడలు దూరం కావటంతో బొడ్డు దిగువభాగం కనిపిస్తుందేమో చూస్తున్నారు. కైపులో వున్న కళ్లు, తూపుల్లాంటి చూపులు, వయ్యారం వలికించే అధరాలు ప్రేక్షకుల్ని కవ్విస్తున్నాయి.

నరేంద్ర సిగరెట్ వెలిగించి చూస్తున్నాడు.

ఇంతలో ఎదురుగా కూర్చున్న వ్యక్తి "మిస్టర్ నరేంద్ర" అని పిలిచాడు. నరేంద్ర ఉలిక్కిపడ్డాడు. అతను బ్రీఫ్ కేసు నరేంద్రకు దగ్గరగా జరిపాడు. "యీ కేసు తీసుకోండి." నరేంద్ర చూశాడు.

చిన్న కవరు ఒకటి అందించాడు. "దాన్లో ఇన్స్ట్రక్షన్స్ వున్నాయి" అన్నాడు మెల్లగా. నరేంద్ర తలూపాడు. అతను వెళ్ళిపోయాడు.

లూసియా స్టేజిపైకి నడుస్తూ చంకల బ్రా విప్పి విసిరింది. గబాలున వదులుగా వున్న వెంట్రుకలు రొమ్ముల

మీద వేసుకుంది. యింతింతైన రొమ్ములు ఎత్తుగా బలంగా వున్నాయి. రష్యన్ యువతిలా బలమయిన శరీరం లూసిది. వయసు పాతికపైగా వుంటాయి. ఒక పురుష బృందం ముందు నగ్నంగా తిరగటానికి ఆమెకు సిగ్గులేదు.

అదే సమయంలో—

"డియర్ క్లారా ఈసారి మీ చెల్లెలు లూసి పేర పాస్‌పోర్టు తీసుకుంటున్నాను" అన్నాడు రఘువీర్ సిగరెట్టు వెలిగిస్తూ. ప్రక్క గదిలో లూసి డాన్స్ మ్యూజిక్ వినిపిస్తుంది.

"అదేమిటి బాస్."

"అవును ఆ పాస్‌పోర్టులో న్యూయార్కు వెళ్ళాలి."

"నేను వెళ్ళను బాస్, భయంగా వుంది."

"ఇది ఆఖరుసారి. చివరసారిగా న్యూయార్క్ వెళ్ళు. బోయిరింగ్ 707 లో నీ ప్రయాణం. నీతోపాటు అదిగో అతను రావచ్చు."

"అతనెవరు బాస్?"

"మన గాంగ్‌కి క్రొత్త మెంబర్ నరేంద్ర."

"మీలా వున్నాడు బాస్" అంది, మిర్రర్‌లోనుండి నరేంద్రను చూసి ఆశ్చర్యపోతూ. "ఎగ్జాట్లి, నీవు, లూసి కవల పిల్లలు ఒకర్ని చూసి ఒకరని భ్రమపడతారు. మీ యిద్దర్నీ నిశితంగా చూస్తే తప్ప పోల్చలేరు. అందుకే నీవు అతనితో న్యూయార్క్ వెళ్ళాలి."

క్లారా క్షణం ఆలోచించి "అలాగే బాస్" అంది లేవబోతూ.

"జెస్ట్ ఏ మినిట్ నీవు నరేంద్ర వున్న లాడ్జిలో కెళ్ళి, సీక్రెట్ పర్సన్ అవునా కాదా? పోలీసులేమయినా

అతన్ని అనుమానిస్తున్నారా గమనించాలి" అన్నాడు సిగరెట్ వెలిగిస్తూ.

"అలాగే బాస్, అవసరమయితే."

"ఎంజాయ్ చెయ్ యాస్ యు లైక్ యిట్" అన్నాడు రఘువీర్ లేస్తూ.

స్టేజిమీద లూసియా రొమ్ముల్ని కదిలిస్తూ ప్రేక్షకుల్ని ఉత్తేజితుల్ని చేస్తోంది. ప్రేక్షకులు వుర్రూతలూగుతున్నారు.

## 2

అది బ్లూరూమ్. గుండ్రని బల్లచుట్టూ ఆరుకుర్చీలు వేయబడి వున్నాయి. ఒక్కొక్కరు వచ్చి కుర్చీలో కూర్చున్నారు. అందరి ముందు ముసుగు వేసుకున్న ఆకారం, కుర్చీలో కూర్చున్నాడు.

"డియర్ ఫ్రండ్స్! మనం ఎంతో శ్రమతో బంగారం వజ్రాలు సాధించాం. కోట్ల కొలది డబ్బు సంపాదించి కోటీశ్వరులం కాబోతున్నాం. అయితే ఈ ప్రయత్నంలో పోలీసులు మనల్ని అనుమానించలేరు. అందుకే మనం న్యూయార్క్ వెళ్ళాలి. కొన్ని రోజులు అక్కడ గడిపి రావాలి."

అందరు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"మీ అనుమానం నాకు తెలుసు. నేను యిక్కడే వుంటానని! కాని నేను మీతోపాటు వచ్చి, మీతో తిరిగి వస్తాను."

"బాస్ మిమ్మల్ని మేము చూడలేదు" లజపతి అడిగాడు.

"యస్" అంటూ ముసుగు తీశాడు.

అతని పేరు రఘువీర్. నరేంద్ర పోలికలున్నాయి. ఒక సారి చూస్తే నరేంద్రని భ్రమపడవచ్చు. "యిప్పుడు మన బంగారం మన ఆరుగురికీ తెలిసిన చోట దాచాలి. ఆరుగురం కలిసే వెళదాం. అయితే ఒకరు, యింకొకరికి తెలిసినట్లు ప్రవర్తించకూడదు. ఈ రాత్రే బోయింగ్ 707లో బయలుదేరుదాం. ఏమయినా అభ్యంతరాలున్నాయా?"

"కాని బాస్, యింత హఠాత్తుగానా!" మేఘశ్యామ్ అన్నాడు.

"పరిస్థితులు అలాంటివి. పోలీసుల దర్యాప్తులో మనం అనుమానితులం కాకూడదు."

"యస్ బాస్! నీవల్లే లక్షాధికారులమయ్యాం, నీవల్లే కోటీశ్వరులమవుతాం. మీ యిష్టాన్ని కాదనేది లేదు" అన్నాడు అనంతం.

"గుడ్! మీతోపాటు నరేంద్ర అనే పేరుతో నేను బోయింగ్ 707లో వస్తాను. మీపైకంటే క్రైమ్‌బ్రాంచి వాళ్ళకు నాపై అనుమానం ఎక్కువ కాబట్టి మీలో ఏ ఒక్కరు నన్ను ప్రశ్నించకూడదు. మాట్లాడకూడదు. మీరేదయినా అడిగినా తెలియనట్లు ప్రవర్తిస్తాను. అది న్యూయార్క్‌లో దిగేవరకు" అన్నాడు రఘువీర్.

"ఓ. కే. బాస్" అన్నారందరూ.

# 3

బ్రీఫ్ కేస్ తీసుకుని నరేంద్ర లేచి బయటకు నడిచాడు. తన నెవరయినా గమనిస్తున్నారేమో చుట్టూ కలయ చూశాడు. లోపల లూసి డాన్స్ జోరుగా సాగుతూనే వుంది.

నరేంద్ర "టాక్సీ" పిలిచాడు. టాక్సీ వచ్చి ఆగింది.

అజంతా లాడ్జికి వెళ్ళాడు.

గబగబ తన గదిలోకి వెళ్ళాడు. రూమ్ తాళం తెరిచాడు.

ఎదురుగా వున్న ఆకారాన్ని చూసి వులిక్కిపడ్డాడు. ఇప్పటివరకు డాన్స్ చేసిన లూసి నగ్నంగా మంచంమీద పడుకొని బ్రాందీ సిప్ చేస్తూ సిగరెట్ వెలిగిస్తోంది.

"ఏమిటి అలా చూస్తున్నావు?"

"ఇంత త్వరగా ఎలా వచ్చావ్?"

"ఈ కార్యక్రమంలో ప్రశ్న లుండవు నరేంద్ర, సమాధానాలు మాత్రమే. బాస్ ఆర్డర్ ఏమిటి?" అడిగింది ఆమె.

నరేంద్ర యింకా తేరుకోలేదు. ఆమె అందాన్నే అణువణువు నిశితంగా చూస్తున్నాడు. ఆమె నవ్వింది. "అందం ఎప్పుడు వుంటుంది, అనుభవం ఎప్పుడయినా లభిస్తుంది. డ్యూటీ ఫస్ట్" అంది కోపంగా.

నరేంద్ర కోటు విప్పి, టై వదులుచేసి "మీ పేరు?"

"క్లారాడయానా" అంది మరో పెగ్ తాగి.

నరేంద్ర కవరు తెరిచాడు. అందులో పాస్‌పోర్టు, తన ఫోటోతోసహా వుంది. ఆశ్చర్యపోయాడు, బాస్ ఎవరో చాలా అగంతకుడు అనుకున్నాడు.

"చాలా కేర్‌ఫుల్‌గా వుండాలి నరేంద్ర. బాస్ ఎముకలు వూడ్చి శవాలు తీసే అఖండుడు. ఏమాత్రమైనా అసమర్థత చూపావా, నీ శవం భగవంతుడికి కూడా కనిపించకపోవచ్చు. యీ బాధ్యతలో ఒక మనిషి పూర్వాపరాలు అవసరం. కేవలం డ్యూటీ, దానికి తగిన ఫలితం వేలలో, లక్షలలో వుంటుంది" క్లారాడయానా హెచ్చరించింది.

నరేంద్ర సిగరెట్ వెలిగించాడు, కవరులో వున్న ఒక లెటరు చదవసాగాడు. క్లారాడయానా చూస్తూంది.

"డియర్ నరేంద్ర,

నీవు మా పార్టీలో చేరడం మాకెంతో ఆనందం. నీవు చదువుకున్నవాడివి కాబట్టి నీవు చేయగలిగింది ఈ ఒక్క సహాయమే. యీ సహాయం చేస్తే మళ్ళీ మాతో చేయి కలపవలసిన అవసరం లేదు. ఆ తరువాత ఎక్కడయినా ఎలాగయినా బ్రతకవచ్చు. నీకు పంపబడ్డ బ్రీఫ్ కేసుతో పాటు ఎయిర్ పోర్ట్‌లో ఒక చిన్న బాక్స్ ఇవ్వబడుతుంది. దాంతో ప్రయాణం చెయ్. నీవు విమానం దిగాక అక్కడ మన మిత్ర బృందం కలుస్తారు. కంటికి రెప్పలా కాపాడతారు. విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్——బాస్."

లెటర్ ముగించి, క్లారా ముఖంలోకి చూశాడు. "బాస్‌ను నీవు చూశావా?"

"చూశాను."

"లెటరుద్వారా నాకేం తెలియలేదు."

క్లారా నవ్వింది. ఫోన్ మ్రోగింది. ఫోనెత్తాడు "హాలో నరేంద్ర! నేను బాస్‌ను మాట్లాడుతున్నాను. నీకు పంపిన లెటరు నీళ్ళలో వేసి చదువు మరికొన్ని అక్షరాలు కనిపిస్తాయి. దానినిబట్టి ప్రవర్తించు. ఈ విషయం నీ ప్రక్కనే వున్న క్లారాకు తెలియకూడదు."

"యస్ బాస్" ఫోన్ పెట్టేశాడు.

కొన్ని నిమిషాల తర్వాత క్లారా వెళ్ళిపోయింది.

నరేంద్ర బాస్ పంపిన లెటరు తడిపి చదివాడు.

"రేపు రాత్రి బోయింగ్ 707 లో న్యూయార్క్ బయలుదేరు. రేపు ఉదయం పోష్టులో కాష్ వస్తుంది.

నీవు బోయింగ్ 707 లో వెళుతున్నావని బయలుదేరే వరకు ఎవరికి తెలియకూడదు."

* * *

బొంబాయి శాంతాక్రజ్ విమానాశ్రయంలో రాత్రి ఎనిమిది ముప్పై ఐదు నిమిషాల సమయం. మెర్క్యురీ లైట్లతో, ట్యూబ్ లైట్స్‌తో అలంకరించిన అందాల భవంతిలా వుంది ఎయిర్‌పోర్టు.

అప్పుడే పారిస్ నుండి వచ్చిన బోయింగ్ 707 రన్ వే పైనుండి, రన్ వే నంబర్ సిక్స్‌లోనికి మళ్ళింది. ప్రయాణీకులు ఒక్కొక్కరే దిగుతున్నారు. ఎనౌన్సుమెంట్ విమానం రాకను సూచిస్తూంది.

అందులోనుండి దిగాడు రాకేష్‌పాండే.

కస్టమ్స్ అధికారులు అందరితోపాటు రాకేష్‌పాండేని చెక్ చేశారు. "దిస్ యీజ్ స్మగుల్డ్ క్లాత్" అన్నాడు కస్టమ్స్ అధికారి. పాండేను వెంటనే మరో రూంలోనికి తీసుకువెళ్ళారు. బట్టల్ని విప్పి తనిఖీ చేస్తున్నారు. శాప్, స్టిక్, బూట్స్ అన్నీ చూశారు.

బెల్ట్ బరువుగా వుంది. పైగా స్టిచ్ చేయబడి వుంది కుట్లు బ్లేడుతో కోసి చూశారు. లోపల పొడవయిన బంగారపు రేకు, పెన్ దాగున్నాయి. కాని అందులో విలువయిన వజ్రాలున్నాయి.

"యూ ఆర్ అండర్ అరెస్టు మిస్టర్ పాండే" అన్నాడు కస్టమ్స్ ఆఫీసర్ క్రయింబ్రాంచి సర్కిల్ ఇన్‌స్పెక్టర్ జాన్‌సన్‌కు ఫోన్ చేస్తూ.

## 4

రాత్రి ఎనిమిది గంటలయింది.

నరేంద్ర టాక్సి దిగి ఎయిర్‌పోర్టులో ప్రవేశించాడు.

రిజర్వేషన్ కౌంటర్ లోనికి వెళ్ళి పాస్‌పోర్టు మీద స్టాంపు వేయించుకొని బాచ్ నెంబర్ రాయించుకున్నాడు. మరో కౌంటర్ లోనికి వెళ్ళి బోయింగ్ వివరాలు తెలుసుకున్నాడు. జేబులో నుండి పాకెట్ తీసి సిగరెట్ వెలిగించాడు.

రానున్న వ్యక్తి కోసం ఎదురు చూస్తున్నాడు.

జీనియస్ పైలట్ ఆఫీసర్ విజయ్ బ్లూ యూనిఫాం ధరించి హుషారుగా వస్తున్నాడు. ఉత్సాహం గల ముప్పై ఏళ్ళ యువకుడు, సభ్యత, సంస్కారంగల మనిషి. విజయ్ అంటే మిగిలిన పైలెట్ ఆఫీసర్లకు, ఎయిర్ హోస్టెస్‌లకు జలసీ. ప్రక్కగా వచ్చిన ఎయిర్ హోస్టెస్ రాణి 'హలో సర్' అంది పలకరింపుగా.

"హలో...హలో...రాణి" అంటూ భుజంపై చేయి వేసి కాంటీన్ వైపు దారి తీశాడు. "లీడింగ్ ఎయిర్ హోస్టెస్‌లు ఎవరు?"

"నేను మెర్సి, జనీస్."

"ఓ. గుడ్ గర్ల్స్..." అని "టు పాం పెన్" అన్నాడు.

"మీ సైడ్ పైలెట్ ఎవరు?"

"కుమార్, మైడియర్ ఫ్రెండ్."

"జర్నీ చాలా జలసీగా వుంటుందన్నమాట" అంది నవ్వి.

అదే సమయంలో___

పోర్టికోలో ఒక కారులో రఘువీర్ కూర్చున్నాడు. అతని ప్రక్కనే పాణి కూర్చున్నాడు. రఘువీర్ బాక్స్ తెరిచాడు "యిది స్విచ్. నీవు నరేంద్రకు యిచ్చేటప్పుడు, నరేంద్ర చూడకుండా యీ స్విచ్ నొక్కి యివ్వు.

లెక్క ప్రకారం విమానం బయలుదేరిన తొంభై నిమిషా లకు యీ బాంబు పేలుతుంది. విమానం బయలుదేరిన రెండు గంటల తరువాత యీ పెట్టె తెరిచి వివరాలు తెలుసు కోమను. ఈ లోపు యిది తెరవకూడదు అని చెప్పాలి. ఇక నీవు వెళ్ళు" అన్నాడు రఘువీర్.

పాణి కారు దిగాడు. రఘువీర్ కారు కదిలి వెళ్ళి పోయింది.

పాణి మెల్లగా లోపలకు వచ్చాడు.

అతని చేతిలో చిన్న పెట్టె వుంది. అందులో టైం బాంబు వుంది.

మెల్లగా నరేంద్ర దగ్గరకు నడిచాడు. "విష్ యు బెస్ట్ ఆఫ్ లక్ డియర్ నరేంద్ర" వత్తి పలికాడు.

"థేంక్స్" అన్నాడు నరేంద్ర.

"డియర్ నరేంద్ర, యీ ప్రయాణంలో బాస్ నీకు పది వేలు యిచ్చారు" అని కాష్ అందించాడు.

"ఇది చాలా తేలికయింది. జాగ్రత్తతో కూడింది' నీవు విమానం ఎక్కాక రెండు గంటల తరువాత యీ పెట్టె తెరచి చూడవచ్చు. పద్ధతులన్నీ యిందులో వున్నాయి. ఏ క్రైంబ్రాంచి వ్యక్తి నిన్ను అరెస్టు చేయడు. చేయ లేడు. అలాంటి భయాలు నీకేం లేవు. అక్కడ నువ్వు విమానం దిగాక, మన సిబ్బంది చాలా వుంది. అందరు నీతో సహకరిస్తారు. విమానంలో నీతో ఎవరు ఏ విధంగా మాట్లా డినా సమాధానం చెప్పవద్దు. నీతోపాటు మన గాంగ్‌లో ఓ అమ్మాయి ప్రయాణం చేస్తుంది. ఆమె రహస్యంగా ఎవరితో మాట్లాడినా, ఆమెను రహస్యంగా ఎవరు ఏదడి గినా నీకు తెలుస్తుంది. నీ విషయం కూడా అంతే" అన్నాడు పాణి.

నరేంద్ర మౌనంగా వింటున్నాడు.

"హియర్ ఈజ్ ఎన్ ఎనౌన్స్‌మెంట్ బోయింగ్ 707 పాసింజర్స్ ప్లీజ్ చెకప్ యువర్ పాస్‌పోర్ట్ బిఫోర్ జర్నీ" మైకు నుండి మాటలు వినిపించాయి.

ఎయిర్‌పోర్టు కోలాహలంగా వుంది. వెళ్ళే ప్రయాణీకులకు వీడ్కోలు యివ్వటానికి ఎందరో మిత్ర బృందం బంధువులతో సందడిగా వుంది. రఘువీర్ ముఠాలోని అనంతం, లజపతి, మహావీర్, మేఘశ్యామ్, కీర్తికాంత్ ఒక్కొక్కరు ఎయిర్‌పోర్టులో నిలబడి మార్చి మార్చి నరేంద్రను చూస్తూ, అతనే బాస్ అని భ్రమపడుతున్నారు.

"షాంపేన్ తీసుకుందాం" అంటూ పాణి కాంటీన్ వైపు దారి తీశాడు. నరేంద్ర అనుసరించాడు.

పావుగంట గడిచింది—

"హియర్ ఈజ్ ఏన్ ఇంపార్టెంట్ ఎనౌన్స్‌మెంట్ ది పాసింజర్స్ టు న్యూయార్క్ కేచ్ ది ఫ్లైట్ బోయింగ్ 707. రన్‌వె నెంబర్ త్రి" మైకులో ఎనౌన్స్‌మెంట్ వినిపించింది.

పాణి స్విచ్ నొక్కి నరేంద్రకు టైంబాంబు అందించాడు.

ఒక్కొక్కరే బోయింగ్ 707 లోనికి ప్రవేశిస్తున్నారు—ప్రొఫెసర్స్, స్టూడెంట్సు, యాక్టర్స్ రకరకాల మనుషులు ఎక్కుతున్నారు. ఎయిర్‌హోస్టెస్ రాణి ఒకొక్కరి పాస్‌పోర్టు చూసిలోపలికి పంపుతుంది. నరేంద్ర అందరితోపాటు లోపలకు ఎక్కి సీటులో కూర్చున్నాడు.

తన ఎడమప్రక్క ఓ యువతి. ఉలిక్కిపడ్డాడు.

'క్లారా' అన్నాడు మెల్లిగా. "నో లూసి" అంది నవ్వి. నరేంద్ర శాస్త్ర ఆలోచించాడు. క్లారా, లూసి యిద్దరు కవల పిల్లలని తీర్మానించుకున్నాడు. కుడివైపు ముసలి వ్యక్తి ప్రొఫెసర్‌లా వున్నాడు. ఏదో అడిగాడు. నరేంద్ర సమాధానం చెప్పాడు.

డోర్ మూసి సీల్ తిప్పారు.

మొత్తం తొంభై ఆరుగురు పాసింజర్స్.

పైలెట్ విజయ్ యూనిఫాం తీసి డ్రైవింగ్ సీటులో కూర్చున్నాడు. కంట్రోల్ రూమునుండి కాషన్‌కి ఎదురు చూస్తూ సెకండ్ పైలెట్ కుమార్‌తో మాట్లాడుతున్నాడు.

టైము చూశాడు. తొమ్మిది పదిహేను నిమిషాలయింది. కంట్రోల్ స్టేషన్‌నుండి కాషన్ వినిపించింది.

స్టార్ట్ చేశాడు. క్లచ్‌ని బలంగా ముందుకి తీస్తూ స్టీరింగ్‌ను తిప్పుతూ రన్‌వే త్రి నుండి మెల్లగా మెయిన్ రన్‌వే మీదకు వచ్చింది. వేగం హెచ్చింది. ప్లెయిన్ షేక్ అవుతూ వుంటే ప్రయాణీకులందరూ కదులుతూ వున్నారు. రన్‌వే లైట్ల మధ్యగా దూసుకుపోతుంది విమానం. కొన్ని క్షణాల తరువాత 'టచ్ అప్' కంట్రోల్ కాషన్ వినిపించింది. స్టీరింగ్ పట్టుకొని బలంగా వెనుకకు లాగారు. నేలమీద పరుగుతీసిన విమానం గాలిలోకి ఎగిరిపోయింది. షేక్ అవటం ఆగిపోవటంతో ప్రయాణీకులు తాపీగా కూర్చున్నారు. చక్రాలు ముడుచుకుపోయాయి. ప్రయాణీకులు కిటికీలలో నుండి బయటకు చూస్తున్నారు.

ఆకాశంనిండా వున్న చుక్కలు, నేలమీద ప్రతిబింబిస్తున్నట్లున్నాయి నగరపు విద్యుద్దీపాలు. నగరం దూరమై పోయింది.

# 5

నోట్లో సిగర్ వెలిగిస్తూ ఆలోచిస్తున్నాడు రఘువీర్.

రఘువీర్ వయసు నలభైకి పైగా వుంటుంది. నల్లగా దృఢకాయంలాంటి శరీరం, ఎయిర్ కండిషన్‌లో పెంచటం చేత కాస్త మెరపు కలిగి వుంది. బ్రాందీ విస్కీలతో ఖరీదయిన కోడి పలావులతో పెంచిన దృఢమయిన ఆకారం, ఖద్దరు ధరించిన ప్రజానాయకుడులా వుంటాడు. అతని యింపాలా కారు చూస్తే గవర్నరుదేమో అనిపిస్తుంది. అతను అందులో ప్రయాణం చేస్తుంటే ముఖ్యమంత్రి విజిట్ చేస్తున్నట్లు భ్రమపడతారు.

ఫోన్ మ్రోగింది. రిసీవర్ ఎత్తాడు. "హలో రఘువీర్ స్పీకింగ్."

"యస్, బాస్ నరేంద్రకు బాక్స్ యిచ్చాను."

"గుడ్. ప్లెయిన్ బయలుదేరిందా?"

"యస్ బాస్. బయలుదేరింది. నరేంద్రతో పాటు మన నాయకులు ఐదుగురు వున్నారు. క్లారా కూడా వుంది."

"గుడ్. నీవు నరేంద్రకు టైంబాంబు ఇచ్చినట్లు ఎవరయినా అనుమానించారా?"

"లేదు బాస్. ఖచ్చితంగా తొంభై నిమిషాలలో ఆ బాంబు పేలుతుంది. అందులో సందేహం లేదు."

"కంగ్రాచ్యులేషన్స్ మిస్టర్ పాణీ. నీవు వెంటనే గౌహాతి సెంటర్‌లో సుభాంజలి స్ట్రీట్‌లో వున్న ఇంటికి రా" ఫోన్ పెట్టేశాడు రఘువీర్.

ద్వారందగ్గర నిలబడింది క్లారాడయనా. తన సంభాషణ విందేమో క్షణం అనుమానించాడు. అయినా పెదవులపై నవ్వు తెచ్చుకుంటూ "ఏమిటి లూసీ, అక్కడే నిలబడ్డావు?" అన్నాడు నవ్వి.

"నా పేరుతో మా అక్కను న్యూయార్క్ పంపారా?"

"అవును. చాలా అవసరంగా. డియర్ లూసి."

"కారణం?"

రఘువీర్ సొరుగు తీశాడు. రూపాయలకట్ట అది.

"ఇక్కడ కార్యక్రమాలేగాని, కారణా లుండవు లూసి. ఇవిగో పదివేలు నీకు ఇష్టమయిన జాక్‌పాట్, నీ ప్రియమయిన రేసుగుర్రాలు బ్లూ మూన్, మిక్కీ మౌస్, రెయిన్‌బో, బ్లాక్ డైమెండ్ పాల్గొంటున్నాయి" అంటూ అందించాడు. లూసి నవ్వుతూ అందుకుంది.

లూసియా, క్లారాడయానా అక్కచెల్లెళ్ళు. క్లారా డయానా రఘువీర్ పర్సనల్ సెక్రటరీగా వుంటూ రఘువీర్ బిజినెస్ వ్యవహారాలు చూస్తూ విదేశాలు తిరిగి వస్తుంది.

లూసియా క్లబ్ డాన్సర్‌గా వుంటుంది. క్లారాని క్రితం సారి కస్టమ్స్ అధికారులు అనుమానించారు. అందుకే పాస్‌పోర్టు రాలేదు. అందుకే లూసియా పేర పాస్‌పోర్ట్‌ను తెప్పించి క్లారాను పంపాడు. క్లారా ఇందులో ఏదో కుట్ర వుందనుకొని లూసినే పంపించి, తను లూసిగా ఇక్కడే వుంది.

ఆ విషయం రఘువీర్‌కి తెలీదు. విమానంలో వున్నది క్లారా అని తన రహస్యాలు అంతటితో అంతమవుతాయను కున్నాడు.

# 6

గౌహాతి సెంటరులో సుభాంజలి స్ట్రీట్‌లో లూలు పేలస్ అది.

లూలు మిస్ ఇండియా కాంపిటీషన్‌లో సెలక్టయి ఆరోగ్యం సరిగా లేకపోవటంతో పాల్గొనలేదు. పాల్గొంటే

తనకే బహుమతి వస్తుందని ఆమె అభిప్రాయం. ఆమె ప్రస్తుతం రఘువీర్ చేతిలో సిగరెట్టు ముక్క.

"డార్లింగ్ లూలు. ఈవేళ నాకు చాలా శుభదినం. ఈ శుభ సమయంలో నీవు ఏమడిగానా ఇస్తాను," అన్నాడు బిగియార కౌగలించుకొని.

బెల్‌బాటమ్ పాంట్, బ్రా షర్ట్ వేసుకున్న లూలు, వదులు తల అరచేతి వెడల్పు అద్దాలు, పెదవుల లిప్‌స్టిక్ మనోహరంగా వుంటుంది. ఎదిగిన రొమ్ములు, ఎత్తైన పిరుదలు.

క్లారాడయానా కిటికీలో నుండి చూస్తోంది. ఏం మాట్లాడుతున్నదో వింటోంది. క్లారాడయానాకు తెలుసు. రఘువీర్ ఎప్పుడు ఎక్కడ వుంటాడో ఎప్పుడు ఎవర్ని వదిలేస్తాడో.

"ఏమిటి డార్లింగ్ అంత శుభవార్త?"

"మన పార్టీ ఎందరు ఐమిాన్ ఎందరం కలసి యీ పథకంలో లక్షలు విలువచేసే బంగారం, కోట్లకు పైగా విలువగల వజ్రాలు సాధించాం."

"మొత్తం ఆరుగురు, మీరు గాక ఐదుగురు."

"గుడ్. రేపు వాళ్ళు వుండరు."

"అంటే?" ప్రశ్నార్థకంగా చూసింది.

"అవును డార్లింగ్! బోయింగ్ 707 లో అందరూ ప్రయాణం చేస్తున్నారు. అందరితోపాటు నా రహస్యాలు తెల్సిన క్లారా కూడా వుంది. వీరంతా సముద్రం పాలవుతారు."

"సరిగ్గా చెప్పు డార్లింగ్."

"యస్ బోయింగ్ 707 లో టైంబాంబు పెట్టాము. అది తెలియకుండా నరేంద్ర దగ్గరే వుంది. అది బొంబై

నిమిషాలలో పేలుతుంది. విమానం, విమానంతో పాటు అందరు సముద్రం పాలు. బంగారం వజ్రాలు మన పాలు. ఎలా వుంది మన ప్లాను.''

''ఓ, డార్లింగ్ నీదెంత జీనియస్ మైండ్.''

''అవును నీలాంటి అందాలరాశిని అందుకోంటే ఐడియా లొస్తాయి.''

''అవును డార్లింగ్ నీవు లేకుండా వాళ్ళంతా బోయింగ్‌లో ఎలా వెళుతున్నారు? నీవు బంగారం, వజ్రాలు తీసుకుంటావని తెలీదా?''

''తెలీదు. ఆఖరు రోజు నేను నరేంద్రలా మేకప్ చేసుకున్నాను. నేను నరేంద్రను ఎన్నుకున్నదే అందుకు. ఇది హిట్లర్ పథకం. బ్లూ రూములో నన్ను చూసిన వాళ్ళు ఆ మసక వెలుతురులో నరేంద్ర నేనని అనుకుంటారు. ఎయిర్‌పోర్ట్‌లో ఎవరు ఎవరితో మాట్లాడరు. ఎవరితో ఎవరు రహస్యంగా మాట్లాడినా అందరికి వినిపిస్తుంది. ప్లెయిన్‌లో నరేంద్రే వాళ్ళ బాస్'' పకాలున నవ్వాడు.
కంగారుగా పరుగెత్తుకు వచ్చాడు పాణి. ''బాస్ పాండే దొరికిపోయాడు. పోలీసులు అతనింటిని సోదా చేయటానికి వస్తున్నారు,''

''అంటే ఇక్కడకు వస్తారా?''

''రావచ్చు. లూలు తమ్ముడని తెలిసిపోయింది'' అంటూ కిటికీ వైపు చూశాడు. ''బాస్, క్లారా!'' రఘువీర్ గబాలున తిరిగాడు.

''శాల్చిపారెయ్ ఇడియట్‌ని'' అరిచాడు క్రోధంగా.
క్లారా గార్డెన్‌లోనుండి ఫౌంటెన్ ప్రక్కగా పారిపోతుంది. పాణి రివాల్వర్ పేల్చాడు. గురి తప్పింది. మళ్ళీ

పేల్చాడు. బుల్లెట్ గుండెల్లో దూసుకుపోవటం విసరినట్లు రోడ్డుమీద పడిపోయింది.

అప్పుడే వచ్చి ఆగిన పోలీస్ జీపులోనుండి ఇన్‌స్పెక్టర్ జాన్సన్, పాణిని పేల్చాడు. పాణి నేలకూలాడు.

గుండెను గుప్పిటితో పట్టుకుంది క్లారా. ఇనస్పెక్టర్ ముఖం లోనికి చూసింది.

పోలీసులు ఇంటిని ముట్టడించారు.

"ఇనస్పెక్టర్... బోయింగ్... 7...0...7...లో" మాట తడబడిపోతూంది కళ్ళవెంట నీరు, ముఖమంతా చెమటలు పోశాయి. ఆయాసంతో బలంగా అంది. "7...0...7 లో టైంబాంబు వుంది... అది... అది" అంటూ ప్రక్కకు ఒరిగిపోయింది. కళ్ళు నోరు తెరిచే వుంది.

ఇనస్పెక్టర్ గుండెలు దడదడలాడాయి. పిలిచాడు పలుకలేదు, స్పృహాలో లేదు.

"బోయింగ్ 707 లో టైంబాంబు" అనే మాట దిక్కులు పిక్కటిల్లేలా వినిపించసాగింది ఇన్‌స్పెక్టర్ జాన్సన్‌కి. భయం, ఆందోళన, కంగారుగా క్లారాను మరో ఇనస్పెక్టర్‌కి అప్పగించి, అరవై మైళ్ళ వేగంతో ఎయిర్‌పోర్టు చేరాడు.

అత్రుతగా ఎయిర్‌పోర్ట్ జనరల్ మేనేజర్ దివ్యేంద్ర రూము లోనికి వెళ్ళాడు.

"సర్. చాలా ప్రమాదకరమయిన పరిస్థితి" తడారి పోయిన గొంతుకతో తడబడుతూ చెపుతున్నాడు.

"ఏమిటది?"

"బోయింగ్ 707 లో టైంబాంబు వుంది."

"వాట్" అదిరిపడ్డాడు.

"అవును సర్. ఆ రహస్యం తెలియనీయకుండా ఓ అమ్మాయిని చంపారు, ఆమె ఇచ్చిన సమాచారం ఇది."

"అది ముందే విమానంలో వుందా? ప్రయాణీకులు ఎవరయినా వెంటతీసుకు వెళ్ళారా" ఆతృతగా అడిగాడు.

"తెలీదు సర్. అప్పటికే ఆమె స్పృహ కోల్పోయింది. ఆమెకు ఇప్పటిలో స్పృహ రాకపోవచ్చు. చచ్చిపోవచ్చు."

"ఐ. సి" అంటూ ఫోన్ రింగ్ చేశాడు. "హలో ఎయిర్ లైన్ ఇంజనీర్ దేవి ప్లెయిన్ని బాగా చెక్ చేశారా? విమాన్ బోయింగ్ 707 లో టైంబాంబు వుందట. మీ చెకింగ్ ఇన్ఫర్మేషన్ ఏమిటి?"

"బోయింగ్ 707 ని అణువణువు చెక్ చేశాం. అలాంటిదేమి ప్లెయిన్లో లేదు," అవతల నుండి వినిపించింది.

వెంటవెంటనే నెంబర్సు డయల్ చేసి ఎయిర్పోర్టుకు సంబంధించిన ముఖ్యమయిన ఆఫీసర్లని పిలిపించాడు.

రిజిర్వేషన్ కౌంటర్ నుండి ప్రయాణికుల పేర్లుగల చార్ట్ తెప్పించాడు. బోయింగ్ ఎన్ని మైళ్ళ దూరం వెళ్ళి వుంటుందో తెలుసుకున్నాడు. అందరూ ఒక్కొక్కరు రూములోనికి వచ్చి కూర్చున్నారు.

ఇనస్పెక్టర్ జాన్సన్ చెప్పిన సమాచారం అందరికి చెప్పాడు.

అందరి ముఖాలు రంగులు మారాయి.

# 7

బోయింగ్ 707 వేగంగా మేఘాలకు పైగా దూసుకుపోతోంది. చుట్టూ శూన్యమయిన చీకటి, ఆ చీకటిలో

అదిరిపడుతున్న నక్షత్రాల గుంపులు, అక్కడక్కడ ఉల్కలు కనిపిస్తున్నాయి. క్రింద పైన శూన్యంగా వుంది. ఆ విమానం ఎక్కడ వుందో? ఎవరికి తెలీదు.

విజయ్ రీడింగ్ చూస్తున్నాడు.

"వాటిజ్ యువర్ పొజిషన్" కంట్రోల్ నుండి ప్రశ్న.

"ఆరువేల ఐదువందల అడుగుల ఎత్తులో వెళుతున్నాము. గంటకి ఐదువందల పాతిక మైళ్ళ వేగం. ఉయ్ ఆర్ ఓ. కె" అన్నాడు. ప్లెయిన్‌ని స్టడీలో వుంచి లోపలకు వచ్చాడు.

ఎయిర్ హోస్టెస్ చాక్‌లెట్సు, బిస్కెట్స్ పాసింజర్స్‌కి అందిస్తూన్నారు. అవసరమయిన వాళ్ళకు సిగరెట్సు ఇస్తూ నవ్వుతున్నారు.

నరేంద్ర, లూసి ప్రక్కప్రక్కనే కూర్చొని లూసి డాన్స్ గురించి మాట్లాడుతున్నాడు.

"హియర్ యీజ్ మెసేజ్ నోట్" కంట్రోల్‌నుండి వచ్చిన మెసేజ్ వింటూ చిన్న పాకెట్ బుక్ తీశాడు అసిస్టెంట్ పైలెట్ కుమార్. "ఎ టైంబాంబ్ ఇన్ ప్లెయిన్. అది ఎవరిదగ్గర వుందో తెలీదు ప్రతి వ్యక్తిని సస్‌పెక్ట్ చేయాలి. మళ్ళీ కొన్ని క్షణాలలో ఫోన్ చేస్తాం. బి కేర్‌ఫుల్" అన్నాడు వర్మ.

కుమార్ ముఖం రంగు మారిపోయింది. గొంతు తడారిపోయింది. ప్రక్కనే కూర్చోబోతున్న విజయ్‌కు అందించాడు సమాచారాన్ని. విజయ్ గుండె గబగబ కొట్టుకుంది. చావు సహజం. తను భయపడడు. కాని తన ప్రయాణీకులు? ఆందోళనగా, ఆతృతగా ఎయిర్‌హోస్టెస్ రాణి చెవిలో రహస్యంగా చెప్పాడు. రాణి భయకంపితురాలయింది.

"భయపడక ఇక్కడ శక్తిసామర్థ్యాలకంటే ధైర్యం కావాలి."

"అలాగే" అంది రాణి.

విజయ్ సిగరెట్ వెలిగించి ఒక్కొక్కరిని నిశితంగా చూస్తూ నడుస్తున్నాడు, వారి బాక్స్‌ల్ని అనుమానంగా చూస్తున్నాడు.

తెలిసి టైంబాంబ్ ఎవరు విమానంలో తేస్తారు. ఇది తమకు తెలియకుండానే తమ బాక్స్‌లో వుండివుండాలి. అలాంటప్పుడు అందరికి చెప్పినా కంగారుపడటం తప్ప ప్రయోజనం లేదు. అటునుండి ఇటు, ఇటునుండి అటు! రెండుసార్లు నడిచాడు. లేని నవ్వు పెదవులమీద ప్రదర్శింప చేసుకుంటూ పాసింజర్స్ ఇబ్బందుల్ని పరామర్శించాడు.

బాంబు ఎప్పుడు? ఎలా పేలుతుందో విజయ్‌కి తెలీదు. ఏ క్షణంలో తన ప్రాణాలు పోతాయో అర్థంకావటం లేదు.

ప్రయాణీకులు కొందరు నిద్రపోతున్నారు, కొందరు చదువుకుంటున్నారు.

లూసి కళ్ళు మూసుకొని నిద్రపోతోంది. నందలాల్ కెమికల్ బుక్ చదువుతున్నాడు. నరేంద్రకు నిద్రరావటం లేదు.

# 8

"మిస్టర్ పాండే, నీవు నేరస్థుడవు కాకపోవచ్చు. అయినా మా దృష్టిలో నేరస్థుడివి, నీవు ఒక్క సహాయం చేస్తే నిన్ను వదిలేస్తాం?" ప్రాధేయపూర్వకంగా అడిగాడు క్రైమ్‌బ్రాంచి ఇన్‌స్పెక్టర్ జాన్సన్.

"ఏమిటా సహాయం?"

"వందమంది ప్రాణాలు నీ చేతుల్లో వున్నాయి. స్వదేశీలు, విదేశీలతో వున్న విమానంలో బాంబు వుంది. అది ఎవరిదగ్గర వుందో తెలియటంలేదు. నీకు హత్యచేయబడ్డ యువతికి సంబంధం వుంది. అలాగే ఆమెకు విమానంలో బాంబుకు సంబంధం వుంది. విమానంలో వాళ్ళను రక్షించాలని తనకు తానే ఆహుతి అయింది. కాబట్టి నీకు గాని, ఆమెకుగాని సంబంధించినవాళ్ళు యీ లిస్టులో వున్నారేమో చూడు," పాసింజర్స్ చార్ట్ అందించాడు.

వరుసగా పేర్లు చూస్తున్న పాండే ఓ చోట ఆగాడు.

ఏదో సందేహిస్తున్నాడనుకుని "మిస్టర్ పాండే! ఈ ఆపదనుండి విమానాన్ని, అందులో అమాయకపు ప్రయాణీకుల్ని రక్షించగలిగితే నీవు నిజంగా నిర్దోషివే. లేదా ఆ విమాన ప్రమాదంతో నీకుకూడా సంబంధం వుందని భ్రమపడాల్సి వస్తుంది."

"ఆ ప్రమాదం తప్పితే విడుదల చేస్తారా?"

"తప్పనిసరిగా."

"హత్యచేయబడ్డ అమ్మాయిలాంటి మరో అమ్మాయి విమానంలో వుండివుండాలి. ఆమె పేరు యిందులో లూసి అని వుంది. కాని క్లారా అనే అమ్మాయి సహజంగా న్యూయార్క్ వెళ్ళి వస్తుంది. వాళ్ళిద్దరు కవలపిల్లలు. రఘువీర్ గాంగ్‌తో వారికి సంబంధం వుంది."

"గుడ్. థాంక్స్ వెరీ మచ్" అన్నాడు దివ్యేంద్ర.

ఫోనెత్తి రింగ్ చేశాడు. "ఈజ్ ఇట్ రిజర్వేషన్ కౌంటర్. లూసి అనే అమ్మాయి బోయింగ్ 707 లో ప్రయాణం చేస్తుందా."

"యస్ సర్."

"ఆమె పాస్‌పోర్ట్ ఫొటోకి, ఆమెకి తేడా వుందా?"

"నో సర్. కానిసైన్ చేసేటప్పుడు కాస్త తొట్రుపడింది. వేలుకు దెబ్బ తగలటంచేత కాస్త మార్పు వచ్చింది అని చెప్పింది." నెంబరు మార్చాడు దివ్యేంద్ర.

"కంట్రోల్ స్టేషన్ బోయింగ్ 707 లో లూసి అనే అమ్మాయి దగ్గర బాంబు వుంది. చెక్ చేయమను," అన్నాడు దివ్యేంద్ర.

కంట్రోల్‌నుండి బోయింగ్ 707 కి మెసేజ్ పంపబడింది.

మెసేజ్ అందుకున్నాడు విజయ్.

# 9

"రాణి చెక్ ది 26 నెంబరు సీట్ లూసి" అన్నాడు విజయ్.

రాణి ఆతృతగా వెళ్ళి లూస్‌ని పిలచింది పైలెట్ ఆఫీసర్ రమ్మంటున్నారని. లూసి నరేంద్రను ఒకసారి చూసి లోపలకు నడిచింది.

"మీ దగ్గర టైం బాంబు వుందా?" విజయ్ ప్రశ్నించాడు ఆమె ముఖంలోనికి చూస్తూ. లూసి చకితురాలయింది. "మిస్ లూసి మీకు తెలియకుండా మీ దగ్గర టైం బాంబు వుండవచ్చు."

"నన్నే ప్రత్యేకంగా ఎందుకు పిలిచారు?"

"కారణాలు తెలియవు. శాంతక్రూజ్ కంట్రోల్ స్టేషన్‌నుండి చెప్పిన మెసేజ్ యిది. మీ ఆర్టికల్స్ చెక్ చెయ్యాలి."

"నాకేం తెలియదు" చివాలున వెనుతిరిగి వెళ్ళిపోయింది.

విజయ్‌కు మతి పోయినట్లయింది. అలా వెళ్ళిన లూసి నరేంద్రను చూస్తూ బాత్ రూములోనికి నడిచింది. రాణి అనుసరించింది. క్షణాలు, నిమిషాలు గడుస్తున్నాయి. రాణి ద్వారం దగ్గరే వుంది. కొన్ని నిమిషాల తరువాత లూసి విసురుగా వస్తూ రాణి చేతిలో మడిచిన కాగితం పెట్టింది. అది యెవరూ చూడలేదు.

ఆ కాగితంతో విజయ్ దగ్గరికొచ్చింది రాణి.

"సారి సార్,

నేను అబద్ధం చెప్పాను. ఈ ప్లెయిన్‌లో ఒక స్మగులింగ్ ముఠాకి చెందిన ఆరుగురున్నారు. వాళ్ళు ఎవరో వాళ్ళ పేర్లు నాకు తెలియవు. వాళ్ళలో ఎవరిదగ్గర టైం బాంబు వుందో తెలీదు. నేను మీతో ఏం మాట్లాడినా ఆ ఆరుగురికి వినిపిస్తుంది. అందుకే మాట్లాడలేదు. వాళ్ళను తెలుసుకోండి."

విజయ్ డ్రైవింగ్ రూమునుండి బయటకు వచ్చాడు' "డియర్ ఫ్రండ్స్ యిది చాలా ప్రమాదకరమయిన పరిస్థితి" అందరు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఆందోళనగా, భయంగా చూశారు. "ఈ ప్లెయిన్‌లో టైం బాంబుంది" చెప్పటం ఆపాడు.

కంగారు, కోలాహలం, అరపులు గోలయిపోయింది. రొదలు ఆరంభమయ్యాయి. "ప్లీజ్ సైలెన్స్" గట్టిగా అరిచాడు. "చూడండి, మన ప్రయాణీకులు కావాలని టైంబాంబు తెచ్చివుండరు. ఎవరి విద్రోహ చర్యలవల్లో బాంబు యీ విమానంలోనికి తేబడింది. ఇక్కడ బాంబు పేలితే ఏ ఒక్కరూ బ్రతకరు. కాబట్టి మీ మీ సామానులు చెక్ చేసుకొని, బాంబు వుందేమో చూడండి," విజయ్ వినయంగా విశదీకరించాడు.

అందరు తమ తమ బాక్సులు తెరిచి కంగారుగా వెదకసాగారు.

నరేంద్ర బాక్స్ వెతికినట్లు నటించాడు. రెండో బాక్స్ వెతకలేదు.

విమానం మబ్బులమీదుగా చుక్కల్లోనికి దూసుకుపో తుంది. అందరి గుండెల్లో ఒకటే అదురు, భయం, వణకు.

కొందరు దేవుడ్ని స్మరిస్తున్నారు. కొందరు బంధువుల్ని తలచుకుంటున్నారు. కొందరు బయటకు పారిపోవా లనుకుంటున్నారు.

నరేంద్రలో ఎన్నో సందేహాలు ప్రారంభమయ్యాయి.

తనదగ్గర పెట్టెలో వున్నది ఏమిటి? తనదగ్గర వున్నది టైంబాంబయి వుంటుందా? ఈ విషయం ఎవరు చెప్పి వుంటారు? తనకు టైంబాంబు యిచ్చి ప్లెయిన్ ఎందుకు కూల్చాలనుకుంటాడు? దీని వెనకేదయినా నాకు తెలియని కుట్ర వున్నదా? ఎయిర్‌పోర్టులో యిచ్చిన పెట్టెలో ఏముంది?

ప్రయాణికుల రణగొణ ధ్వని, బెంబేలు పడుతున్న మాటల ఘోష, బ్రతికిపోవాలనే ఆరాటం, తాపత్రయం. విమానంలో వున్న అందరి గుండెల్లో విమానాలు పరుగెడు తున్నాయి.

లూసి హతాశురాలయింది. చిన్నపిల్లాడు తల్లి డీలాపడి పోయింది. మాజీమంత్రి చేసిన పాపాలకు క్షమాపణ భగవంతుడ్ని వేడుకొంటున్నాడు, తన ప్రాణాల్ని కాపాడ మని మరోసారి చంపుకోమని ఒక పారిశ్రామిక వేత్త దేవుడ్ని ఆరాధిస్తున్నాడు.

ఎయిర్ హోస్టెస్ రాణి ఒకవైపు భయంగా వున్నా మరోవైపు ప్రయాణికుల దుస్థితికి జాలిపడుతూ వుంది.

పసివాడు మాత్రం మురిపెంగా నవ్వుతున్నాడు.

పైలెట్ విజయ్ అందరివైపు చూసి "డియర్ పాసింజర్స్ యిప్పుడు మీకొక చక్కని సన్నివేశం చెపుతాను. బైబులులో కథ యిది. భగవంతుడు యోనా అనే వ్యక్తికి నీనెవె పట్టణం నాశనం కాకుండా చూడమని పంపుతాడు. కాని యోనా ఆ వూరి ప్రజలకు భయపడి మరో వూరికి ఓ ఓడలో ప్రయాణమవుతాడు. భగవంతుడు ఆగ్రహంతో సముద్రంమీద భయంకరమయిన తుఫాను సృష్టిస్తాడు. ఆ తుఫానుకు భయపడి అందరు చనిపోతారని తీర్మానించుకున్న ఓడ నావికుడు భగవంతుడ్ని ప్రార్థించుకొమ్మంటాడు. అందరూ దేవుడ్ని స్మరిస్తారు.

యోనామాత్రం ఓడ అడుగున నిద్రపోతూ వుంటాడు. నావికుడు అతన్ని లేపి నీవు ప్రార్థించు కనికరిస్తాడేమో భగవంతుడు అంటాడు. వారిలో ఒకరు ఎవరినిబట్టి యీ కీడు సంబంధించిందో తెలుసుకొనటానికి లాటరీ చీట్లు వేస్తారు. ఆ చీటి యోనా మీదికి వస్తుంది. అందరు యోనాని అడుగుతారు.

యోనా తన చరిత్ర చెప్పి, యీ తుఫానుకు కారణం నేనే, నన్ను సముద్రంలో వేయండి అంటాడు. వేస్తారు. తుఫాను ఆగిపోతుంది.

యోనాను ఓ చేప మింగి నీనెవె పట్టణంలో కక్కుతుంది. యోనా బ్రతికి నీనెవె పట్టణ ప్రజలకు బోధిస్తాడు. ఇప్పుడు మనలో ఒక యోనా వున్నాడు. మన చుట్టు తుఫాను వుంది. ఒక వ్యక్తివల్ల ఎందరు అమాయకులు నామరూపాలు లేకుండా పోతారో ఆలోచించండి."

నరేంద్ర ఆలోచన లేకుండా గబాలున పెట్టె తెరిచాడు.

ఎట్టి పరిస్థితిలో రెండు గంటల్లోపు తెరవద్దన్న పెట్టి, బాస్ ఆజ్ఞ మీరితే ప్రాణాలు పోయినట్లే, అయినా సరే తెరిచాడు.

లోపల ముళ్ళు తిరుగుతోంది. నుదురు చిట్లించాడు. లూసి చూసింది. మరో వ్యక్తి, యింకో వ్యక్తి అందరు చూసి కొందరు 'టైం బాంబు' అని అరిచారు. పైలెట్ విజయ్ గబాలున అందుకున్నాడు.

బాంబు పేలటానికి తొంభై సెకన్లమాత్రం వుంది.

విజయ్ చేతులు వణుకుతున్నాయి. ఆ బాంబును ఏం చేయాలి? బయటకు విసరాలి, దాదాపు ఆరువేల అడుగుల ఎత్తులో వెళుతున్న విమానం, ఆరువందల పాతిక మైళ్ళ వేగంతో పోతుంది. డోర్ తెరిస్తే ప్రయాణికులు ఎలా అవుతారో. లోపల కాగితాలు, బట్టలు అల్లకల్లోలం అవుతాయి. ఆక్సిజన్ లోపిస్తుంది. విపరీతమయిన చలి వీస్తుంది.

ఇవన్నీ ప్రయాణికులకు తెలీదు. 'బయటకు విసురు' అరుస్తున్నారు.

విజయ ఉపేక్షించలేదు. ఆతృతగా డోర్ దగ్గరకు నడిచాడు. రెండు బెల్టులు తీసి నడుంకి చేతులకు కట్టుకున్నాడు. డోర్ చక్రం తిప్పాడు.

ఇంకా యిరవై సెకన్లమాత్రం వుంది.

టైంబాంబు విసరలేదు. అందుకే డోర్ దగ్గర క్రింద పెట్టాడు, ప్రయాణికులకు కాషన్ యిచ్చాడు. అందరు కోడిపెట్ట రెక్కల క్రింద కోడిపిల్లల్లా, బండక్రింద కప్పల్లా ఒదిగి, బిగుసుకుపోయారు.

తలుపు తెరిచాడు. రఁయ్‌మంటున్న గాలి తెర.

హోరుమంటూ భయంకరమయిన గాలి లోపలకి ప్రవేశించింది. ఆరువందల మైళ్ళ వేగంతో లోపలకు ప్రవేశించిన

గాలికి విమానం అటు యిటు జరిగింది.

విజయ్ తూలి వెనక్కు పడ్డాడు. గాలి విసురుకు ముందుకు వంగలేక పోతున్నాడు. విమానం అటు యిటు వూగుతోంది. టైంబాంబు సమయం దగ్గరయిపోతోంది.

విజయ్ చటుక్కున బోర్ల పడుకొని టైంబాంబు దగ్గరకు జరిగి, గభాలున తన్నాడు.

టైంబాంబ్ ఆ దెబ్బతో డోర్‌గుండా బయటకు పడి పోయింది. మరుక్షణంలో 'ఢాం' మని పేలింది. కాని విధి వశాత్తు బాంబ్‌లో చిన్నముక్క విమానం కిటికీ పగల గొట్టి, పై సీలింగ్‌కు తగిలింది.

దాంతో గాలి మరింత విజృంభించింది. ఆ విజృంభణకు విమానం వూగిపోయింది. ఆ వూగటంలో విజయ్ డోర్ నుండి విసిరినట్లు బయటకు పడిపోయాడు. కాని బెల్టులు వుండటంచేత వేలాడుతున్నాడు.

విమానం బాగా షేక్ అవటంతో వింగ్స్ క్రిందకి పైకి వూగాయి. కుమార్ కుడివైపు భుజానికి వున్న క్లిప్ తెగి పోయింది. కుమార్ తూలి ప్రక్కకు పడిపోయాడు. అలా పడటంతో వైర్స్ పైన కుమార్ చేతులు పడ్డాయి. స్టీరింగ్ రాడ్‌కి తల తగిలింది. స్పృహ కోల్పోయాడు.

కిటికీలోనుండి హోరుమంటున్న గాలి భయంకరంగా వస్తుంది. విమానం చల్లబడిపోతుంది.

డ్రైవింగ్ లేని విమానం వింగ్స్ అటు యిటు కదులుతూ, వూగుతూ నేలకు ముఖంపెట్టి వచ్చేస్తుంది. నేలకు వస్తున్న విమానం డోర్ బయట ఉరేసిన శవంలా విజయ్ వేలాడుతున్నాడు. క్రింద మేఘాలు దగ్గరవుతున్నాయి.

విమానం దిశ మారిపోయింది.

రాణి అతి ప్రయత్నంమీద పైలెట్స్ రూములోనికి

వెళ్ళింది. కుమార్ స్పృహలో లేదు. విమానం యిలాగే వెళ్ళితే కొన్ని నిమిషాలలో నేలను ఢీకొంటుంది. ప్రయాణీకులు బెంబేలు పడుతున్నారు.

క్షణాలు, నిమిషాలు జరుగుతున్నాయి.

# 10

క్రిందకు దూసుకువస్తున్న విమానం ద్వారం బయట వేలాడుతున్నాడు విజయ్. రాణి ఆక్సిజన్ స్విచ్ నొక్కింది. ప్రయాణికులందరికి ఆక్సిజన్ ట్యూబ్స్ వచ్చాయి. అందరు ముక్కులకు తగిలించుకున్నారు. తగిలించుకోనేటందుకు శక్తి లేనివారికి తగిలించారు.

నరేంద్రకు అంతా మాయగా కలగా వుంది. తనవల్లే యింత ఘోరం జరిగినందుకు కుమిలిపోయాడు. విమానంలో తూలుతూ పడుతూ ఆత్రతగా వెళ్ళి రెండు ట్రేలు తీసుకొని పగిలిన అద్దం ఖాళీలో యిరికించాడు. అలా యిరికించినపుడు వేళ్ళు కోసుకుపోయాయి. గాలి హోరు తగ్గింది. విమానం క్రిందకు వెళ్ళిపోతోంది. అలా వెళ్ళిపోతే ఏ కొండకో ఢీకొంటుంది.

గబగబ పైలట్ రూములోనికి వెళ్ళి స్టీరింగ్ బాగా వెనుకకు లాగాడు. విమానం మెల్లగా పైకి లేచింది. ఇంకా ఏం చేయాలో తనకు తెలీదు. అదయినా తన క్లాస్ మెట్ సంభాషణలో విమానం డ్రైవింగ్ గురించి చెప్పిన గుర్తు.

డోర్ దగ్గరకు వచ్చాడు. డోర్ బయటకు వుంది బెల్ట్. తను ఒక బెల్ట్ నడుముకు తగిలించుకున్నాడు. డోర్ కొద్దిగా తెరచి, విజయ్‌ను పైకి లాగాడు. ఎంతో ప్రయత్నంమీద పైవరకు వచ్చాడు. తలుపు తెరపందే విజయ్

రాదు. తలుపు తెరిస్తే సుడిగాలి లోపలకు వస్తుంది. అప్పటికే శ్వాస పీల్చటం కష్టమవుతోంది. తను నడుంని డోర్ విల్ కి కట్టి డోర్ తెరచి విజయ్‌ను లోపలకు లాగాడు. విమానం కుడివైపుకు వంగటంతో డోర్ బలంగా పడిపోయింది. డోర్ వీల్ గబగబ తిప్పాడు.

విజయ్ స్పృహలో లేడు, నాడి అందటంలేదు.

ఎయిర్‌లైన్స్ డాక్టర్ విజయ్‌కి కోరమిన్ ఇంజక్షన్ చేశాడు. చేతులు కాళ్ళు చల్లబడిపోయినపుడు వాటిలో వేడి పుట్టించటానికి అలా చేస్తారు. బెల్టు విప్పి కరెంట్ షాక్ లాంటిది యిచ్చారు. రాణి కంగారుగా చూస్తుంది. డాక్టర్ హార్ట్ బీటింగ్ చూస్తున్నాడు.

నరేంద్ర మరోసారి పైలెట్ రూములోనికి వెళ్ళాడు. స్టీరింగ్ మళ్ళీ పైకి లాగుతుండగా కుమార్ కాస్త కదిలి తల విదిలించాడు.

మూడువేల అడుగుల డౌన్‌లో వుంది విమానం, ఏడు వందల మైళ్ళ వేగంతో పోతుంది. ఇదే వేగం కొన్ని నిమిషాలు కంటిన్యూ అయితే హీట్ వల్ల ప్రొపెల్లర్స్‌లో మంటలు ప్రారంభమయ్యేవి.

నరేంద్రను చూసి "థాంక్స్" అన్నాడు స్టడీ అవుతూ. అయితే కంట్రోల్ రూమ్‌నుండి మెసేజ్ వినిపించటం లేదు.

చుట్టూ అంధకారం, పైన చుక్కలు, క్రింద మబ్బులు తప్ప ఏం కనిపించటం లేదు.

ఆ మబ్బులలో కొండలు వున్నాయో మరేదయినా విమానం ఎదురువస్తుందో, విమానం ఎక్కడుందో తెలియటం లేదు. ఇలా ఎంతదూరం ప్రయాణం సాగించాలో

అది తెలీదు. చీకటిలో విసిరిన రాయిలా వెళ్ళిపోతుంది విమానం.

కుమార్ విమానాన్ని విధిగా క్రిందగా పోనివ్వాల్సి వచ్చింది. లోపలవున్న మంచులాంటి గాలి పోవాలంటే, ప్రయాణికులు సరైన ఆక్సిజన్ పీల్చాలనుకుంటే రెండు వేల అడుగుల క్రింద వెళ్ళాలి. అలా వెళ్ళటం జరిగితే విమానం ఏ కొండకయినా ఢీకొనవచ్చు.

రాణి వచ్చింది "విజయ్ ఎలా వున్నారు?"

"ఫర్వాలేదు, త్వరలో స్పృహ రావచ్చు."

కొన్ని నిమిషాల తర్వాత విజయ్‌కు స్పృహ వచ్చి కళ్ళు తెరిచాడు.

విమానమంతా చల్లగా ఐపోయింది. మంచులో పాతేసినట్లు ప్రయాణీకులంతా వణికిపోతున్నారు. స్టీమ్‌స్విచ్ వేశాడు విజయ్. విమానంలో గాలి వేడిగా రాసాగింది.

ప్రతిఒక్కరికి బ్రాంది ఒక పెగ్ యిచ్చారు. కొందరు సిగరెట్లు వెలిగించారు. కొందరు ఆక్సిజన్ పీలుస్తున్నారు.

విజయ్ ముందు భాగంలోకి వచ్చాడు.

కంట్రోల్ నుండి మెసేజ్ లేదు. విమానం ఎక్కడికి పోతుందో అంతు పట్టటం లేదు. వేగం తగ్గించాడు.

ఉన్నట్టుండి "హలో బోయింగ్ 707...707...707" కంట్రోల్ నుండి వినిపించసాగింది.

"యస్ రిసీవింగ్ మెసేజ్."

"టచ్ అప్ వెయ్యి అడుగులు పైగా విమానం నడపండి క్విక్."

విమానంలో విజయ్ గభాలున స్టీరింగ్ లాగాడు. విమానం పక్షిలా పైకి దూసుకుపోతుంది. మేఘాలు తేలి

నాయి. ఎదురుగా నల్లగా కొండ కనిపిస్తుంది. కొండకు మధ్యభాగంలో వుంది. మళ్ళీ లాగాడు.

విమానం క్రమంగా పైకి లేచింది. అయినా ప్రయోజనం లేదు. యింకా అరమైలు దూరంలో ఐదు వందల అడుగుల ఎత్తు లేవాలి. విమానం ప్రక్కకు తిప్పాడు. సర్కిల్ తిరిగింది.

ఆ సర్కిల్‌లో మరేదయినా కొండ అడ్డమొస్తే ఢీకొలవలసింది. కాని రెండో రౌండ్‌లో కొండ అంచుపైగా దూసుకుపోయింది విమానం.

విమానంలో దబాలున శబ్దం, కేకలు, అరపులు వినిపించాయి.

విజయ్ డోర్ తెరిచి చూశాడు. పైనవున్న సీలింగ్ ముక్క విరిగి పడింది. యింకా మిగిలింది కూడా పడిపోయే సూచనలా వుంది. త్వరలో ఏదైనా ఎయిర్‌పోర్ట్ చేరుకోవాలి.

"హలో... శాంతాక్రూజ్ ఎయిర్‌పోర్ట్!"

"యస్ బోయింగ్ 707... మేము ఎక్కడున్నాము? ఎలా కొన్ని నిమిషాలలో రన్‌వే కావాలి లేదా విమానం సీలింగ్ ముక్కలుగా విరిగి పడిపోవచ్చు."

"యస్ మీరు ప్రస్తుతం సూరత్ మీదుకు తిరిగి హిమాలయ పర్వత ప్రాంతాలకి వచ్చారు."

విజయ్ విస్తుపోయాడు. ఎటు వెళ్ళవలసిన ప్లెయిన్, ఎటు వచ్చిందో అనుకొంటే నవ్వొచ్చింది.

"లెఫ్ట్ తిప్పి డైరెక్టు చేయండి రన్ వే క్లియర్ చేస్తున్నాం. తిరిగి శాంతాక్రూజ్‌కు వచ్చేయండి."

"యస్. థాంక్యూ" అంటూ విమానం టర్న్ చేశాడు.

"ఇందాక మెసెజ్ అందలేదు."

"వైర్స్ తెగిపోయాయి అటాచ్ చేశాము."

"వాట్ ఎబవుట్ టైంబాంబ్?"

"బయలుదేరిన తొంభై నిమిషాల తరువాత టైంబాంబు పేలింది. బయట పేలటంతో విమాన ప్రమాదం తప్పింది కాని బాంబు ముక్క ఒకటి కిటికీ అద్దం నుండి పై సీలింగుకు తగిలింది. సీలింగ్ ముక్కలుగా విడిపోయేలా వుంది."

# 11

క్రైంబ్రాంచి ఇన్‌స్పెక్టర్ జాన్సన్, జనరల్ మేనేజర్ రూములోకి వచ్చాడు. "ప్లెయిన్ ఏమయింది?"

"ప్రస్తుతం క్షేమంగానే వుంది" దివ్యేంద్ర అన్నాడు.

"అయితే బాంబు దెబ్బకు సీలింగు పగిలి వుండాలి."

"థాంక్ గాడ్. క్లారాకి స్పృహ వచ్చింది."

"ఏం చెపుతోంది?"

"ఒక స్మగ్లింగ్ ముఠాకి చెందిన ఆరుగురు బోయింగ్ 707లో వున్నారని వార్ని హతమార్చడానికి రఘువీర్ అనే వ్యక్తి కుట్ర పన్ని టైంబాంబు పెట్టాడని చెప్పింది. అంతేకాదు, ప్లెయిన్‌లో తన చెల్లెలు లూసి అనే అమ్మాయి వుందని ఏడుస్తోంది."

"బాంబు ఎవరి దగ్గర వుంది?"

"నరేంద్ర అనే యువకుడి దగ్గర. అతని ఫోటో కావాలి."

"దేనికి?"

"అతని ద్వారానే రఘువీర్‌ను పట్టుకోవచ్చు. నరేంద్రకు, రఘువీర్‌కు చాలా దగ్గర పోలికలున్నాయట. స్మగు

లింగ్ ముత్తా కూడా నరేంద్రనే రఘువీర్ అని భ్రమ పడ్డారంటే చాలా పోలికలుంటాయి."

"మరి నరేంద్ర తిరిగి రావాలి కదా!"

"అవును. కాని ఈలోపు రఘువీర్ పారిపోకుండా ఎయిర్‌పోర్టులో రఘువీర్ పేర పాస్‌పోర్టు యిష్యూ చేయ కూడదు."

"ష్యూర్! అందుకు గట్టిచర్య కావాలి."

జనరల్ మేనేజర్ దివ్యేంద్ర ఫోన్ రింగ్ చేశాడు.

"హాలో రిజర్వేషన్ కౌంటర్, రఘువీర్ పేరుతో ఎవరికయినా పాస్‌ఫోర్టు యిష్యూ చేశారా?"

"జెస్ట్ ఎ మినిట్" అంటూ కొన్ని క్షణాల తరువాత వినిపించింది___

"యస్ సర్. జంబో జెట్‌లో కాలిఫోర్నియాకు ఇవ్వ బడింధి."

"థాంక్యూ" అని ఫోనుపెట్టి ఇనస్పెక్టర్ జాన్సన్ వైపు చూశాడు.

"జంబో జెట్‌లో రఘువీర్ అనే ప్రయాణీకుడున్నాడు. అతను, ఇతను ఒకడేనేమో సెక్యూరిటీ సిబ్బందితో చెక్ చేయండి. జంబో జెట్ బయలుదేరటానికి సిద్ధంగా వుంది."

ఇనస్పెక్టర్ జాన్సన్, సెక్యూరిటీ సర్వీస్ ఇనస్పెక్టర్ రాజపాల్ జంబో జెట్ చుట్టుముట్టి లోపలకు ప్రవేశిం చారు. లోపల వరుసగా కూర్చున్న ప్రయాణీకులు ఆశ్చ ర్యంగా చూడసాగారు వీళ్ళని.

ఇనస్పెక్టర్ జాన్సన్, సెక్యూరిటీ ఆఫీసరు సహాయంతో జంబో జెట్ తనిఖీ చేయసాగాడు. అత్రుతగా త్వరగా చూస్తున్నారు. ఏ పరిస్థితిలోను జంబో జెట్ ఆలస్యం కాకూడదు.

ఉన్నట్టుండి "హేండ్సప్" అంటూ రివాల్వర్ చూపాడు రఘువీర్.

ఇనస్పెక్టర్ జాన్సన్‌తో సహా అందరూ విస్తుపోయారు. ఇనస్పెక్టర్‌కి రివాల్వర్ తీసే వ్యవధి లేదు.

రఘువీర్ తప్పుకోమన్నాడు. చేసేదిలేక ఇన్‌స్పెక్టర్ తప్పుకున్నాడు.

రఘువీర్ రివాల్వర్‌తో బెదిరిస్తూనే బయటకు వచ్చి, రన్‌వేమీద పరుగు ప్రారంభించాడు.

ఒక్కొక్క లైటు దాటుకుంటూ పరుగు తీస్తున్నాడు. తెల్లని ఆ ఆకారం లైట్ల వెలుగులో కనిపిస్తుంది. ఇనస్పెక్టర్ జాన్సన్ వెంబడించాడు. ముందు రఘువీర్, వెనుక జాన్సన్, అప్పుడప్పుడు రఘువీర్ రివాల్వర్ పేలుస్తున్నాడు.

## 12

"టచ్ డౌన్ వన్ మైల్" అనటంతో పైలెట్ విజయ్ స్టీరింగ్ ముందు బలంగా తోశాడు.

నేలను గుద్దుకున్నట్లుగా రన్‌వే మీద దిగింది విమానం. దిగటంతోనే వెనకభాగం విరిగిపోయింది.

పైరుపగిలిన కారులా, రన్‌వేమీద అటు యిటు కదులుతూ దూసుకువస్తోంది. కుమార్, విజయ్ విమానాన్ని కంట్రోల్ చేస్తున్నారు. విమానం రన్‌వే మీద నిలవక జారిపోతుంది.

రఘువీర్ రొప్పుతూ రన్‌వేమీద పరుగుతీస్తూ పులిలా దూసుకువస్తున్న విమానం చూసి చటుక్కున ఆగాడు. కాని మరోవైపు ఇనస్పెక్టర్ జాన్సన్ బులెట్‌లా వేగంగా వస్తున్నాడు.

రఘువీర్ ఉపేక్షించకుండా చటుక్కున తప్పుకున్నాడు. కాని కుడికాలుకు ఎడమకాలు తగలటంతో తూలి క్రిందపడ్డాడు. గబాలున లేచాడుకాని, అంతలోనే విమానం మీదకు వచ్చింది. రఘువీర్ తూలి క్రిందపడ్డాడు. విమాన చక్రం రఘువీర్ మీదుగా వెళ్ళింది.

రఘువీర్ బిగ్గరగా అరుస్తూ, కప్పలా నేలకు అంటుకుపోయాడు.

—: ఐపోయింది :—




(21 వ భాగము)

ఆమె మాటతో నాలో కలిగింది కేవలం అనుమానమే నన్న నిర్ణయానికి వచ్చాను. మళ్ళీ నా మెదడు రానున్న ప్రమాదంనుండి తప్పించుకొని పోగలిగేందుకు ఏదైనా దారి దొరుకుతుందాని ఆలోచించసాగింది.

అన్నింటినీ మించి అసలు శాస్త్రజ్ఞులు ఊహించినట్లుగా విషపు గాలులు వీస్తాయా? లేక వాతావరణంలో అనుకొని అవాంతరం జరిగి మార్పు సంభవించి, ఈ దీవిపైకి రావలసిన గాలులు, మరో దిక్కున వెళ్ళి, ఇంకెటో వెళ్ళటం కూడా సంభవించవచ్చునేమోనన్న ఆశ కూడా కలిగింది.

నేను డెల్లా బొంబాయి ప్రాంతపు సముద్రంలో కలుసుకున్నది మొదలు ఇప్పటిదాకా ఎన్నో రకాల కష్టాలను, ప్రమాదాలను, ప్రాణాపాయకరమైన పరిస్థితులను ఎదు

రొక్కున్నాం. బ్రతికి బైటపడ్డాం. అవన్నీ ఒక ఎత్తుగానూ, ప్రస్తుతం చిక్కుకున్న పరిస్థితులు ఒక ఎత్తుగానూ కనుపించ సాగాయి.

బ్రతికి బైటపడగలమన్న నమ్మకం నాలో నశించి చాలా సేపయింది. డెల్లా గుండెలో ఏముందో నాకు తెలీదు. పైకి మాత్రం ఇద్దరం గంభీరంగానే వున్నాం. మా ఇద్దరి చిన్న జీవితాలు సుఖాన్ని చవిచూడకుండా, మానవాళికి ఏ కొంచెమైనా మంచి చెయ్యకుండానే అంతమైపోతున్నందుకు బాధ కలిగింది. అది నా గుండెల్ని పిండిచేసింది

చావు తప్పదని తెలిసొచ్చాక, దొంగగా, స్మగ్లర్‌గా నేను బ్రతికిన దినాలు, ఎంత ఏహ్యమైనవో అర్థం కావస్తూంది. ఈ ప్రమాదం తప్పి, ప్రాణాలతో బైటపడితే, నా జీవనమార్గం మార్చుకోవాలనీ, పదిమందికీ పనికొచ్చే విధంగా బ్రతకాలనీ, తీర్మానించుకున్నాను.

"ఏమిటి ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నావ్?" అడిగింది డెల్లా.

"ఏమీ లేదు!" అన్నాను ఆమెకు నా మనస్సులో వున్న విషయాలు విప్పి చెప్పి నవ్వులపాలు కావడం ఇష్టంలేక.

"మిస్టర్ రాజ్! ఈ ప్రమాదంలో మనం ఇద్దరం బ్రతికినా, చచ్చినా ఫరవాలేదు. ఏవిధమైన సమస్యా వుండదు. అలా గాకుండా ఒకరు బ్రతికి మరొకరు చనిపోతే, బ్రతికిన మనిషి చచ్చిన శవాన్ని ఏంచెయ్యాలి?" అడిగింది.

"ఆ అనుమానం నీ కెందుకొచ్చింది!" అడిగాను నేను.

"రాకూడదా?"

"మనం కలసి వుండాలనుకున్నాం - చావులో బ్రతుకులో."

"అనుకున్నంత మాత్రాన జరిగిపోదు. విషపు గాలుల తాకిడికి నువ్వు తట్టుకోగలగవచ్చు. నేను అలా చెయ్య లేక చచ్చిపోవచ్చు. అలాగే భూమిలో మనం తలలు పెట్టాక, అక్కడ దొరికే కొద్ది ఆక్సిజనుతో నువ్వు కష్ట పడి వూపిరి తీసుకోగలగవచ్చు. నాకు అది సాధ్యం కాక పోవచ్చు" అంది డెల్లా.

"అయితే నువ్వే చెప్పు ఏం చేయాలో?" అడిగాను.

"నేను చనిపోతే, నా శవాన్ని ఇక్కడే ఎక్కడన్నా పాతిపెట్టు. ఈ లాకెట్ మా తల్లిదండ్రులకు చేర్చు. వాళ్ళకు నన్ను పాతి పెట్టిన ప్రదేశం ఎక్కడుందో వివ రంగా చెప్పు చాలు" అంది డెల్లా.

"మరి నేను చనిపోతే?" అడిగాను.

"ఏం చెయ్యమంటావ్?" అడిగింది.

"ఇక్కడే పాతిపెట్టెయ్యి. ఆ మట్టిమీద రెండు కన్నీటి బొట్లు రాల్చు, చాలు" అన్నాను.

"రాజ్! అలా జరగదు. జరిగితే నీ విడోగా బ్రతుకు తాను. యూ ఆర్ మై హజ్‌బెండ్ డోనాట్ మారీడ్" అంటూ బలంగా నన్ను కౌగలించుకొంది డెల్లా.

"రియల్లీ?" అడిగాను నమ్మలేనట్లు.

నిజమని నోటితో చెప్పకుండా కౌగిలిని మరింత బిగించింది.

మే మిద్దరం భార్యా భర్తలం.

మంగళ వాద్యాల మధ్యలో, చర్చి గంటల క్రిందనో, అందరూ పెళ్ళిళ్ళు చేసుకుంటారు. కానీ మేము నిర్మా

నుష్యమైన ఎడారిలో, సముద్రపుఅలలు హోరుల మధ్య, పంచ భూతాలు మాత్రమే సాక్ష్యాలుగా, పరస్పరాంగీకారంతో భార్యాభర్తల మైనాం. అదీ చావుకు ఎనిమిది గంటల ముందు, ఇలాంటి దాంపత్యం ప్రపంచలోనే అరుదుగా కనుపిస్తుందనుకున్నాను.

"డెల్లా!" నా గుండెలపైన ఆమె తల వుంది. తల వొంచి నేను మెల్లగా పిలిచాను చెవిలో నోరుపెట్టి.

"ఆఁ!" అంది.

"మనం ఈ అనుబంధం సెలబ్రేట్ చేసుకొందామా?" అడిగాను నవ్వుతూ.

"సిల్లీ!" అంది.

"కాదు! ఎటూ చావబోతున్నాం. కనీసం ఆత్మ తృప్తితో నన్నా చద్దాం!" అన్నాను. ఆమె రెండు భుజాల్నూ చేతుల్లో పట్టుకొని, డెల్లా నాకు అభిముఖంగా వుంది. ఆమె కళ్ళు ఆనందంతో మెరుస్తున్నాయి. అంతకుముందెప్పుడూ అలాంటి తళుకూ, వెలుగూ, నేనామె కళ్ళల్లో చూడలేదు. బహుశా నాలోనూ అలాంటి మార్పు గమనించి వుండవచ్చుననుకున్నాను.

ఇద్దరం ఇసుకలోంచి లేచాం.

"ఎక్కడకు?" అంది డెల్లా గోముగా.

"శోభనానికి!" అన్నాను.

ఆ మాటతోనే నాపైకి ఒరిగిపోయి లతలా నన్నల్లుకు పోయింది. ఆమె బలమైన లావుపాటి రొమ్ములు నా వొంటికి గీచుకున్నాయి. ఆ రాపిడి తియ్యని తిమ్మిరిని లేపింది రక్తంలో.

"ఆ బిల్డింగ్ కు వెళ్దాం!" అన్నాను.

ఆమె నా చెయ్యిపట్టుకొని నడవసాగింది.

ఇద్దరం అడుగులో అడుగు వేసుకుంటూ బిల్డింగ్ వైపు నడిచాం.

క్రిందిభాగంలో వున్న గదుల తలుపులన్నీ తెరచి చూశాం. చివర్న ఒక బెడ్ రూం కనుపించింది. డెల్లాను అందులో వదలి నేను పైకెళ్ళాను. రెండు విస్కీ సీసాలూ తినేందుకు కొన్ని బిస్కట్లు మొదలైనవి తెచ్చాను.

ఆరు గంటలసేపు ఈ లోకాన్ని మరచిపోయి మా లోకంలో మేమున్నాం. అంతసేపూ ప్రతిక్షణం ఆనందం అనుభవించాం. విరామం లేకుండా, విసుగు పుట్టకుండా కరిగిపోయింది కాలం.

ఆఖరి ఆటవిడుపులో "టైమెంత!" అడిగాను డెల్లాను.

చెప్పింది ప్రక్కనున్న అలారం టైంపీస్ చూసి.

"అయితే ఇంకో గంటన్నర మాత్రం వుంది. వెళ్దామా!" అడిగాను.

"ఊఁ!" అంది.

చాలా హాయిగా అనిపించింది మనస్సుకు. ఆ తర్వాత మా సామగ్రి తీసుకొని బయలుదేరాం, అంతకుముందు మేము గోతులు త్రవ్వి పెట్టుకున్న ప్రాంతానికి.

కొద్దిగా గాలి ప్రారంభమయింది. దాంతోపాటు దొర్లుకుంటూ వచ్చిన ఇసక అంతకుముందు మేముచేసిన గోతుల్ని కొంతవరకు పూడ్చింది.

నేను చేతులో ఆ ఇసకంతా ఎత్తి ప్రక్కన పోసి మళ్ళీ యథాప్రకారం తయారుచేశాను.

"ఈ గాలి మనమనుకున్నట్లు పెద్దదయితే సజీవ సమాధి అవుతాం" అంది డెల్లా.

"చిన్న గాలికే ఇంత ఇసుక కొట్టుకొస్తే, తుఫాను లాంటిదేదన్నా వచ్చిందంటే పెద్ద మేడ పడిపోతుంది" అంటూ "అందుకే మన వివరాలు తెలుపుతూ ఆ బిల్డింగులో ఉత్తరం రాసిపెట్టింది" చెప్పాను.

అప్పటిదాకా వున్న పొడివున్న గాలిలో తేమ ఎక్కువయింది. ఆకాశంలో వెలుతురు కూడా సన్నబడింది. పది నిమిషాల్లో మొత్తం చిమ్మచీకటి క్రమ్మేసినట్లయింది.

"ఏమిటీ మార్పు?" అడిగింది డెల్లా.

"ఏమో?" అర్థంగాక చూశాను.

"విషపు గాలులు రాబోయేముందు వాతావరణం ఇలా మారిపోతుందా" అడిగింది డెల్లా.

"ఇలాగని అక్కడి నోట్స్‌లో లేదు. ఇదేదో విచిత్రంగా వుంది" అన్నాను.

తలెత్తి ఆకాశంవేపు చూశాను.

అందాకా పల్చగా పారాడుతున్న మేఘాలు ఒకదాంతో ఒకటి చేరుకుని చిక్కబడి నల్లబడ్డాయి. వర్షం జోరుగా రాబోయేట్లుగా వుంది. దీనివల్ల మా ప్లాన్ పని చెయ్యదన్న అనుమానం కలిగింది.

వర్షపు నీళ్ళు ఇసకలోకి సులభంగా దిగిపోతాయి. గాలిని మాకు అందనీకుండా నీటిపొరలు అడ్డుపడ్డాయంటే, దొరికే ఆ కాస్త ఆక్సిజన్ కూడా దొరక్క చావల్సి వస్తుందేమోనన్న భయం పట్టుకొంది.

ఉరుములు ప్రారంభమైనాయి.

మా దీవిని వెలుతురులో లిప్తపాటు తడపాలను కున్నట్లు అప్పుడప్పుడూ మెరుపులు కనుపించాయి.

"మనం ప్రాణాలు కాపాడుకునేందుకు బుర్రలు బద్దలు

కొట్టుకొని తయారుచేసుకున్న పథకం కాస్తా పనికిరానిదయిపోయేట్లుంది!'' అంది డెల్లా నిరాశగా.

మరో మార్గమేదన్నా దొరుకుతుందాని ఆలోచించసాగాను. ఎంత ఆలోచించినా వేరే దారి కనుపించలేదు.

శాస్త్రజ్ఞులు వేసిన అంచనాకు మరో ఇరవై ఆరు నిమిషాలు మాత్రమే వ్యవధి వుంది.

ఆకాశంలో మెరుపులు ఎక్కువయినాయి. దిక్కులు పిగిలిపోతున్నట్లుగా భయంకరమైన శబ్దంతో చెవుల్ని చిల్లులు పొడిచాయి ఉరుములు.

గాలిలో నాకేదో ఒకరకమైన వింతవాసన వస్తున్నట్లు అనిపించింది. ఆ వాసనకు ముక్కుపుటాలు మంట పుట్టినట్లయింది. కళ్ళు బైర్లుకమ్ముతున్నట్లు శరీరం చేదెక్కుతున్నట్లుగా తోచింది.

నా అనుభవం చెప్పాను డెల్లాకు.

ఆమెకూ అలాగే ఉందని చెప్పింది.

విషపు గాలులు వీచడం ప్రారంభమయింది. ఇక ప్రయత్నాలు, పథకాలు అమలుపరచక తప్పదనిపించింది.

''డెల్లా!'' పిలిచాను.

''ఆఁ!'' అంది.

''మనం ఆతృతగా, భయంగా, ఎదురుచూసిన ఆ విషపు గాలి రావడం ప్రారంభమైంది. మనం మన గోతుల్లోకి దిగుదామా!'' అడిగాను.

''దిగుదాం!'' అంది డెల్లా.

ఆఖరిసారి అన్నట్లు ఆమెను ఘట్టిగా కౌగలించుకున్నాను. పెదాలలోని రక్తమంతా జుర్రుకొని త్రాగేట్లు ముద్దుపెట్టుకున్నాను.

ఒకర్నొకరు శాశ్వతంగా వదలి వెళుతున్నట్లుగా బాధ పడ్డాం. ఆ బాధ గుండెల అడుగులోంచి వచ్చినట్లుగా వుంది నాకు.

అంతకు ముందు అనుకున్న ప్రకారం ఇద్దరం తలలు గోతుల్లో పెట్టుకున్నాం. నేను తల దగ్గర అలారం టైం పీస్‌ను పెట్టుకున్నాను. మెల్లగా చేతుల్తో గొయ్యి చుట్టూ వున్న మట్టిని లోపలకు త్రోసుకున్నాను. నా తల పూర్తిగా మట్టిలో మునిగిపోయింది. మెడ భాగం నుండి మిగిలిదంతా వెలుపలే వుంది.

డెల్లా కూడా అలాగే చేసుకుని వుంటుందనుకున్నాను.

టక్‌టక్‌మంటూ గడియారం చేస్తున్న శబ్దం వినిపిస్తూంది. కళ్ళ చుట్టూ చీకటి తప్ప మరేం కనుపించలేదు నాకు.

వెలుపల వాతావరణం క్షణ క్షణానికీ చల్లబడుతున్నట్లుగా వుంది. అది నా కాళ్ళకు తగులుతున్న గాలినిబట్టి గ్రహించాను.

క్షణాలు జరిగినకొద్దీ చలి ఎక్కువవుతున్నట్లు అనిపించసాగింది. అలా అరగంటదాకా చలి ఎక్కువవుతూనే వుంది. నా దగ్గరున్న టైం ప్రకారం ఈపాటికి విష వు గాలులు ప్రారంభమయివుండా లనుకున్నాను. అయితే ప్రారంభమయిందీ లేనిదీ తెలిసే మార్గం మాత్రం లేదు.

మరో గంట గడిచింది.

నాకు ఊపిరి అందటం కష్టంగా వుంది.

భూమిలో లభించే గాలుల్లో ఆక్సిజన్‌పాలు అంత ఎక్కువగా లేనట్లుంది. మనిషికి కావలసినంత దొరకదని నిర్ధారణగా తెలిసింది. అందువల్ల బాగా దమ్ముపట్టి, గాలి

చాలా మెల్లగా పీల్చసాగాను. అలాగే నిదానంగా వదలటం మొదలుపెట్టాను.

కాళ్ళకూ, మెడ పైభాగానికి ఏవో సూదులతో పొడిచినట్లు బాధ పుట్టసాగింది.

అది విషపు గాలులవల్లనేమో ననుకున్నాను. ఆ తర్వాత అది చలి ఎక్కువ కావడంవల్ల కలుగుతున్న అనుభవమని అర్థం చేసుకున్నాను.

ఆ నొప్పి బాగా ఎక్కువయింది. బాధకు కాళ్ళు నిశ్చలంగా నిలబెట్టలేకపోయాను. అటూ ఇటూ వాటంతటవే కొట్టుకోసాగాయి. నా ప్రయత్నమూ, ఓర్పు, దాన్ని ఆపలేక పోయాయి.

ఇంకొంత సేపటికి సన్నటి చినుకులు కురుస్తున్నట్లు గ్రహించాను.

అతి త్వరలోనే చినుకులు పెద్దవైనాయి. లావుపాటి చినుకులు కర్రలతో కొట్టినట్లు కాళ్ళపై పడి నెప్పి పుట్టాయి.

నా బాధ నాకు అర్థమవుతూంది.

డెల్లా ఎలా తంటాలు పడుతుందోనన్న ఆతృత, ఆరాటము ఎక్కువయినాయి నాకు. మేమిద్దరం భార్యాభర్తలం అనుకొన్న తర్వాత నా ఆవేదన నాకు తెలీకుండానే మిక్కుటమైంది.

లావుపాటి రాళ్ళేవో నా శరీరంపై పడ్డట్లు ఫీలయినాను. ఒక్కొక్కటి పైన పడుతుంటే ఎముకలు విరిగి పోతాయేమో ననిపించింది. అలా రాళ్ళు ఎవరు విసురుతున్నారా అని ఆశ్చర్యపోయాను. అవి కాళ్ళపై పడ్డాక రాళ్ళు కాదనీ, వడగండ్లని తెలుసుకున్నాను. విసు

గడ్డలవి. కాలిపై పడ్డప్పుడు అది పడ్డమేరకు చర్మం చల్ల బడి బిరుసెక్కిపోయి నట్లనిపించింది. రక్తప్రసారం కూడా ఆగిపోయింది కొంత సేపు.

ఆ వడగండ్ల వాన, అపులేకుండా దాదాపు అరగంట సేపు కురిసింది. నా శరీరంపైన ఏదో పెద్ద బరువు పెట్టి నట్లుంది. అంటే నా వొళ్ళు మొత్తం వాటి క్రింద పడి పోయిందనిపించింది. అది ఆగిందో లేదో నాకర్థం కాలేదు.

కాళ్ళు కదల్చటానికి, చేతులు ఊపటానికి ఏవిధమైన అవకాశం అణుమాత్రం కూడా లేకుండాపోయింది. నేనూ నాలాగే డెల్లా, ఇద్దరం సజీవ సమాధి కాబడ్డాం అని తెలుసుకున్నాను.

నేను ఎదురు చూచిన ఇసక తుఫాను రాలేదు. కానీ ఎటూ ఊహించని వడగండ్ల వాన వచ్చి మమ్మల్ని భూ స్థాపితం చేసింది.

బ్రతకటానికున్న ఒకే ఒక అవకాసం, జాగ్రత్తగా, గాలి పీలుస్తూ, వదలడం. దానికీ శక్తి సన్నగిల్లిపోయింది. అలాగే నా అంచనా ప్రకారం ఐదారు గంటల సేపు తంటాలుపడి వుంటాను ప్రాణాలు నిలబెట్టుకునేందుకు. మంచుగడ్డలవల్ల శరీరం మొత్తం చల్లబడిపోయి వుంది. ఆ చలి గుండెల్లోకి చేరింది.

ఎంత ప్రయత్నించినా, ఎందువల్లో ఊపిరి పీల్చుకో వడం కష్టమవుతూ వుండటం గ్రహించాను. అలాగే కొంత సేపు తన్నుకులాడాను. డెల్లా చెయ్యి నా చేతిలో పడింది. ఆమె చేతిని పట్టుకొన్న నా చేతి వ్రేళ్ళ పట్టు వదులు కాసాగింది. స్పృహాజ్ఞానం నశించిపోసాగింది. స్పృహ కూడా పోతున్నట్లుంది. నిగ్రహించుకున్నాను.

శరీరంలోని సత్తువంతా కూడగట్టుకొని పోరాడాను. మరో పది నిముషాలు గడిచాయి. ఆ తర్వాత నాకేమయిందో తెలీలేదు.

*                    *                    *

కుడి పిరుద మీద ఏదో గుచ్చినట్లనిపించింది.

కళ్ళు తెరవాలనీ, చుట్టూ ఏముందో చూడాలనీ అనిపించింది. మూసుకున్న రెప్పలు ఎంత ప్రయత్నించినా తెరుచుకోలేదు. గుడ్లు నైట్రిక్ ఆసిడ్‌లో తడిసినట్లు మంట పుట్టాయి. కణతలు కూడా మండాయి. లాభం లేదని ఆ ప్రయత్నం మానుకున్నాను.

గచ్చుమీద అప్పుడప్పుడు పడుతున్న మెత్తటి బూడ్సుల అడుగుల చప్పుడు వినరాసాగింది. నేనెక్కడున్నానో తెలుసుకోనేందుకు ఆతృతగా వున్నా, కళ్ళు తెరచి చూడలేకపోవడం, నోరు విప్పి మాట్లాడలేకపోవడం పెద్ద అవరోధాలుగా తయారయ్యాయి.

"అతనికి స్పృహ వస్తూంది" ఎవరో అన్న మాటలు నా చెవిన పడ్డాయి.

"నిజంగా! వుయ్ ఆర్ లక్కీ! ఇంకో ఇంజెక్షన్ ఇవ్వండి" అరిచాడు మరో మనిషి. అతని గొంతు బొంగురుపోయినట్లుంది.

"ఇతను బ్రతకడని అన్నారు మీరంతా. నాకెందుకో బ్రతుకుతాడన్న నమ్మకం మొదట్నుంచీ వుంది" మొదటి గొంతు మళ్ళా వినిపించింది.

"మీరు ఇంత ఓర్పుగా ఇన్ని రోజులు అతన్ని అవరింపన మృత్యువుతో పోరాడారు. మీరు డాక్టరుగారు. చివుడులాంటివారు" ఇంకొకతను అంటున్న మాటలు వినదేడ్డాయి.

వాళ్ళ సంభాషణనుబట్టి నాకు కొంత అర్థమయింది. నేను చాలా దినాలనుండి 'కోమా'లో వున్నాను. నన్ను ఆ డాక్టరెవరో పుణ్యం కట్టుకొని బ్రతికించాడు. కానీ డెల్లా ఏమయింది? ఎక్కడుంది? అసలు బ్రతికి వుందా? లేదా? అన్న ప్రశ్నలు నా మెదడున్ను పురుగుల్లా తొలిచాయి. ఆమె గుర్తుకు రాగానే, పాత విషయాలు కూడా గుర్తొచ్చాయి. నాకు స్పృహ కోల్పోయేముందు ఏమేంటి జరిగింది సినిమా బొమ్మల్లా కదిలింది కళ్ళముందు.

ఘోరమైన విషపు గాలుల్ని తట్టుకొని, బ్రతికి ప్రాణాలతో బైట పడటం మరచిపోలేని సంఘటన. దానినుంచి నాతోనే డెల్లా కూడా తప్పుకుందో, లేదో తెలుసుకుందామని చాలా ఆతృతగా వుంది. గొంతు పెకిలించుకున్నా మాట రావటం లేదు. స్వరపేటిక ప్రక్కనున్న నరాలేవో నలిగిపోయినట్లు అనిపించింది.

ఎడమవేపు పిరుదుపైన మళ్ళా ఇంజక్షను చేసినట్లున్నారు. నొప్పి పుట్టింది. ఆ మందేదో రక్తంలో కలిసిపోతూంటే వొళ్ళంతా తిమ్మిరెక్కినట్లయింది. కళ్ళు మళ్ళీ నొప్పి పుట్టాయి. మైకంలాంటిదేదో శరీరాన్ని ఆవరించింది. చైతన్యం చచ్చిపోయినట్లయింది. నన్ను నాకు గుర్తు లేకుండాపోయింది.

ఇలాగే ఐదారుసార్లు జరిగింది. స్పృహ తెలిసినప్పుడల్లా నా చుట్టు ప్రక్కల తిరుగుతున్న. మనుషులు మాట్లాడుకుంటున్న విషయాల్ని తదేకంగా విని, వాటినుంచి నాకేం జరిగిందో, నన్ను మామూలు మనిషిని చెయ్యడానికి వాళ్ళు ఎటువంటి ప్రయత్నాలు చేస్తున్నారో తెలుసుకుందామని ప్రయత్నించసాగాను. అన్నిం

టినీ మించి డేల్లా కెలా వుందో కనుక్కుందామని ఆశిం చాను. కానీ అదే తెలియలేదు.

కళ్ళు తెరచాను.

గదినిండా పరుచుకున్న మెర్క్యురీలైటు వెలుగు తెల్లగా కనుపించింది. మెడ కొద్దిగా త్రిప్పి చూశాను. ఎవ్వరూ కనుపించలేదు. ఆ గదిలోని ఫర్నిచర్, పెయింటు మొదలైనవాట్ని బట్టి నేను నిశ్చయంగా ఏదో హాస్పిటల్ రూమ్‌లో వున్నానని నిర్ధారించుకున్నాను.

లేచి కూచుందామనిపించింది. ప్రయత్నించాను. కానీ నడుం పట్టుకుపోయినట్లుంది. కూర్చోలేకపోయాను. కాళ్లు, చేతులూ కదిలించాను. అవి నా స్వాధీనంలోకి వచ్చాయి. ఇష్టమొచ్చిన విధంగా కదలించగలుగుతున్నాను.

తలుపు తెరచుకొంది. తెల్లటి బట్టలు వున్న అందమైన అమెరికన్ నర్స్ లోనికొచ్చింది.

"మార్నింగ్ సిస్టర్!" నన్ను గమనించకముందే ఆమెను పలకరించాను. విస్తుపోతూ నా బెడ్ కేసి చూసి చక చక అడుగులేసుకుంటూ వచ్చి నిలుచుంది మంచం ప్రక్కగా.

"హా డూ యూ ఫీల్!" అడిగింది ఆమె నన్ను. ఆనందాశ్రువులు ఆమె అందమైన గుండ్రని కళ్ళను తడిపి వేస్తూండటం గమనించాను.

"ఎక్సలెంట్. మళ్ళా పుట్టినట్లు ఆనందంగా వుంది" అన్నాను.

"కరెక్ట్! మీరు నిజంగా మళ్ళా జన్మించారు!"

"సిస్టర్! నాతో రెండు నిముషాలు నిదానంగా మాట్లాడే తీరికుందా?" అడిగాను మెల్లగా.

"ఓ! యస్!" అంటూ, మూలనున్న స్టూలు లాక్కొచ్చి వేసుకుంది.

"నన్ను ఎలా రక్షించారో తెలుసా?" అడిగాను నా మొదటి ప్రశ్న.

"నాకంత వివరంగా తెలీదు. డాక్టర్ డేనియల్ నడిగితే చెప్పగలరనుకుంటాను. మిమ్మల్ని తీసుకొచ్చాక నన్ను విమానంలో పిలిపించారు" అందామె.

"ఐ. సీ. నాతోపాటు మరో స్త్రీ కూడా వుండాలి. ఆమెకెలావుంది" అడిగాను ఆత్రతగా.

"ఆమె చాలా బాగుంది."

"నాకన్నా బాగుందా?"

"ఆఁ!"

"లేచి తిరుగుతూందా?"

"లేదు!"

"మంచంపైనే వుందా? నీతో ఎప్పుడన్నా మాట్లాడిందా? నన్నుగురించి అడిగిందా?" ప్రశ్నలవర్షం కురిపించాను ఆమెపైన.

"నేను ఆమెను అటెండు కావటంలేదు. మరో నర్సు వుంది. డాక్టరు చెప్పేదాన్నిబట్టి ఆమె పరిస్థితి బాగుందనే ఊహించాను" అందామె.

"ఐ సీ! నా కోసం నువ్వు ఈ దినం వీలు చూసుకుని ఆమెదగ్గరకు వెళ్ళి మాట్లాడి రావాలి. నేను క్షేమంగా వున్నట్లు ఆమెకు చెప్పాలి. ఆమె లేచి రాగలనంటే ఒక్కమారు నా గదికి తీసుకురావాలి. ఇది చాలా అవసరం. ఆమెను ఒక్కసారి చూస్తే చాలు. బ్రతకాలన్న కాంక్ష, త్వరగా కోలుకోవాలన్న కోరిక బలీయమవు

తాయి. మీ మందులతోకన్నా, త్వరగా మామూలు మని
షిని కాగలుగుతాను'' అన్నాను ఆవేశంగా.

''ఐ కెన్ అండర్‌స్టాండ్! ప్రయత్నిస్తాను'' అందామె
లేస్తూ.

''ప్రయత్నించడం కాదు సిస్టర్! ఎలాగైనా, నా
కోరిక తీర్చాలి!'' అన్నాను.

ఆమె లేచి ఇంజక్షనేదో లోడ్ చేసింది. నా చేతి
కిచ్చింది. మందొక చిన్నగ్లాసులో పోసి పట్టించింది.
త్రాగాను.

సిస్టర్ తలుపు దగ్గరగా లాక్కొని వెళ్ళిపోయింది.

అది మధ్యాహ్నమో, సాయంత్రమో నాకు తెలీలేదు.
చాలాసేపటిదాకా సిస్టర్‌కోసం ఎదురుచూస్తూ కళ్ళు
తెరచుకుని వున్నాను. కానీ ఆమె రాలేదు.

తలుపు కదలినట్లయింది. తల త్రిప్పి చూశాను. నల్లటి
సూట్‌లో వున్న పొట్టిమనిషి లోనికొచ్చాడు. అతని
మెడపైన స్టెతస్కోపు అడ్డంగా వ్రేలాడుతూంది.

''ఎలా వుంది!'' వచ్చి స్టూలుపైన కూర్చుంటూ అడి
గాడు డాక్టరు.

''బావుంది! డేనియల్ మీరేనా?''

''అవును. నా పేరు నీకెలా తెలుసు?''

''సిస్టర్ చెప్పింది!'' అన్నాను.

''ఐ సీ'' అంటూ స్టెత్ పెట్టి అక్కడక్కడా పరీ
క్షించసాగాడు. నేను ఊపిరి తీసుకుంటూ, వదులుతూ
వుండిపోయాను.

''ఇంకొంత బలం కావాలి! అప్పుడు లేచి తిరుగుతావ్.
అందాకా ఇలా బెడ్‌పైనే రెస్ట్ తీసుకోక తప్పదు''
అన్నాడు డేనియల్.

“మీకు నేను ఋణపడి వున్నాను, చాలా!” అన్నాను కృతజ్ఞతగా.

“నాకొద్దు బాబూ! ఆ దేవుడికి. మనిషికీ మనిషికీ మధ్య ఋణాలుండవు. ప్రేమమాత్రమే వుంటుంది.”

“అలాగనుకోవడం మీ గొప్పతనం మాత్రమే! అసలు నన్నెలా రక్షించారు డాక్టర్!” అడిగాను ఆతృతను అణచుకోలేక.

“ఈ దీవిలో పరిశోధనలకోసం నియమించబడ్డ రిసెర్చి టీములో పనిచేసే డాక్టర్ని నేను. విషపు గాలులు వీచే సమయం పూర్తికాగానే మేమంతా ఇక్కడకు చేరుకొన్నాం. నువ్వు రాసిపెట్టిన మెసేజ్ చూశాం. దాని ప్రకారం అందరం వెతుక్కుంటూ వెళ్ళాం. ఆ గాలులు వీచిన సమయంలోనే పెద్ద ఇసుక తుఫానుకూడా రేగింది. మీరు దాదాపు పదహారు అడుగుల లోతు ఇసుకలో కూరుకుపోయారు. మేము మొత్తం పాతికమందిమి ఒక రోజంతా శ్రమించాం. ఆ ఇసుకంతా తోడి, చూడగానే నువ్వూ నీతో వున్న అమ్మాయి పడివున్నారు. అసలు మీ ఇద్దరికీ ప్రాణాలు ఎప్పుడో పోయివుంటాయని ముందే అనుకున్నాం. కానీ నా ప్రాథమిక పరీక్షలో మీరు ఇంకా బ్రతికివుండటం గమనించాను. వెంటనే ఇక్కడకు తరలించుకొచ్చాం. అవసరమైన మందుల్ని, ఇద్దరు నర్సుల్ని అమెరికానుండి విమానంలో తెప్పించాం. ఇది జరిగి ఇవాల్టికి నలభైమూడు రోజులయింది. దేముడి దయవల్ల నువ్వు మూడ్రోంతులు కోలుకొన్నావు. మరో కొద్దిరోజుల్లోనే మామూలు మనిషి వవుతావ్!” అన్నాడు డాక్టర్ డేనియల్.

"ఆమె కెలా వుంది?" అడిగాను.

డాక్టరు క్షణకాలం మాట్లాడలేదు. చూపులు ప్రక్కకు త్రిప్పాడు.

"డాక్టర్ చెప్పరెందుకు? డెల్లా కేమయింది?" అసలు ప్రాణాలతో వుందా? లేదా?" అడిగాను గట్టిగా.

"ప్రాణాలతో వుంది. కానీ, బ్రెయిన్ బాగా దెబ్బ తినింది. ఆమె కెవ్వరూ గుర్తులేదు. ఏ పాత సంఘటనా గుర్తు రాదు. షి ఈజ్ మెంటలీ క్రిపుల్డ్!" అన్నాడు డేనియల్.

"ఎక్కడుంది?" అడిగాను ఆవేదనను ఆపుకోలేక.

"ఇక్కడే! క్రింది గదుల్లో వుంది. ఇప్పటికి రెండుసార్లు తప్పించుకుపోయింది. వెతుక్కొచ్చాం. మళ్ళా అలాంటి ప్రమాదం జరక్కుండా కాళ్లూ చేతులూ కట్టివేసి వుంచాం."

"డాక్టర్! ఆమె తిరిగి మామూలు మనిషి కావడం అసంభవమా?"

"అలాగని చెప్పడం డాక్టర్లకు చేతగాదు. ఈ ప్రపంచంలో ఏదీ అసంభవం గాదు. నా శాయశక్తులా ప్రయత్నిస్తున్నాను. ఆమెను మామూలు మనిషిని చెయ్యమని నాతోపాటు నువ్వూ భగవంతుణ్ణి వేడుకో! ఆమె గురించి ఎక్కువ ఆలోచించి నీ ఆరోగ్యం పాడు చేసుకోవద్దు. ఇంతదాకా మనం పడ్డ శ్రమంతా వృధా అవుతుంది" అన్నాడు డాక్టర్ డేనియల్.

"నేను త్వరగా కోలుకోవాలి! నా డెల్లాను మామూలు మనిషిని చేసే మీ ప్రయత్నాల్లో నేనూ పాలు పంచుకోవాలి" అన్నాను దృఢంగా.

"ఐ లైక్ దట్!" అంటూ లేచాడు డేనియల్.

డాక్టరు వెళ్ళిపోయాడు.

గదినిండా ఆవరించిన అపూర్వమైన దేవతాశక్తి ఏదో అదృశ్యమై పోయినట్లు బాధపడ్డాను డాక్టరు డేనియల్ వెళ్ళిపోగానే. ఆయన డెల్లాగురించి చెప్పిందంతా మళ్ళా మళ్ళా జ్ఞప్తికి తెచ్చుకుని పదేపదే పరిస్థితిని నెమరు వేసుకోనసాగాను.

మేమిద్దరం ఒకేరకం వాతావరణంలో, ఒకే లోతున, ఒకే ఇసుకక్రింద కూరుకుపోయినవాళ్ళం. కానీ విధి లిఖితం. నన్ను బాగా చూసింది. డెల్లాను అన్యాయం చేసింది.

బొంబాయి వదలింది మొదలు ఇంతదాకా మనుషులతో ప్రకృతితో మా ప్రాణాలకోసం నిరంతరం పోరాడుతూనే వున్నాం. ఇప్పుడు డెల్లాగురించి భగవంతుడితో కూడా పోరాటం పెట్టుకోక తప్పేట్లు లేదు.

డేనియల్ పైన నాకు అచంచలమైన విశ్వాసం కుదిరింది. ఆయన ముఖంలో ఒక వింత వర్చస్సు స్ఫుటంగా కనుపించింది. ఆయన చికిత్సలోనే డెల్లా మామూలు మనిషి కావాలి. లేకుంటే ఇంక జీవితాంతం ఆమె అదే స్థితిలో వుండవలసిందే ననుకున్నాను.

ఆమె గురించి ఆలోచించకూడదనే అనుకున్నాను. కానీ క్షణక్షణానికీ ఆమె ఆలోచనలు వస్తూనే వున్నాయి. పాత సంఘటనలు గుర్తుకు రాసాగాయి. తెలీకుండానే నా కళ్ళలోనుండి ధారావాహికంగా కన్నీళ్ళు కారి కణతల పైగా చెవులమీద పడసాగాయి.

తలుపు త్రోసిన అలికిడయింది.

కళ్ళు చేత్తో తుడుచుకుని చూశాను.

సిస్టర్ కనుపించింది.

మెల్లిగా నా మంచం దగ్గరకు వచ్చింది.

"డాక్టర్ డేవియల్ వచ్చారా?" అడిగింది ఆమె.

"ఆఁ! వారిని నువ్వే పంపావా?" అడిగాను నవ్వుతూ.

"లేదు! మీ కోరిక చెప్పాను. వారు తనే వెళ్తా మన్నారు. అంతే!" అంది సిస్టర్.

"థాంక్ యూ! కనీసం ఆ మాత్రం సాయమన్నా చేశావ్?" అన్నాను.

"ఆయన మీ గరల్ ఫ్రెండ్ గురించి వివరంగా చెప్పారా?"

"చెప్పారు! ఆమె గరల్ ఫ్రెండ్ కాదు!" అన్నాను.

"మరి?" ప్రశ్నార్థకంగా చూసింది నాకేసి సిస్టర్.

"నా వైఫ్!"

"ఐ. సీ. ఎక్కడా చేతికి వెడ్డింగ్ రింగ్ కనుపించ లేదు! అందుకని అలా అనుకున్నాను."

"అందరిలా మేము చర్చిలో పెళ్ళి చేసుకో లేదు. అడవుల్లో చేసుకున్నాం. మనస్సులు కలియటం ప్రధానం తప్ప, ఉంగరాలు కాదుగా?"

"నిజమే! రింగులు మార్చుకున్నంత సులభంగా హృదయాలు ఇచ్చి పుచ్చుకోలేకపోయిన పెళ్ళిళ్ళు అమెరికాలో ఎన్నో చూసాను" అంది సిస్టర్.

"నీకు పెళ్ళయిందా?" అడిగాను ఉబుసుపోక.

"అయింది. ఆ తర్వాత నెలరోజులకే డైవర్స్ కూడా అయిపోయింది. ఆ చేదు అనుభవంతో ఇక జీవితంలో పెళ్ళిమాట తలపెట్టకూడదని తీర్మానించు కున్నాను.

అందుకే నర్సింగ్ కోర్స్ చదివి, ఇలా మనుషులకు చేత నయిన సేవచేస్తూ చనిపోవాలని నిర్ణయించుకున్నాను" అంది సిస్టర్.

ఆమె అనుభవం విన్నాక నాకు బాధకలిగింది. ఆమెను ఓదార్చే అవసరం ఎవ్వరికీ లేకుండా, తనే జీవితానికో దారి చూసుకుంది. ఇప్పుడు నేనూ అలాంటి స్థితిలోనే పడ్డాను. డెల్లా ఆరోగ్యం కోలుకోకపోతే, ఆమెను చంపి, నేను చచ్చి, మా సమస్య ప్రపంచానికీ, ముఖ్యంగా, నా ఎదురుగా వున్న సిస్టర్‌లాంటి, మంచి మనుషులకు, డాక్టర్ డేనియల్‌లాంటి దేవతామూర్తులకు, లేకుండా చేద్దామనుకున్నాను.

సిస్టర్ ఇంజక్షను చేసింది. మందేదో ఇచ్చింది. బ్లాంకెట్ కప్పి లైటార్పి, సన్నటి వెలుతురునిచ్చే నైట్ బల్బు స్విచ్ ఆన్ చేసి, తలుపులు దగ్గరగా లాగి, వెళ్ళిపోయింది.

పిచ్చి పిచ్చి ఆలోచనలు చేసుకుంటూ, వెలుతురును కోలుస్తూ నాకు తెలీకుండానే ఎప్పుడో నిద్రలోకి జారి పోయాను.

అలా దాదాపు పదిరోజులు జరిగిపోయాయి. సిస్టర్ వచ్చి మందిస్తూనే వుంది. డాక్టర్ డేనియల్ అప్పుడప్పుడు పరీక్షలు చేస్తున్నాడు.

నాకు మాత్రం లేచికూచునే ఓపిక రావడంలేదు. నేను తినే ఆహారం, తీసుకొనే మందులు ఏమవుతున్నాయో నాకన్నా డాక్టరుకే ఎక్కువ ఆశ్చర్యకరంగా తయారయింది. కాలకృత్యాలు మొత్తం బెడ్ పైనే జరుగుతున్నాయి. నాకూ వీలయినంత వేగంగా లేచి కూర్చోవటమే గాకుండా, నడవాలనీ, పరుగెత్తాలనీ వుంది.

మరో రెండురోజులు గడిచాయి.

నా పరిస్థితిలో చెప్పుకోదగ్గ మార్పేమీ కనుపించలేదు.

డాక్టర్ డేనియల్ వచ్చినప్పుడు అడిగాను. ఆయన ధైర్యం చెప్పాడు. తప్పకుండా లేచి తిరుగుతానని హామీ కూడా ఇచ్చాడు.

మరో మూడురోజులు జరిగాయి.

యథాప్రకారం సిస్టర్ వచ్చి ఇంజక్షను చేసింది. మందిచ్చింది. వెళ్ళబోయే ముందు నా బెడ్ ప్రక్కన కూర్చుంది. అలా ఆమె కూర్చోడం నాకు కొంత చిత్రంగా తోచింది.

"మిస్టర్ రాజ్!" పిలిచింది మెల్లగా.

"యస్! చెప్పండి సిస్టర్" అన్నాను ఆమెవైపు తల త్రిప్పి ఒత్తగిల్లి పడుకుంటూ.

"మీరంటే నాకు చాలా ఇష్టం!" అంది అకస్మాత్తుగా.

"ఎందుకని?"

"మీరెన్నో సాహసాలు చేశారు! ఎన్నో విపత్కర పరిస్థితుల్లో మృత్యువు చేతుల్లో చిక్కుకునికూడా, ధైర్యం విడువకుండా, పోరాడి, ప్రాణాలతో బయటపడ్డారు. అన్నింటినీ మించి మీకు భార్యంటే చాలా ప్రేమ వున్న విషయం కనిపెట్టాను" అందామె ఆర్ద్రమైన కళ్ళతో. జేబురుమాలు తీసి వాట్ని అలవోకగా, అందంగా, ఒత్తుకోవడంకూడా గమనించాను.

"ఎలా కనిపెట్టారు?" అడిగాను.

"ఐ యామ్ ఎ లేడీ! అది ఎలా కనిపెట్టగలిగానో నాకు తెలుసు. కానీ మీకు చెప్పడం చేతకాదు! మీ

లాంటి వ్యక్తికి నేను భార్యను కాలేకపోయానన్న కొరత మాత్రం జీవితాంతం వుంటుంది. నా భర్త మీరు మీ భార్యపై చూపే ప్రేమలో పదోవంతు చూపించివున్నా ఇలా నర్సునయ్యే అవసరం లేకుండాపోయేది'' అందామె.

''మీ ఆవేదనను సమర్థించాలో, మీ భర్తకు కృతజ్ఞత చెప్పాలో అర్థంకాని అయోమయంలో పడవేశారు నన్ను మీ మాటలతో!'' అన్నాను.

''ఎందుకని?''

''మీ బాధ న్యాయమైనదే! అలాగే మీ భర్త మిమ్మల్ని వదిలివెయ్యకుంటే నాలాంటి దౌర్భాగ్యులకు హృదయమిచ్చి సేవించే నిజాయితీ గల నర్సులు ఎలా దొరుకుతారు సిస్టర్!'' అన్నాను.

''ఏది మంచో, ఏది చెడో మనం చూసే కోణాన్నిబట్టి కనిపిస్తూ వుంటుందని డాక్టర్ డేనియల్ చెప్తుంటాడు. మీ దృష్టిలో నాకు జరిగిన అన్యాయం మంచిదిగానే తోస్తూంది కదూ!'' అడిగింది బాధగా.

''ఊరకే అన్నాను! సీరియస్‌గా తీసుకోకండి. జీవితం విలువైంది. మనకు గాకున్నా, మరొకరికి అదే ఉపయోగపడే వీలుంటే చాలు. మన బ్రతుక్కి కొంత పరమార్థముంటుంది,'' అంటూ వేదాంతం చెప్పి సర్దాను.

ఆమె వెళ్ళిపోయేందుకు లేచి నిలుచుంది.

''సిస్టర్! డెల్లాకీ దినం ఎలా వుంది?'' అడిగాను.

''కాస్త నెమ్మదిగా వున్నట్లుంది. పెద్దగా అల్లరి చెయ్యలేదు. కాసేపు రెస్ట్ తీసుకుందికూడా నిద్రపోతూ'' అంది సిస్టర్.

"ఆమె మామూలు మనిషి అవుతుందా?"

"నేను డాక్టర్ని కాదు! నర్సును ఎలా చెప్పగలను?" ఎదురుప్రశ్న వేసింది నాకే.

"కాదు మామూలు మనిషిగా చెప్పండి."

"ఆమె మామూలు మనిషి కాలేదంటే ఏం చేస్తారు?" అడిగింది సిస్టర్.

అది ఆమెనుండి నేను ఆశించిన జవాబు కాదు. నేను అంత ఆత్రుతగా, ఆవేదనతో, ఆత్మీయురాలని ఆశించి అడిగినందుకన్నా, డెల్లా త్వరలోనే మామూలు మనిషి అవుతుందని చెప్పివుంటే ఎంతో ఆనందించగలిగేవాణ్ణి.

"ఏమీ చెయ్యను" అన్నాను దిగులుగా.

"అప్పుడే దిగజారిపోయారు. ఆమె త్వరలోనే కోలుకుంటుంది. డోంట్ ఆక్ట్ సిల్లీ. బై" అంటూ తలుపు మూసుకొని వెళ్ళిపోయింది.

కానీ ఆమె వేసిన ప్రశ్నలు, చెప్పిన జవాబులు నన్ను కొంత కలవరపెట్టాయి. కొద్ది దినాల క్రితంవరకు నన్నో పేషంటుగానే చూసిన ఆమెకు ఉన్నట్టుండి ఆదర్శ పురుషుడిగా చూడవలసిన అవసరం, అగత్యం ఎందుకొచ్చి వుంటాయాని ఆలోచించసాగాను.

ఈ రిసెర్చి సెంటరులో వున్నవాళ్ళంతా మగవాళ్ళే. ఇద్దరు నర్సులుమాత్రమే వున్నారు. ఆ రెండో నర్సును నేనూ చూశాను. ఈమెలా అందమైంది కాదు. పొట్టిగా, బొద్దుగా వుంటుంది. ఎవరో వెనుకనుండి తరుముతున్నట్లు చకచక వచ్చినపని చేసుకువెళ్తుంది. ఏమైనా అడిగితే

క్లిష్టంగా జవాబు చెప్తుంది. మొహంలో చిరాకు కొట్టొచ్చి నట్లు కనుపిస్తూ వుంటుంది. ఆమెకు ఎవరితోనన్నా సంబంధం వుందా? దానివల్ల, నా దగ్గరకెప్పుడూ వచ్చే నర్సు చూచేట్లు ఆనందం పొందివుంటే, ఈమెకూడా అలాంటి కోరికలు కలగడం సహజం. అలా జరిగిందను కున్నా, ఆమె వెంట తిరిగిన వ్యక్తి పోను మరో ఇరవై మంది మగవాళ్లు వుండివుండాలి దీవిలో. వాళ్ళల్లో ఎవర్నో ఒకర్ని చేరదీస్తే తన అవసరం సులభంగా తీరిపోయేది.

అలాగాకుండా, లేచి కూర్చోవటంకూడా చేతకాని, నాలాంటివాణ్ణి ఐడియల్ మనిషిగా ఊహించుకోవటం వెనుకనున్న రహస్యమేమిటి?

ఇంతలో డెల్లా గుర్తొచ్చింది. ఆమె గురించి అమెరికన్ నర్సు చెప్పిన సమాచారం తలచుకొని ఆనందించాను. ఆమెకూడా త్వరలోనే ఆరోగ్యం కుదుటపడితే, ఇద్దరం కలసి ఏదైనా దేశం వెళ్ళి, చేతనయిన పని చేసుకుంటూ, ప్రశాంతంగా జీవించాలనిపించింది.

ఎలాంటి ఇల్లు కట్టుకోవాలో, ఎటువంటి అందమైన చెట్లు వెయ్యాలో, ఎంతమంది పిల్లల్ని పెంచాలో, వాళ్లను ఎలా చదివించాలో, లాంటి అందమైన బంగారు ఆలో చనలు చేస్తూ కాలం గడుపుతూ పడుకున్నాను. రాత్రి సగంపైనే గడచిపోయి వుండాలని అనుకున్నాను. కళ్ళు బలవంతం చేసినా మూత పడటంలేదు.

(సశేషం)

## సప్లిమెంట్ పోటీ - 17.

44, 45, 46, 47, 48 — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు ఏప్రెల్ '76 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టు కార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30పై.లు స్టాంపులుపంపాలి. మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి. —ఎడిటర్

జోకర్స్ వినోదం

## 76

అప్పుడే వచ్చిన బస్సులోనికి ఆత్రుతగా జొరబడ్డాడు పల్లెటూరు రైతు. ఎక్కటమే తడవుగా తన బుట్ట కాస్త 'గేరు' ప్రక్కనే ఆనించి పెట్టాడు.

బస్సు స్టార్టు చేయబోయిన డ్రైవరు "ఏమయ్యో బుట్ట తియ్యి. గేరు వెయ్యాలి" అన్నాడు.

"ఫర్వాలేదులే బుట్టలో వెయ్యి. దిగేటప్పుడు యిచ్చి వెళ్ళిపోతా."

* * *

మంత్రిగారి భార్య అడిగింది "ఏమండీ, వరద ప్రాంతాలు చూసి వచ్చారు కదా! పంటలన్నీ పాడయినట్లేనా?"

"అప్పుడే ఎలా తెలుస్తుంది. పంటంతా నీళ్ళలో కదా వుంది. బయటపడితేగాని తెలీదు," అన్నాడు తాపీగా.

* * *

"ఏరా, అబ్బాయి; పిల్లల సినిమా ఎలా వుంది?"

"ఫర్వాలేదు డబ్బు లొస్తాయి. పాటలు, లవ్‌సీన్లు, బేతింగ్ డ్రెస్‌లో హీరోయిన్ బావుంది."

— పెందుర్తి మాస్టర్జీ, విజయవాడ.

## 77

"ఒక్క గుండుతోనే అతను చచ్చిపోయాడు కదా; హంతకుడు అతన్ని పదిసార్లు ఎందుకు కాల్చాల్సివచ్చింది?" సందేహం వచ్చింది జడ్జికి.

"అదికాదు సార్! హంతకుడికి బ్రహ్మచెముడు. రివాల్వర్ కాల్చిన ధ్వని వినిపించదని అన్ని సార్లు కాల్చాల్సి వచ్చింది."

* * *

"ఏమిటోయ్! ఇంకా నీ గర్ల్ ఫ్రండ్ రేఖతోనే తిరుగుతున్నావా!"

"లేదండి. ఎప్పుడో మానేశా."

"మంచిపని చేశావ్! ఇంతకీ ఆ అమ్మాయిని ఎలా వదిలించుకున్నావ్."

"పెళ్ళి చేసుకున్నాను."

* * *

"ఏమిట్రోయ్! మన అప్పారావ్ మాట మాటకు తెగ నవ్వేస్తున్నాడు."

"ఓ, ఇదా! వా డీ మధ్యనే ఓ బంగారపు పన్ను కట్టించుకున్నాడులే."

—కె. పి. అశోక్‌కుమార్, మచ్చబొల్లారం.

## 78

అప్పుడే అత్తవారింటినుంచి వచ్చిన అక్కతో, చెల్లెలు "బావున్నారా!" అంది.

"అదేమిటే వచ్చిరాగానె మా సంగతి అడక్క 'బావ' సంగతి అడుగుతున్నావ్?" కయ్ మంది అనుమానపు అక్కగారు.

"అబ్బే. అది కాదక్కయ్యా! మీరంతా బావున్నారా అన్నాను అంతే" అంది చెల్లెలు తెల్లబోతూ.

* * *

ఒక లారీ డ్రైవరు ఫుల్‌లోడ్ లారీని స్పీడ్‌గా నడిపిస్తున్నాడు రాత్రిపూట. అంతలో అడ్డంగా ఓ మనిషి వెళ్తున్నాడు. డ్రైవరు ఒక్కసారిగా బ్రేకుపై బలాన్నంతా చూపించాడు.

అంతే! 'ఫట్'మని శబ్దం చేస్తూ మంచం విరిగిపోయింది. కల చెదిరిపోయింది.

* * *

హాస్పిటల్ వూడ్చేవాడు తనకు వ్రాసిన 'నిన్ను పెళ్ళి చేసుకుంటాను' అన్న కాగితాన్ని తీసుకెళ్ళి, డాక్టర్‌కు చూపించింది నర్స్.

"క్షమించండి. నాకు పెళ్ళయింది" అన్నాడు డాక్టర్.

—ఆర్. జీవన్. పెంటకలాన్.

## 79

డిటెక్టివ్ గిరీశం వద్దకు ఓ ఆసామి వెళ్ళాడు.

"యస్?" అడిగాడు గిరీశం.

అతను జేబులోంచి ఓ కాగితం తీసి, దానిమీద "ఫూల్" అని వ్రాసి, ఆ కాగితాన్ని గిరీశానికి యిచ్చాడు.

గిరీశం ఒళ్ళు మండింది. అయినా తమాయించుకుని.

"మీరు వచ్చిన పనికూడా వ్రాసి యివ్వండి. మీ పేరు మాత్రమే వ్రాసిస్తే ఎలా?" అన్నాడు.

*   *   *

డిటెక్టివ్ శాండో:- నాకు వంటమనిషి కావాలని తెలిసి వచ్చానంటున్నావ్. అనుభవం వుందా? ఇంత క్రితం ఏం చేసే దానివి?

ఆమె:- ఉందండి. గాడిదల్ని మేపే దాన్నండీ!

*   *   *

లేడీస్ క్లబ్ ముందున్న లాన్‌లో కుర్చీల్లో కూర్చొని వున్నారు ఆదర్శ మహిళామణులు నలుగురు. సౌశీల్యం, సంస్కారంవంటి వాటిమీదఅనర్గళంగాసాగిపోతూంది చర్చ.

రోడ్డుమీద ఒక శవాన్ని ఎవరో మోసుకుపోతున్నారు.

మాటలు ఆపేసి, ఠక్కున లేచి నిలబడి తలొంచుకుంది సుశీలాదేవి.

శవాన్ని మోస్తున్నవాళ్ళు ఆ ప్రదేశాన్ని దాటి వెళ్ళిపోయారు.

సీతాదేవి చిన్నగా నిట్టూర్చి, "ఏమైనా నీ సంస్కారం చాలా గొప్పది సుశీలా!" అంది.

"ముప్పై ఏళ్ళుగా వారితో కాపురం చేశాను. ఇపుడు వారు కాటికి పోతుంటే కనీసం ఒక నిమిషం పాటైనా లేచి నిలబడకుంటే, ఇక మన సంస్కారం దేనికి చెప్పు!!!"

—సి. నాగభూషణ రెడ్డి, మద్రాసు-24.



